# ఆంధ్రప్రదేశ్ ను గురించి...

| | |
|---|---|
| విస్తీర్ణం .. .. .. .. .. | 1,06,286 చ. మై. |
| జిల్లాలు .. .. .. .. .. | 20 |
| తాలూకాలు .. .. .. .. .. | 189 |
| గ్రామాలు .. .. .. .. .. | 28,997 |
| పట్టణాలు, నగరాలు .. .. .. .. | 212 |
| మొత్తం జనసంఖ్య (1961) .. .. .. | 359.83 లక్షలు |
| జన సాంద్రత (1961) .. .. .. .. | 339 చ. మై. 18. |
| అక్షరాస్యులు (1961) .. .. .. .. | 76.27 లక్షలు |
| షెడ్యూల్డు కులాలవారు (1961) .. .. .. | 49.74 లక్షలు |
| షెడ్యూల్డు తెగలవారు (1961) .. .. .. .. | 13.24 లక్షలు |
| నమోదైన కర్మాగారాలు .. .. .. .. | 3,928 |
| విశ్వవిద్యాలయాలు .. .. .. .. | 4 |
| పంచాయతీలు .. .. .. .. | 15,266 |
| పంచాయతీ సమితులు .. .. .. .. | 321 |
| ఆంధ్రప్రదేశ్ నుండి పార్లమెంటు సభ్యులు .. .. .. | 61 |
| విధానసభ సభ్యులు .. .. .. .. | 288 |
| శాసనమండలి సభ్యులు .. .. .. .. | 90 |

# ఆంధ్ర ప్రదేశ్

సంపుటి: 12 ]

ఫిబ్రవరి – 1968

మాఘ – ఫాల్గుణ – 1889 శా.శ.

[ సంచిక: 4

ప్రధాన సంపాదకులు

**బి. యస్. రామన్,** ఐ. ఎ. యస్.

సంపాదకులు

**ఎన్. వి. గోపాలశాస్త్రి**

## ఈ సంచికలో...

పేజీ



**మొదటి అట్ట :** హైదరాబాదులో రిపబ్లిక్ దినోత్సవ పరేడులో గవర్నరు వందన స్వీకారం చేస్తున్న దృశ్యం

**మూడవ అట్ట :** రమ్‌జాన్ ప్రార్థన తర్వాత పరస్పర శుభాకాంక్షలు

**నాలుగవ అట్ట :** నూలు కర్మాగారం లోపలి దృశ్యం

*ఈ సంచికలోని రచయితల అభిప్రాయాలు ప్రభుత్వానికి సంబంధించినవి కావు. సం॥*

# రిపబ్లిక్ దినోత్సవం





దేశమంతటా ప్రజలు 18 వ రిపబ్లిక్ దినోత్సవాన్ని ఉత్సాహంతో ఘనంగా జరుపుకున్నారు. రంగురంగుల దీపాలంకరణ, సంరంభం, స్వాతంత్ర్యం లభించిన వెంటనే జాతి జరుపుకున్న ఉత్సవాలను గుర్తుకు తెచ్చాయి. ధైర్య సాహసాలు, ప్రతిభ ప్రదర్శించిన వారికి ప్రకటించిన అవార్డులను, ప్రత్యేకంగా జరిగిన సమావేశాలు, విన్యాసాలలో పంపిణీ చేశారు. చైనా దురాక్రమణ ఫలితంగా 1962 లో ప్రకటించిన అత్యవసర పరిస్థితిని తొలగించిన తర్వాత ప్రథమంగా ప్రజలు ఢిల్లీలో సంతోషంతో యీ వేడుకలను జరుపుకున్నారు.

రాష్ట్రపతి డాక్టర్ జాకిర్ హుస్సేన్ సైనిక వందనం స్వీకరించిన సందర్భంలో ఇద్దరు ప్రపంచ ప్రముఖులు, యుగోస్లావియా ప్రెసిడెంటు టిటో (ఆయన సతి), సోవియట్ ప్రధాని శ్రీ ఎలగ్జి కొసిగిన్, ఆయన కుమార్తె శ్రీమతి గ్విషియానీ హాజరు అయ్యారు.

ఎల్లప్పుడు ప్రజలకు ఉత్సాహం కలిగించే యీ సైనిక విన్యాసం మరో రెండు ప్రత్యేక కారణాలవల్ల ప్రజలను మరింతగా ప్రభావితం చేసింది. మనదేశ వైమానిక దళం సేకరించిన భూమి నుండి ఆకాశానికి ఉపయోగించే గైడెడ్ మిసిలీలను ప్రప్రథమంగా యీ విన్యాసాల సందర్భంలో ప్రదర్శించడం విశేషం.

ఇటీవలి సంవత్సరాలలో జరగని రీతిలో భారీ ఎత్తున 136 విమానాల విన్యాసం జరగడం మరొక ఆకర్షణ.

## నగరంలో అద్భుతమైన విన్యాసం

నగరంలో లక్షలాది ప్రజలు మనదేశ సైనిక బలాన్ని వారి క్రమశిక్షణను తమ యింటిముందు నిలబడే తిలకించే అవకాశం యీ సంవత్సరం కలిగింది. రిపబ్లిక్ పరేడు, మార్చ్‌పాస్ట్ ఎంతో ఆసక్తితో అందరు చూచే అవకాశం లభించడం యిదే ప్రథమం.

గతంలో మాదిరి, పరేడు చూచే నిమిత్తం ప్రజలు సికింద్రాబాద్ పరేడు మైదానానికి వెళ్ళాల్సిన అవసరం కలుగలేదు. ప్రాంతీయ కమాండర్ బ్రిగేడియర్, ఎల్.ఇ.ఆర్.బి. ఫెర్రిస్ రాష్ట్ర ప్రభుత్వంతో జరిపిన సంభాషణల కారణంగా విన్యాస సిబ్బంది టాంకుబండ్ లోతట్టులో కూడి, అక్కడినుండి టాంక్ బండ్ పోలీసు స్టేషన్, సచివాలయం, ఏ. జి. ఆఫీసు, రవీంద్ర భారతి, పబ్లిక్ గార్డెన్స్, నాంపల్లి, మోజంజాహి మార్కెటు, అబిడ్ రోడ్డు, గన్ఫౌండ్రి, బషీర్బాగ్ మార్గంగా వెళ్ళి, తిరిగి బయలుదేరిన స్థానం చేరుకున్నారు.

గవర్నరు శ్రీ పట్టం ఎ. థాను పిళ్ళై పబ్లిక్ గార్డెన్స్‌కు ఎదురుగా సర్దార్‌పటేల్ విగ్రహం వద్ద వందన స్వీకారం చేశారు. ముఖ్యమంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి, యితర మంత్రులు, శాసనసభ అధ్యక్షులు శ్రీ బి.వి. సుబ్బారెడ్డి, శాసనమండలి అధ్యక్షులు శ్రీ జి. బ్రహ్మయ్య, ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి. జగన్మోహనరెడ్డి, యితర న్యాయమూర్తులు, పెక్కుమంది అధికార అనధికార సభ్యులు యీ సందర్భంలో హాజరు అయ్యారు.



రిపబ్లిక్ దినోత్సవం సందర్భంగా హైదరాబాదులోని పబ్లిక్ స్కూలులో వందన స్వీకారం చేస్తున్న ముఖ్యమంత్రి

నగర ప్రజలు ఉదయంనుండే దారి పొడుగునా బారులు తీర్చి, ఫిరంగిదళం, ఆర్టిలరీ కోర్, ఇ.ఎం.ఇ, కంబట్ ఇన్ఫాంట్రీ దళాలు, గార్డ్స్ బ్రిగేడ్, మరాఠాలైట్ ఇన్ఫాంట్రీ. కుమౌన్, అస్సామ్. బీహార్ రెజిమెంట్ సైనిక దళాలు, ఐ. ఎ. ఎఫ్. ప్రాంతీయ సైనిక యూనిట్లు, ఆంధ్రస్పెషల్ పోలీసు ఎన్.సి.సి, హోంగార్డ్స్, పోలీసులు, అగ్నిమాపక దళం విన్యాసాన్ని, 11 బ్యాండ్ పైప్ డ్రమ్ములు మొదలైన వాద్యాల విన్యాసాన్ని తిలకించారు.

ఈ విన్యాసానికి తోడు హకీంపేట వైమానిక దళం కేంద్రం జెట్ శిక్షణ విభాగానికి చెందిన జెట్ విమానాల విహార విన్యాసం కూడ జరిగింది.

ఈ విన్యాసంలో పాల్గొన్న వివిధ యూనిట్లను గూర్చిన వివరాల వ్యాఖ్యానం కూడ దారి పొడుగునా ప్రజలు వినే సదుపాయం కలిగించారు.

8 కిలోమీటర్ల మార్గంలో యీ పరేడు 3 గంటలు నిర్వహించబడింది.

సాయంత్రం గవర్నరు శ్రీ పట్టం ఎ. థాను పిళ్ళై వారి సతీమణి రాజభవనంలో 'విందు' ఏర్పాటు చేశారు. మంత్రులు, హైకోర్టు న్యాయమూర్తులు శాసన సభ్యులు, అధికార అనధికార ప్రముఖులు యీవిందుకు హాజరు అయ్యారు.

## దేశ సమైక్యతను సంరక్షించాలని గవర్నరు విజ్ఞప్తి

దేశం క్లిష్ట దశను ఎదుర్కొంటున్న దృష్ట్యా ప్రజలు క్రమశిక్షణతోను, సమర్థవంతంగాను, నిజాయితీ విధేయతలతోను తమ విధులను నిర్వహించాలని గవర్నరు శ్రీ పట్టం ఎ. థాను పిళ్ళై ఉద్ఘాటించారు.

రిపబ్లిక్ దినోత్సవం సందర్భంగా ఆలిండియా రేడియో హైదరాబాదు కేంద్రం ప్రసారం చేసిన తమ సందేశంలో దేశ సౌభాగ్యానికీ, ఉన్నత జీవనస్థాయి లక్ష్య సాధనకూ ఆంధ్రప్రదేశ్ ప్రజలు తమనుతాము మరొకసారి అంకితం చేసుకుంటారని తాను విశ్వసిస్తున్నానని ఆయన అన్నారు.

గవర్నరు తమ సందేశంలో యిలా అన్నారు:

"1967వ సంవత్సరం పూర్వార్ధ భాగంలో దేశంలో సార్వత్రిక ఎన్నికలు ప్రశాంతంగా జరిగాయి. స్వతంత్ర భారత దేశంలో సార్వత్రిక ఎన్నికలు జరగడం ఇది నాలుగవసారి. ఎన్నికల అనంతరం ఏర్పడిన పరిస్థితి, ప్రజా స్వామ్యంపట్ల, జనవాక్యం ఆధిక్యంపట్ల మనకుగల విశ్వాసాన్ని ప్రతిఫలింపజేసింది.

ఆంధ్ర ప్రదేశ్ భారత దేశపు ధాన్యాగారంగా ఖ్యాతి పొందింది. వరి ఉత్పత్తిలో ఇది సాధారణంగా మిగులు రాష్ట్రం. గత అనేక సంవత్సరాలుగా మన రాష్ట్రం పెద్దఎత్తున ధాన్యం సేకరించి తరుగు రాష్ట్రాలకు ఎగుమతి చేస్తున్నది. 1965_66వ సంవత్సరం లోను, ఆ తర్వాత 1966_67వ సంవత్సరం లోనూ అనావృష్టి ఏర్పడడంవల్ల మన రాష్ట్రంలో ఆహార ధాన్యాల ఉత్పత్తికి పెద్దదెబ్బ తగిలింది. ఐతే 1967_68వ సంవత్సరంలో రైతు పరిస్థితులు గత రెండు సంవత్సరాలలో కంటె మెరుగ్గా ఉండడం సంతోషం. ఆహారోత్పత్తిని హెచ్చించడానికి రాష్ట్ర ప్రభుత్వం సాధ్యమైన చర్యలన్నీ గైకొంటున్నది. ఆహార ధాన్యాల ఉత్పత్తిదారులకు కనీస ధర చెల్లించి ప్రోత్సహించే నిమిత్తం రాష్ట్ర ప్రభుత్వం వరి, జొన్న ధాన్యాలకు కనీస ధరలు ప్రకటించింది.

ప్రకటించబడిన ధరలకన్నా తక్కువ స్థాయికి ధరలు పడిపోయినప్పుడు రాష్ట్ర ప్రభుత్వం తరఫున ఆహార కార్పొరేషన్, ఉత్పత్తిదారుల నుండి వారు ఇవ్వగలిగిన పరిమాణంలో సహాయక ధరకు కొనుగోలు చేస్తుంది. రాష్ట్రంలో పౌర సరఫరాల నియంత్రణకు చెందిన నిబంధనలను అమలు జరపడానికి వీలుగా పోలీసు



కొత్త ఢిల్లీలో జరిగిన రిపబ్లిక్ దినోత్సవ వేడుకలలో పాల్గొన్న ఆంధ్రప్రదేశ్ కళాకారుల బృందం కేంద్ర రక్షణమంత్రి సర్దార్ స్వరణ్‌సింగ్‌తో

సూపరింటెండెంటు అధ్వర్యంలో ప్రత్యేక పరిశోధక దళాన్ని ప్రభుత్వం నియమించింది. అక్రమ నిల్వదారులు, అక్రమ వ్యాపారస్థులు, ఆహార ధాన్యాలద్వారా అక్రమ లాభార్జన చేసే ఇతర సంఘ వ్యతిరేక శక్తుల చర్యలను అరికట్టడానికి యీ సిబ్బంది కృషి చేస్తున్నది. ఈ నిరోధక చర్యల ఫలితంగా మన రాష్ట్రంలో ఆహార పరిస్థితి సంతృప్తికరంగా ఉన్నదని తెల్పడానికి నేను సంతోషిస్తున్నాను.

1966_67 వ సంవత్సరంలో వ్యవసాయోత్పత్తులలో తగ్గుదల, వ్యవసాయం ఆధారంగాగల పరిశ్రమలు, ఇంజనీరింగు పరిశ్రమలలో ఉత్పత్తులలో తగ్గుదల, దేశం మొత్తంలో ఇతర పరిస్థితులు వీటి ఫలితంగా ఆంధ్రప్రదేశ్ ఆర్థిక పరిస్థితి కొంత కుంటుపడింది. 1967 జూన్ నాటినుండి పారిశ్రామిక కార్యక్రమాలు తిరిగి కొంత చురుకుగా కొనసాగనారంభించాయి. ఐతే ఉపాధి సౌకర్యాలు, కార్మిక పరిస్థితులు అంత ప్రోత్సాహకరంగా లేవు. ఆర్థిక రంగంపై ద్రవ్యోల్బణ ప్రభావం 1966_67 కన్నా కొంత తక్కువగా ఉంది. ఈ సంవత్సరం రాష్ట్రంలోనే అనేక ప్రదేశాలలో పంటల పరిస్థితులు సంతృప్తికరంగా ఉన్న కారణంగా రాష్ట్రంలో ఆర్థిక పరిస్థితులు మెరుగుపడి అభివృద్ధి కార్యక్రమాలు చురుకుగా కొనసాగుతాయని ఆశింపబడుతున్నది.

రాష్ట్రంలో నీటి పారుదల కార్యక్రమాలు సంతృప్తికరంగా కొనసాగుతున్నాయి. నాగార్జునసాగర్ డాం నిర్మాణం పూర్తి కావచ్చింది. కాలువల త్రవ్వకం పని చురుకుగా కొనసాగుతున్నది. 1967 జులైలో నాగార్జున సాగర్ నుండి 65 లక్షల ఎకరాలకు నీటి పారుదల సౌకర్యం కల్పించారు. 1970_71 ఆఖరునాటికి 13.74 లక్షల ఎకరాలకు నీరు సరఫరా చేస్తారని ఆశిస్తున్నారు. 1967 ఆగష్టు 4 వ తేదీన ప్రధానమంత్రి రిజర్వాయరునుండి కాలువలకు నీరు విడుదల చేయడం యీ సంవత్సరపు ప్రధాన సంఘటనగా పేర్కొనవచ్చు. ఇంతవరకు ఖరీఫ్, రాబి కాలంలో 5.33 లక్షల ఎకరాలకు నీరు వినియోగించారు. దానికితోడు కృష్ణా డెల్టాలో 1968 జనవరినుండి ఏప్రిల్ వరకు రెండవపంట నిమిత్తం 3.50 లక్షల ఎకరాల మేరకు నీరు సరఫరా చేయాలని ఉద్దేశించారు. అంతేగాక ఆలస్యంగా వేసే రెండో పంటకు చెందిన మరో 3.5 లక్షల ఎకరాలకు కూడ నాట్ల నిమిత్తం 1968 ఫిబ్రవరి 25 వ తేదీ నుండి నీరు సరఫరా చేస్తారు. పోచంపాడు ప్రాజెక్టు నిర్మాణం పని చురుకుగా కొనసాగుతున్నది.

పారిశ్రామిక రంగానికి సంబంధించి రాష్ట్రంలో పారిశ్రామిక అభివృద్ధి చురుకుగా కొనసాగుతున్నది. ఐతే ఇటీవల కొన్ని పరిస్థితుల కారణంగా దేశమంతటిమాదిరిగానే రాష్ట్రంలోకూడా కొన్ని ఇంజనీరింగు, వస్త్రపరిశ్రమలలో అభివృద్ధి కొంత కుంటుపడింది. ప్రయివేటు, పబ్లిక్ రంగంలో నిర్మించబడిన కొత్త పరిశ్రమలు ఉత్పత్తిని ప్రారంభించడం హర్షించదగిన విషయం. అందులో ఇటీవలనే ప్రారంభోత్సవం చేయబడిన విశాఖపట్నంలోని కోరమాండల్ ఎరువుల ఫ్యాక్టరీని గూర్చి ప్రత్యేకంగా పేర్కొనవచ్చు. రాష్ట్రంలోని రైతులకు తగినన్ని ఎరువులు సరఫరా చేయడంలో ఇది తోడ్పడుతుంది. కొత్తగూడెంలో కూడ ఎరువుల కర్మాగారాన్ని నెలకొల్పాలని కేంద్రప్రభుత్వాన్ని రాష్ట్రప్రభుత్వం కోరుతున్నది. గత సంవత్సరం అణుశక్తి సంఘం వారికి చెందిన భారత ఎలక్ట్రానిక్స్ కార్పొరేషన్ ఉత్పత్తి ప్రారంభించింది. పబ్లిక్ రంగంలోని ముఖ్యమైన వాటిలో ఇదొకటి. పబ్లిక్ రంగంలో కొత్తగా హైద్రాబాదులో టెలికమ్యూనికేషన్ కేబిల్స్ పరిశ్రమ, విశాఖ పట్టణంలో హెవీ ప్లేట్స్, వెసెల్స్ పరిశ్రమ, నెలకొల్పుతున్నారు.

రాష్ట్ర పబ్లిక్ రంగంలో ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికమండలి ఒక ఫోర్జింగ్ ప్లాంటును ఏర్పాటు చేస్తున్నది. త్వరలోనే ఇది పనిప్రారంభింపగలదు. బియరింగ్స్, గాసులకు సంబంధించిన మరొక రెండు పెద్ద కర్మాగారాల పనినికూడా యీ మండలి చేపట్టింది. వీటి నిర్మాణంకూడా సంతృప్తికరంగా సాగుతున్నది.

ఆంధ్రప్రదేశ్ నాల్గవ ప్రణాళికలో విద్యుచ్ఛక్తి ప్రధాన స్థానం ఆక్రమిస్తుంది. ఇంతకు ముందటి మూడు ప్రణాళికల్లోను నీటి పారుదల ప్రముఖస్థానం వహించింది.

ఆరోగ్య, వైద్య విషయాలలో రాష్ట్ర ప్రభుత్వం తన బాధ్యతలను చక్కగా నిర్వహిస్తున్నది. గడచిన మూడు ప్రణాళికల కాలంలోనూ రూ. 15 కోట్ల మేరకు వైద్య విషయాలకు సంబంధించిన కార్యక్రమాలక్రింద వెచ్చించడం జరిగింది. రాష్ట్రంలో కుటుంబ నియంత్రణ కార్యక్రమం శీఘ్రంగా విస్తరిస్తున్నది.

చరిత్రలో అతిక్లిష్ట దశలోనుంచి యీనాడు మనం ప్రయాణిస్తున్నాం. మనం మన దేశాన్ని పటిష్ఠవంతం చేయవలసి ఉంది. మన విధులను సమర్థవంతంగా, చిత్తశుద్ధితో నిర్వహించాలి. క్రమ శిక్షణ అనేది మన యువకులకు ఉండవలసిన ప్రాథమిక గుణమని నేను భావిస్తుంటాను. విద్యార్థులకు విద్య గరపడమేగాక వారిని క్రమ శిక్షణాతత్పరులుగా తీర్చి దిద్దడంలో మన విద్యా సంస్థలు ప్రముఖ పాత్ర వహిస్తాయని ఆకాంక్షిస్తున్నాను. యువక హృదయాలలో క్రమ శిక్షణను గాఢంగా నాటి, భవిష్యత్తులో వారి వారి జీవనయానంలో ఎదురయ్యే కష్టాలను ధైర్యంగానూ, సంతోషంతోనూ, సహనంతోనూ ఎదుర్కొనేటట్టు విద్యా సంస్థలు విద్యార్థులను తీర్చి దిద్దగలవని విశ్వశిస్తున్నాను.

మనం మన లక్ష్యాలకు పునరంకితులం కావలసిన యీ రోజున ఆంధ్రప్రదేశ్ ప్రజలు రాష్ట్రాభివృద్ధికీ, దేశ శ్రేయస్సుకూ, తమ జీవన ప్రమాణాన్ని మెరుగు పరచుకోవడానికీ కలిసికట్టుగా కృషి చెయ్యగలమన్న తమ దృఢ సంకల్పాన్ని మరొకసారి పునరుద్ఘాటించ గలరని నేను విశ్వశిస్తున్నాను."





అవినీతి నిరోధకశాఖ (విజయవాడ) పోలీసు ఇనస్పెక్టర్ శ్రీ వి. రాజశేఖరరెడ్డికి ప్రశంసా పాత్రమైనసేవకు పోలీసు పతకాన్ని బహూకరిస్తున్న గవర్నరు



ప్రశంసా పాత్రమైన సేవకుగాను శ్రీ మీర్ అహమద్ అలీకి పోలీసు పతకాన్ని గవర్నరు బహూకరిస్తున్న దృశ్యం

# రిపబ్లిక్ దినోత్సవం అవార్డులు

ఈ సంవత్సరం రిపబ్లిక్ దినోత్సవం అవార్డులు ప్రధానం చేయడానికి 77 మందిని ఎన్నిక చేశారు. అందులో ఐదుగురికి 'పద్మ విభూషణ్', 28 మందికి 'పద్మభూషణ్', 44 మందికి 'పద్మశ్రీ' యిచ్చారు.

*''పద్మ విభూషణ్'' పొందినవారు*

1. శ్రీ క్రిపాల్‌సింగ్, రైల్వేబోర్డు మాజీ అధ్యక్షులు
2. శ్రీ కె. వి. కె. సుందరం, మాజీ ఛీఫ్ ఎలక్షన్ కమీషనరు
3. డాక్టర్ ఎం. ఎస్. ఆనే, విదర్భ నాయకుడు.
4. ఆచార్య పి. సి. మహాలనోబిస్ సుప్రసిద్ధ ఆర్థిక శాస్త్రవేత్త.
5. డాక్టర్ ఎస్. చంద్రశేఖర్, అంతర్జాతీయ ఖ్యాతిగాంచిన వైద్యుడు

*''పద్మభూషణ్'' బిరుదు పొందిన కొందరు.*

1. ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య, విద్యావేత్త, ఆంధ్రప్రదేశ్.
2. శ్రీ ఎం. చలపతిరావు, జర్నలిస్టు, క్రొత్తఢిల్లీ.
3. డా॥ సి. రాధాకృష్ణారావు, డైరెక్టరు, స్కూల్ ఆఫ్ ట్రేనింగ్, ఇండియన్ స్టాటిస్టికల్ సంస్థ, కలకత్తా.
4. డా॥ బి. పి. పాల్, డైరెక్టర్ జనరల్, ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ అగ్రికల్చరల్ రీసర్చి, క్రొత్తఢిల్లీ.
5. శ్రీ బిస్మిల్లాఖాన్, సంగీతవిద్వాంసుడు, ఉత్తరప్రదేశ్
6. శ్రీ జి. నరసింహన్, జర్నలిస్టు, మద్రాసు
7. శ్రీ జి. కె. శంకర కురుప్, మళయాళ కవి, కేరళ
8. డా॥ కె. ఎస్. కరంత్, నవలా రచయిత, నాటక కర్త, నటులు, మైసూరు.
9. శ్రీ ఎం.పి.జి. పెరియస్వామి "తూరాన్" తమిళరచయిత, మద్రాసు.
10. డా॥ ఎం. రత్నస్వామి, విద్యావేత్త, మద్రాసు
11. శ్రీమతి మేరీ క్లబ్‌వాలా జాదవ్, సాంఘిక కార్యకర్త, మద్రాసు.
12. డా॥ ఎం. సి. మోడి, కంటిసర్జన్, మైసూరు
13. శ్రీ రఘుపతి సహాయ్, 'ఫిరక్' ఉర్దూరచయిత, ఉత్తర ప్రదేశ్.
14. లెఫ్టినెంట్ జనరల్, మానిక్‌షా, జనరల్ ఆఫీసర్ కమాండింగ్ ఇన్ చీఫ్, ఈస్టర్న్ కమాండు.
15. శ్రీ డి. సేత్వాల్కార్, సంస్కృత పండితుడు, గుజరాత్.

(తరువాయి 38 వ పుటలో)

# నాడూ-నేడూ

# ఆంధ్రప్రదేశ్‌లో రవాణా, రాకపోకల సౌకర్యాలు

సి. వి. హెచ్. రావు



*ఆధునిక కాలంలో దేశాభివృద్ధికి రహదార్లు జీవనాడులు. రవాణాసౌకర్యాలు, ఈ జీవనాడులను పరిపోషించి స్పందింపజేసే రక్త ప్రసారాలు.*

ప్రణాళికలు ప్రారంభమై పదిహేడు సంవత్సరాలు గడిచాయి. కాని ఆంధ్రప్రదేశ్ రోడ్డు తదితర రాకపోకల సాధనాల అభివృద్ధిలోనూ, రోడ్డు రవాణా అభివృద్ధిలోనూ, రాష్ట్రం విస్తీర్ణం జనాభా, ఆర్థికాభివృద్ధి అవసరాలకు తగిన సౌకర్యాలు కల్పించడంలోనూ చాలావరకు పురోభివృద్ధి సాధించవలసి వుంది. ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలో ఈ సదుపాయాలు చాలినంతగా లేవు.

రవాణా, రాకపోకల సౌకర్యాల విషయంలో ఆంధ్రప్రాంతం అభివృద్ధి జెందినంతగా తెలంగాణా ప్రాంతం అభివృద్ధి జెందలేదు. ఆంధ్రప్రాంతంలో రవాణా, రాకపోకల సౌకర్యాలు మెరుగ్గావున్నప్పటికీ అవి సమర్థవంతంగా చాలినంతగామాత్రం లేవు. రోడ్ల నిడివిని పెంచడమేగాకుండా, రవాణా శీఘ్రంగా జరగడానికి వీలుగా బండ్లు, భారీ శకటాలు సులభంగా ప్రయాణం చేయడానికి వీలుగా ప్రస్తుత రోడ్ల నిర్వహణనూ, స్థాయినీ బాగా అభివృద్ధి పరచవలసి వుందికూడా. అప్పుడే త్వరితంగా విస్తృతి జెందుతున్న రాష్ట్రపు వ్యావసాయక, పారిశ్రామిక, ఆర్థిక అవసరాలను ఆదుకోవడానికి వీలు కలుగుతుంది. రోడ్డు రవాణా అభివృద్ధి సక్రమంగా జరగలేదు. అందువల్ల ప్రస్తుతపు రోడ్డు మార్గాలనుకూడా సక్రమంగా వినియోగించుకోవడం జరగలేదు. పొరుగు రాష్ట్రాలైన మద్రాసు, మైసూరు, మహారాష్ట్రలతో పోల్చినప్పుడు ఆంధ్రప్రదేశ్‌లో రోడ్డు రవాణా, సరుకు రవాణా శకటాలు తక్కువ సంఖ్యలో వున్నాయి.

అయితే గత పంచవర్ష ప్రణాళికలు అన్నింటిలోనూ పరిస్థితి క్రమేపీ మెరుగవుతూ వస్తున్నదనడంలో సందేహం లేదు.

మొదటి పంచవర్ష ప్రణాళిక ప్రారంభంలో మొత్తం రోడ్ల నిడివి ఆంధ్ర ప్రాంతంలో 14,241 మైళ్లు, తెలంగాణా ప్రాంతంలో 4,348 మైళ్ళు. రాష్ట్ర రెండవ ప్రణాళికలో రోడ్ల అభివృద్ధి నిమిత్తం రూ. 5.93 కోట్లు కేటాయించారు. (ఆంధ్రకు రూ. 4.07 కోట్లు, తెలంగాణాకు రూ. 1.80 కోట్లు) ప్రస్తుతపు రాష్ట్ర రహదార్లను వృద్ధి పరచటం, జిల్లాబోర్డు రోడ్లను స్వాధీనం చేసుకోవడం, రాష్ట్ర రహదార్లను జాతీయ రహదార్లతో కలపడం ఇవి రోడ్ల అభివృద్ధి కార్యక్రమంలో చేర్చబడినాయి.

రాష్ట్రంలో అభివృద్ధిజెందని ప్రాంతాలు చాలా వున్నాయి. వాటిలో ఖనిజ సంపద, అటవీ సంపత్తి సమృద్ధిగా వుంది. అనేక గ్రామాలనుంచి పట్టణాలకు వెళ్ళడానికి కానీ, వ్యవసాయోత్పత్తులను మార్కెటు కేంద్రాలకు చేరవేయడానికిగానీ సరిఅయిన రోడ్డు సదుపాయాలు అంతగా లేవు. ఈ పరిస్థితుల దృష్ట్యా రాష్ట్ర మూడవ ప్రణాళికలో రోడ్లు, రాకపోకల సౌకర్యాల అభివృద్ధి పట్ల ముందు చూపుతో కూడిన నిర్మాణాత్మక దృక్పథం వహించటం ముదావహం. మూడవ ప్రణాళిక ప్రారంభంలో, జాతీయ స్థాయిలో 20 సంవత్సరాల కాలంలో సుమారు రూ. 5,200 కోట్ల ఖర్చుతో రోడ్లను అభివృద్ధి పరచటానికి ఒక విస్తృత ప్రణాళికను రూపొందించారు. ఈ వ్యయంలో ఆంధ్ర ప్రదేశ్ రెండు దశాబ్దాల కాలంలో రూ. 480 కోట్లు ఖర్చు చేయవలసి వుంటుంది. కాబట్టి రాష్ట్ర రోడ్డు అభివృద్ధి ప్రణాళికలను, అఖిల భారత ప్రణాళిక క్రింద రాష్ట్రానికి నిర్ణయించిన లక్ష్యాల ననుసరించి సిద్ధం చేయవలసి వుంటుంది.

రెండవ ప్రణాళికలో పూర్తికాకుండా మిగిలిపోయిన పథకాలను మూడవ ప్రణాళికలో చేర్చారు. అవి ఇవి: 13 మైళ్ల

పొడవున క్రొత్త రోడ్లు వేయడం, 212 మైళ్ళ పొడవున రోడ్లకు తారువేయడం, 37 మైళ్ళ పొడవున కంకరవేయడం, 21 మైళ్ళ పొడవున సిమెంటు కాంక్రీటు చేయడం. మూడవ ప్రణాళికలో చేర్చిన కొత్త పథకాలు యివి: 53 మైళ్ల పొడవున తారువేయడం, 38 మైళ్ల పొడవున కంకర వేయడం, 25 మైళ్ల పొడవున సిమెంటు కాంక్రీటు చేయడం, 23 మైళ్ళ పొడవున క్రొత్త రోడ్లు వేయడం, 7 భారీ వంతెనలు, 14 చిన్న వంతెనలు, 200 కల్వర్టులు నిర్మించడం. ఈ పనులన్నింటికి రూ. 3.25 కోట్ల కేటాయింపును ప్రతిపాదించారు. సుమారు 1,500 మైళ్ల నిడివిగల జిల్లా రోడ్లను స్వాధీనం చేసుకొని వాటిని రాష్ట్ర రహదార్ల స్థాయికి అభివృద్ధిపరచడం, తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలలో జాతీయ రహదార్ల వినియోగాన్ని పెంపొందించడం కూడా ఈ కార్యక్రమంలో భాగమే.

## గ్రామీణ రోడ్ల అభివృద్ధి

ఆంధ్ర ప్రాంతంలో గ్రామీణ రోడ్లను, రాకపోకల సదుపాయాలను అభివృద్ధిపరచడానికి మూడవ ప్రణాళికలో మొదటిసారిగా ప్రత్యేక ప్రాధాన్యం ఇచ్చారు. ఇందుకు రూ. 83 లక్షలు కేటాయించారు.

మూడవ ప్రణాళికలో తెలంగాణా ప్రాంతానికి చేసిన కేటాయింపులు ఈవిధంగా వున్నాయి :— క్రిందటి ప్రణాళికలో పూర్తి కాకుండా మిగిలిపోయిన కార్యక్రమాలను పూర్తి చేయడానికి రూ. 1.45 కోట్లు; క్రొత్త పథకాలకు రూ. 35 లక్షలు, గ్రామీణ రోడ్ల కార్యక్రమాలకు రూ. 80 లక్షలు ప్రత్యేకించారు.

ఈ ప్రణాళికా కాలంలో, రోడ్ల అభివృద్ధి, రాకపోకల అభివృద్ధి పథకాలనుగురించి చేసిన ఖర్చులోనూ, సాధించిన భౌతిక ఫలితాలలోనూ మంచి అభివృద్ధి జరిగింది. ఈ ప్రణాళిక ముగింపు నాటికి ఆ రంగంలోని పథకాలకు రూ. 16.84 కోట్లు వెచ్చించారు. రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థకు ఆర్థిక సహాయంక్రింద ఇచ్చిన రూ. 3 కోట్లుకూడా ఈ మొత్తంలో చేరివున్నాయి. నికరంగా జరిగిన అభివృద్ధి వివరాలు ఇవి:— 270 మైళ్ల పొడవున క్రొత్త రోడ్లు వేశారు. రోడ్లకు 506 మైళ్ళ పొడవున తారు వేశారు. 67 మైళ్ళ పొడవున సిమెంటు కాంక్రీటువేశారు. భారీ, చిన్నరకం వంతెనలు, కల్వర్టువంతెనల నిర్మాణంతోసహా 494 రాయి, సున్నం పనులు చేశారు. జిల్లా ప్రాంతాలలో జిల్లా పరిషత్తులు 600 మైళ్ళ పొడవున పక్కారోడ్లను, 1,800 మైళ్ల పొడవున కచ్చారోడ్లను నిర్మించాయి.

నాలుగవ ప్రణాళికను నికరంగా రూపొందించే సమస్యను 1969 నాటికి వాయిదా వేశారు. 1966–67, 1967–68 రెండు సంవత్సరాల రాష్ట్ర పథకాలలో విద్యుచ్ఛక్తి, నీటిపారుదల, వ్యవసాయం వంటి ప్రాధాన్యంగల పథకాలకన్నా రవాణా, కమ్యూనికేషన్ పథకాలకు తక్కువ నిధులు కేటాయించారు. 1966–67 లో రు. 2.93 కోట్లు, 1967–68 లో రు 2.23 కోట్లు కేటాయించారు. 1966–67 సంవత్సరపు కేటాయింపులకు జాతీయ, రాష్ట్ర రహదార్లు (రు. 1.78 కోట్లు), జిల్లాపరిషత్తు, పంచాయతీ సమితి రోడ్లు (రు 0.55 కోట్లు), రాష్ట్ర రోడ్డు రవాణా కార్పొరేషన్ పెట్టుబడి నిధులలో రాష్ట్ర వాటాధనం (రు 60 లక్షలు), 3 ఉప పద్దులుగా విభాగించారు. అయితే అభివృద్ధి చెందుతున్న ప్రాంతాలలో ముఖ్యంగా నాగార్జునప్రాజెక్టు ప్రాంతంలో కమ్యూనికేషన్ సౌకర్యాలను త్వరితగతిని అభివృద్ధి చేయాల్సిన దృష్ట్యా ప్రణాళికా కేటాయింపులను మించి రు 27.62 లక్షలు రాష్ట్ర రహదారుల నిమిత్తం అదనంగా ఖర్చు చేయాల్సి వచ్చింది. ప్రాజెక్టు ద్వారా విస్తృత ప్రాతిపదికపై యితోధిక ప్రయోజనాలు పొందుతూ సాధ్యమైనంత ఎక్కువ భూమిని సేద్యం చేసి తద్వారా లభించిన ఉత్పత్తులను విక్రయించడానికి ఎక్కువ సంఖ్యలో మార్కెటింగ్ కేంద్రాలను నెలకొల్పి, రాకపోకల సౌకర్యాల నిమిత్తం రోడ్లు కమ్యూనికేషన్లు ఎక్కువగా ఏర్పాటు చేయడానికి యీ నిధుల కేటాయింపు అవసరమైంది.

గ్రామీణ పరిశ్రమల రంగంలోను, వ్యవసాయ ఉత్పత్తుల విషయంలోను ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం త్వరితగతిని అభివృద్ధి సాధిస్తున్న దృష్ట్యా మూడవప్రణాళికా కాలంలోనే ప్రాముఖ్యతను గుర్తించబడిన జిల్లా, గ్రామాల రోడ్ల అభివృద్ధి నేడు మరింత ప్రాధాన్యతను సంతరించుకున్నాయి. వ్యవసాయ క్షేత్రాలనుండి ఆహారధాన్యాల ఉత్పత్తులను, యితర వ్యవసాయ ఉత్పత్తులను మార్కెట్లకు, వినియోగకేంద్రాలకు సులువుగా తీసుక వెళ్ళడానికీ, ప్రయాణీకులకు ఎక్కువ సౌకర్యాలు కల్పించడానికీ మారుమూల గ్రామాలకు సహితం మోటార్లు వెళ్ళడానికి వీలుగా కమ్యూనికేషన్ల సౌకర్యాలను విస్తృత పరచాల్సిన అవసరం ఉంది. తత్ఫలితంగా జిల్లా, గ్రామాల రోడ్ల నిర్మాణానికి ఎక్కువ నిధులను కేటాయించాల్సిన అవసరంఉంది. అయితే పంచాయతీరాజ్ సంస్థలుకూడ వారిపరం చేయబడిన రోడ్ల అభివృద్ధి కార్యక్రమాలకు చెందిన నిధులను సక్రమంగా వినియోగించాలి. కమ్యూనికేషన్ల నిమిత్తం జిల్లాపరిషత్తులకు కేటాయించిన నిధులను కొత్తరోడ్ల నిర్మాణం పనులకు, స్పిల్ ఓవర్ పథకాల అమలుకు ప్రధానంగా వినియోగించ బడుతుండగా రోడ్ల అభివృద్ధి విషయంలో ప్రస్తుతం గల వ్యత్యాసాలను తొలిగించడానికి తెలంగాణా కృషిచేస్తున్నది.

## గోదావరిపై రైలు–రోడ్డు వంతెన

గోదావరి నదిపై రైలు–రోడ్డు వంతెన నిర్మాణం, రాష్ట్రంలో కమ్యూనికేషన్ల సౌకర్యాల అభివృద్ధిలో ముఖ్యమైన పథకంగా భావించవచ్చు. రాష్ట్ర ప్రభుత్వం దీని నిర్మాణానికి రు 4 కోట్లు ఖర్చు చేస్తుందని ఆశించబడుతున్నది. ఈ వంతెన నిర్మాణం పూర్తి అయినప్పుడు మద్రాసు–కలకత్తా జాతీయ రహదారిని యిది కలుపుతుంది. ఇంతవరకు యీ నది ఫలితంగా జాతీయ రహదారి చీలిపోయింది. వంతెన నిర్మాణంవల్ల కోస్తా ఆంధ్ర జిల్లాలలో వాణిజ్య వ్యాపార, వ్యవసాయరంగాలలో అభివృద్ధికి దోహదం కలుగుతుంది.

జాతీయ రోడ్ల ప్రణాళిక కార్యక్రమాలకు అనుగుణంగా ఆంధ్రప్రదేశ్‌లో రవాణా, కమ్యూనికేషన్‌ల విస్తరణ కార్యక్రమం అమలు జరుగుతున్నది. సమీకృత రవాణా కార్యక్రమంలో భాగంగా వివిధ రవాణా పనులను అభివృద్ధి పరచడం చాలా అవసరం. రాష్ట్రస్థాయిలోను, జిల్లాపరిషత్తు స్థాయిలోను, సమితిస్థాయిలోను రోడ్డు పథకాలను ఏకీకృతం చేయాలి. ఆర్థిక అభివృద్ధికి, పారిశ్రామిక అభివృద్ధికి అనుగుణంగాను, వాటి అవసరాలను ఆదుకునే విధంగా రోడ్ల నిర్మాణ పథకాలను అమలు జరపాలి.

బడుగు ప్రాంతాలలోను, గ్రామీణ ప్రాంతాలలోను పెరిగిపోతున్న ప్రయాణీకుల, సరకురవాణా అవసరాలను ఆదుకోవడానికి వీలుగా రవాణాసౌకర్యాల అభివృద్ధికి సంబంధించిన అన్ని కార్యక్రమాలలో సమన్వయం ఉండాలి. రోడ్డు రవాణా సర్వీసులలోను, రైలు రవాణా సర్వీసులలోను ఆరోగ్యకరమైన పోటీ ఉండడమేగాక రెండింటి మధ్య పరస్పర సహకారంకూడ ఉండాలి. అందువల్ల హైదరాబాదునుండి నాగార్జునసాగర్ ఆనకట్టప్రాంతం మీదుగా ఒంగోలుకు, రామగుండంనుండి నిజామాబాదు మీదుగా లాటూరుకు, బైలదిల్లా, కొత్తగూడెంలను కలుపుతూ భద్రాచలం మీదుగా విశాఖపట్టణానికి రైలుమార్గాలను నిర్మించడం చాలా అవసరమనే భావించాలి. మొదటిది నాగార్జునసాగర్ కాలువల క్రింద పండే వ్యవసాయోత్పత్తులను శీఘ్రగతిని రవాణా చేయడానికి తోడ్పడుతుంది. రెండవది బొగ్గునిధులు, అటవీ సంపద లభ్యంకాగల ప్రాంతాలకు రైలుమార్గం ద్వారా రవాణా తదితర సౌకర్యాల్ని కలిగించడానికి తోడ్పడుతుంది. మూడవ దానివల్ల సింగరేణి బొగ్గుగనులలోని బొగ్గును విశాఖపట్టణంలోని పరిశ్రమలకు, బైలదిల్లా ఇనుపఖనిజాన్ని ఎగుమతిచేయడానికి వీలుగా విశాఖరేవుకు చేర్చడానికీ తోడ్పడుతుంది. ఆంధ్రప్రదేశ్‌కు చెందిన సాంకేతిక-ఆర్థిక పరిశీలకులు మరికొన్ని రైలుమార్గాలను సూచించారు. అయితే పైన పేర్కొన్న మూడు మార్గాలు వీటన్నిటికన్నా ముఖ్యమైనవీ, శీఘ్రంగా నిర్మింపవలసినవీను.

ఆంధ్రప్రదేశ్‌లో రవాణా, వార్తాసౌకర్యాల అభివృద్ధి విషయంలోవున్న మాంద్యాన్ని తొలగించి ఒక పద్ధతిప్రకారం వేగవంతం చేయాలనేది నిర్వివాదాంశం. కమ్యూనికేషన్లు క్రిందకు రోడ్లు మాత్రమే కాక రైల్వేలు, చిన్న తరహా రేవులుకూడావస్తాయి. రాష్ట్రంలోని చిన్నతరహా రేవులుగా కాకినాడ, భీమునిపట్నం, మచిలీపట్నం రేవుల్ని పేర్కొనవచ్చు. చిన్నతరహారేవుల అభివృద్ధికి యిటీవలే మన రాష్ట్రంలో కొన్ని చర్యలు తీసుకుంటున్నారు. విశాఖపట్టణంవంటి పెద్దతరహా రేవును ప్రస్తుతం రాష్ట్రంలోని ఎగుమతులదృష్ట్యా మరింతగా అభివృద్ధిచేయడం చాల అవసరం. పోతే రోడ్ల అభివృద్ధికి రాష్ట్ర, జిల్లా, గ్రామరోడ్ల అభ్రిద్ధికి- మొత్తం వివిధరకాల అభివృద్ధి కార్యక్రమాలతో పోల్చిచూస్తే తగినంత ప్రాధాన్యతను యిచ్చినట్టులేదనిపిస్తుంది. పంచవర్షప్రణాళిక (4వ ప్రణాళిక) మొత్తం రూ 635 కోట్లలో (రూ 522 కోట్లకు తగ్గించిన ఈ మొత్తాన్ని ముందుముందు మరికొంత తగ్గించవచ్చు) రూ 35.1 కోట్లను మాత్రమే రవాణా సౌకర్యాల నిమిత్తం కేటాయించారు. ఇదికాక రోడ్లకు-రాష్ట్ర, జిల్లా, సమితి, పురపాలకసంఘం రోడ్లకు,-చిన్నతరహా రేవులకు, ఆర్.టి సి. నిర్వహణ వ్యయానికి రూ 3.70 కోట్లు కేటాయించారు. యాత్రాభివృద్ధికి రూ 35 లక్షలు కేటాయించారు.

## ఆర్. టి. సి.

రాష్ట్ర శాసన సభ చేసిన చట్టంవల్ల తొమ్మిది సంవత్సరాల క్రితం నెలకొల్పబడిన రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థ యింత వరకు 9 తెలంగాణా జిల్లాలలోనూ, 3 ఆంధ్ర ప్రాంతంలోని జిల్లాలలోనూ ప్రయాణీకుల సర్వీసులను ప్రారంభించింది. జంటనగరాలలో ప్రయాణికుల సర్వీసులను కూడా యిది నిర్వహిస్తున్నది.

ఇది నెలకొల్పబడినప్పటినుంచి నేటివరకు క్రమ క్రమంగా సర్వీసు బస్సులను పెంచుతూ వచ్చింది. 1958లో 532 బస్సులను నడుపుతుండగా 1966 లో 2,460 బస్సులను నడుపుతున్నది. తృతీయ పంచవర్ష ప్రణాళికాంతానికి మొత్తం రాష్ట్రంలోని బస్సు రూట్లను అన్నిటినీ జాతీయంచేయాలని మొదట్లో భావించినా ఆర్థిక కారణాలవల్ల మెల్లమెల్లగా కార్యక్రమాన్ని అమలుపరచవలసి వస్తున్నది. అయితే సర్వీసుకు వీలయిన మార్గాలన్నిటిలోనూ బస్సులను నడిపే విషయంలో చాలా అభివృద్ధినే సాధించిందని చెప్పాలి. రాష్ట్ర రాజధానీ నగరం నుండి జిల్లాల ప్రధాన కార్యస్థానాలకు, యితర రాష్ట్రాల రాజధాని నగరాలకు సర్వీసులను కూడా ప్రారంభించింది.

రాష్ట్ర మంతటా బస్సురూట్లను జాతీయంచేయాలంటే ఆర్.టి.సి.కి చాలా పెట్టుబడి అవసరం. రాష్ట్రంలో జరిపిన సాంకేతిక ఆర్థిక పరిశీలనలవల్ల యీ కార్యక్రమాన్ని పూర్తిగా అమలు జరపడానికి రూ 14.50 కోట్ల కేటాయింపు అవసరమని అదనంగా 2,400 బస్సులు వుండాలని తేలింది. అయితే యిటీవల యీ సంస్థ అంచనాల ప్రకారం అయిదేళ్ళకు రూ 20 కోట్లు అవసరమని తేలింది. ఈ సంస్థ విస్తరణ కార్యక్రమానికి అవసరమయ్యే నిధులను సమకూర్చుకోవడంలో అదనపు ఆదాయాల విషయంలో యిది ఆశిస్తున్న ఆశలు ఫలవంత మవుతున్నట్లు కనిపిస్తున్నది అయితే యిది చాలా మెల్లగా జరిగేటట్టుగావున్నది. ప్రస్తుతం రాష్ట్ర ప్రభుత్వం ఆర్థికంగా యిబ్బందులను ఎదుర్కొంటున్న తరుణంలో యీ సంస్థకు అవసరమైనంత మేరకూ సహాయపడడం యిప్పట్లున రాష్ట్ర ప్రభుత్వానికి వీలుకాకపోవచ్చు. అందువల్ల రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థకు రానున్న కాలం మరికొంత క్లిష్టంగా వుండవచ్చు. అయినప్పటికీ యీ సంస్థ తన విస్తరణ కార్యక్రమ కృషిలోనూ, ప్రజలకు సమర్థవంతమైన సర్వీసును అందజేయడంలోనూ ముందుకు పోగలదని విశ్వసించవచ్చు.

## పరిపాలనా విషయాలు

### త్రిభాషాసూత్రం

త్రిభాషా సూత్రానికి సుముఖతను వెల్లడిస్తూ రాష్ట్ర ప్రభుత్వం తమ విధానాన్ని జనవరి 7వ తేదీన పునరుద్ఘాటించింది. పది సంవత్సరాల క్రితం అన్ని రాష్ట్రాలు అంగీకరించి, యిటీవల పార్లమెంటు ఆమోదించిన త్రిభాషాసూత్రాన్ని హృదయపూర్వకంగా అమలుజరపాలని ప్రభుత్వం అభిప్రాయపడింది.

జనవరి 27వ తేదీన మంత్రివర్గ సమావేశం జరిగిన తరువాత పత్రికాప్రతినిధులతో ముఖ్యమంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి మాట్లాడుతూ కేంద్రప్రభుత్వ ఉద్యోగాలలోను, అఖిల భారత సర్వీసులలోను నియామకాలకు ఇంగ్లీషు, హిందీ, మరొక భారతీయ భాష—ఈ మూడుభాషలలో పరీక్షలను నిర్వహించాలని తమ ప్రభుత్వం భావిస్తున్నదని ఆయన అన్నారు. ఈ సర్వీసుల నియామకాలలో అన్ని రాష్ట్రాలకు సమానమైన ప్రాతినిధ్యం ఉండే విధంగా చర్యలు తీసుకోవాలని కూడా ప్రభుత్వం భావిస్తున్నది. హిందీయేతర రాష్ట్రాలు కోరినంతకాలం యింగ్లీషును అనుసంధాన భాషగా కొనసాగించాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కోరుతున్నదని ముఖ్యమంత్రి అన్నారు.

### ఆత్యయిక పరిస్థితి రద్దు

అయిదు సంవత్సరాల క్రితం ప్రకటించబడిన ఆత్యయిక పరిస్థితిని జనవరి 10వ తేదీనుంచి రద్దు పరుస్తూ రాష్ట్రపతి ఉత్తర్వు చేశారు. మనదేశంపై చైనా దురాక్రమణ జరిగినప్పుడు 1962 అక్టోబరు 26 వ తేదీన ఆత్యయిక పరిస్థితిని ప్రకటించడం జరిగింది. దీనిని రద్దు పరచడంలో, రాజ్యాంగం 358, 359 వ సూత్రాలక్రింద నిలిపివేయబడిన ప్రాథమిక హక్కుల వర్తింపు పునరుద్ధరించబడింది. అయితే భారత రక్షణ నిబంధనలు మరో ఆరు నెలలపాటు అమల్లో వుంటాయి.

ఆత్యయిక పరిస్థితిలో, ప్రాథమిక హక్కులకు సంబంధించిన 14, 21, 22 సూత్రాల వర్తింపును నిలుపుచేస్తూ ఆత్యయిక నిబంధనలక్రింద రాష్ట్రపతి ఉత్తర్వుచేశారు.

### బలిమెల కంట్రోలు బోర్డు సమావేశం

బలిమెల కంట్రోలు బోర్డు సమావేశం హైదరాబాదులో జనవరి 17 వ తేదీన జరిగింది. 1972 నాటికి ప్రాజెక్టును వినియోగం లోనికి తేవడానికి వీలుగా ప్రాజెక్టు నిర్మాణ కార్యక్రమాన్ని రూపొందించడానికి నిశ్చయించారు. ఒరిస్సా ముఖ్యమంత్రి శ్రీ ఆర్. ఎన్. సింగ్‌దేవ్, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి సమావేశానికి హాజరయ్యారు. ఇప్పటివరకు జరిగిన కృషిని వారు సమీక్షించారు.

70 కోట్ల ఘనపుటడుగుల మట్టిపనిలో 6 కోట్ల ఘనపుటడుగుల పని ఇంతవరకు ముగిసింది. పనులను శీఘ్రంగా నిర్వహించడానికై వచ్చే సంవత్సరం ఉపయోగించే నిమిత్తం బోర్డు మరికొన్ని ట్రాక్టర్లను యితర యంత్ర పరికరాలను కొంటుంది. ఈ పనికి నిధులు కేటాయించడానికి ఇద్దరు ముఖ్య మంత్రులూ అంగీకరించారు.

### బియ్యం సేకరణ ఉత్తర్వు

బియ్యం సేకరణ (లేవీ), అమ్మకాల నిర్బంధం ఉత్తర్వు క్రింద, రాష్ట్రంలోని ప్రతి బియ్యపు మిల్లు యజమానీ 60 రోజుల మిల్లింగ్ శక్తికి సమానమైన బియ్యాన్ని లేవీక్రింద ఇవ్వవలసి వుంటుంది.

వడ్లను మరపట్టించుకునే వ్యక్తి ఎవరైనా, కలెక్టరు నిర్దేశించిన పరిమితిలో మిల్లుకు ధాన్యం ఇవ్వవలసి వుంటుంది.

ఆయా జిల్లాలలోని ఉత్పత్తి పరిస్థితినీ, స్థానిక అవసరాలనూ దృష్టిలో పెట్టుకొని, మిల్లులనుండి వసూలుచేసే బియ్యం కనీస పరిమితులను మార్పు చేయడానికి ఈ ఉత్తర్వు ప్రభుత్వానికి అధికారాలను సంక్రమింప జేస్తుంది.



రాష్ట్ర విజిలెన్స్ కమీషనర్ల తృతీయ వార్షిక సమావేశానికి జనవరి 16 న ప్రారంభోత్సవం చేస్తున్న రాష్ట్ర గవర్నరు శ్రీ పట్టం ఎ. థానుపిళ్లై

అయిదు మొదలు పది ఎకరాల భూమిని కలిగివున్న రైతుల నుంచి నేరుగా రెండు బస్తాల ధాన్యం చొప్పునా, పది ఎకరాలు అంతకు ఎక్కువ భూవసతి కలిగిన వారినుంచి మూడు బస్తాల చొప్పునా వసూలు చేయడానికి ప్రభుత్వం నిశ్చయించింది. అయిదు ఎకరాలకంటే తక్కువ భూవసతిగల రైతులను లేవీనుంచి మినహాయించారు.

## చర్మకార పరిశ్రమ వేతన నిర్ణాయక సంఘం

చర్మకార పరిశ్రమలోని ఉద్యోగ పరిస్థితులను గురించి పరిశీలించి, కనీసవేతనాల చట్టం క్రింద నిర్ణయించిన వేతనాలను పునఃపరిశీలించే విషయంలో ప్రభుత్వానికి సూచనలు చేసే నిమిత్తం ప్రభుత్వం ఒక సంఘాన్ని నియమించింది. శాసన సభ్యులు శ్రీ వి. రామారావు దీనికి అధ్యక్షులు.

## కరువు భత్యం పెంపుదల

అందరు ప్రభుత్వోద్యోగులకూ, స్థానిక సంస్థల ఉద్యోగులకూ, ఉపాధ్యాయులకూ, జాతీయ పారిశ్రామిక సంస్థలలో పూర్తి సమయం పాటు పని చేసే ఉద్యోగులకూ కరువుభత్యం పెంచుతూ రాష్ట్ర ప్రభుత్వం జనవరి 6 వ తేదీన ప్రకటన చేసింది.

ఈ క్రొత్త రేట్లు జీవన ప్రమాణంలో 20 పాయింట్ల పెరుగుదల వరకు కేంద్ర ప్రభుత్వపు కరువుభత్యపు రేట్లకు సమానం. ఈ పెరుగుదల జనవరి మొదటి తేదీనుంచి అమల్లోనికి వచ్చింది. ఇది "సంక్రాంతి" కానుక. ఈ పెంపుదలవల్ల ప్రభుత్వానికి రూ. 8.5 కోట్లు ఖర్చవుతుంది. అదనపు డి. ఎ. లో సగం మొత్తాన్ని రొక్కంగా చెల్లించగా మిగతా సగం మొత్తాన్ని ఉద్యోగుల ప్రావిడెంటు ఫండుకు జమ కడతారు. గ్రామోద్యోగులకూ, సేవకులకూ డి. ఏ. లో తాత్కాలికంగా అదనంగా నెలకు రూ. 3/-ల చొప్పున పెంచారు. ఈ పెంపుదల కూడా జనవరి మొదటి తేదీ నాడు అమలులోనికి వచ్చింది.



శాసనపర్వం

# పరిశ్రమలకు ప్రభుత్వ సహాయం

పరిశ్రమలను స్థాపించి అభివృద్ధి పరచడానికై ప్రభుత్వం సహాయం చేయడానికి సంబంధించిన నియమనిబంధనలను నిర్దేశించే 1922వ సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ [ఆంధ్రప్రాంతం] పరిశ్రమలకు ప్రభుత్వ సహాయక చట్టం ఆంధ్రప్రాంతంలో అమల్లో వుండగా 1956 వ సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ [తెలంగాణా ప్రాంతం] లఘు, కుటీర పరిశ్రమలకు ప్రభుత్వ సహాయక చట్టం తెలంగాణా ప్రాంతంలో వర్తింపులో వుంది. రాష్ట్రమంతటా ఒకే విధమైన శాసనాన్ని వర్తింపజేస్తూ పరిశ్రమలకు ఇతోధికంగా ఆర్థికసహాయం చేయడానికి వీలుగా ప్రస్తుతం ఆచరణలోవున్న నియమనిబంధనలను మార్పుజేసే తలంపుతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, రాష్ట్ర శాసన సభలో 1967 వ తేదీన ఒకబిల్లును ప్రవేశ పెట్టింది. ఈ చర్య ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర చట్టాల క్రోడీకరణ సంఘం చేసిన సిఫార్సులకు అనుగుణ్యమైనది.

ఈబిల్లులో "లఘుపరిశ్రమలు" "గ్రామీణ పరిశ్రమలు" "కుటీర పరిశ్రమలు", "పరిశ్రమలు" అనేపదాలకు నిర్వచనాలు పొందు పరచబడినాయి.

## పరిశ్రమల బోర్డు

పరిశ్రమలకు సహాయం అందజేసే విషయంలో ప్రభుత్వానికి సలహాలిచ్చే నిమిత్తం పరిశ్రమల బోర్డును నెలకొల్పడాన్ని బిల్లులోని 3వ సెక్షను నిర్దేశిస్తున్నది. ఈబోర్డులో ఈ విధంగా ఏడుగురుకి తగ్గకుండా, తొమ్మిది మందికి మించకుండా సభ్యులుంటారు:

(1) ఆర్థిక, పరిశ్రమల శాఖలనుంచి ఒక్కొక్కరు చొప్పున ఉపకార్యదర్శిహోదాకు తక్కువకాని ఇద్దరు అధికార్లు. (2) పరిశ్రమల శాఖ డైరెక్టరు, లేక ఆయన ప్రతినిధి. (3) రాష్ట్ర లేక కేంద్ర ప్రభుత్వశాఖలలోపనిచేస్తున్న ఇద్దరు వ్యక్తులు. అయితే వీరు నలుగురు వరకు కూడా వుండవచ్చు. (4) ఇతరులు అనధికార సభ్యులు. అనధికార సభ్యుల నుంచి ఒకరిని బోర్డు అధ్యక్షునిగా ప్రభుత్వం నియమించాలి.

దేశ ఆర్థికాభివృద్ధికి దోహదం చేసే పరిశ్రమకే సహాయం పొందడానికి యోగ్యతవుంటుంది. ఆ పరిశ్రమ క్రొత్తదన్నా అయి వుండాలి, లేక ప్రసిద్ధి పొందినదన్నా అయివుండాలి. 6వ సెక్షను క్రింద ప్రభుత్వం, దిగువపేర్కొన్న ప్రయోజనాలకొరకు సహాయం లభింపజేయవచ్చు:- (1) భూమి కొనుగోలు, భవనాల నిర్మాణం. (2) యంత్ర పరికరాల కొనుగోలు.(3) ముడి సరుకుల కొనుగోలు. (4) పరిశ్రమ నిర్వహణకు అవసరమైన ధనం. (5) సాంకేతిక నిపుణుల ఉద్యోగాలు, సిబ్బంది శిక్షణ ఖర్చులు చెల్లించడం. (6) నిర్వహణ సిబ్బంది ఖర్చులు చెల్లించడం. (7) స్థిరాస్తులను సమకూర్చుకోవడానికి చేసిన ఋణాలను తిరిగి చెల్లించడం. (8) స్థిరాస్తులను సమకూర్చుకోవడానికై, దరఖాస్తు చేసిన తేదీకి పూర్వం ఒక సంవత్సరంలోగా పెట్టుబడిపెట్టిన డబ్బును భర్తీ చేయడం. (9) దరఖాస్తు చేసిన తేదీకి పూర్వం ఒక సంవత్సరంలోగా స్థిరాస్తులను తనఖాపెట్టి తీసుకున్న అప్పులను పరిష్కరించడం.

(10) వాటాధనం క్రింద కొన్ని పరిమితులకులోబడి డబ్బుచెల్లించడ

ఆరవ సెక్షన్‌క్రింద డైరెక్టరుకానీ లేక ప్రభుత్వం అధికారం ఇచ్చిన మరెవ్వరైనా అధికారికానీ, అధికారవర్గంకానీ పరిశ్రమలకు సహాయాన్ని మంజూరు చేయవచ్చు. సహాయాన్ని మంజూరుచేస్తూగానీ, లేక నిరాకరిస్తూగానీ గైకొనబడిననిర్ణయాన్ని సవాలు చేయడానికి వీలుండదు.

ఏడవ సెక్షను ప్రకారం రూ. 10,000లకు మించి సహాయం పొందగోరే దరఖాస్తుదార్లు తమ దరఖాస్తులను నిర్ణీత ఫారాలలో వ్రాసి డైరెక్టరుకు దాఖలుచేయవలసివుంటుంది. 8వ సెక్షను ననుసరించి, అప్పు పొందడానికై వ్యక్తిగతంగా జామీను ఇవ్వడంకానీ లేదా స్థిరాస్తిని పూచీకత్తుగా పెట్టడంకానీ అవసరం.

ఋణం మొత్తంలో కొంత భాగాన్ని, పరిశ్రమ శాశ్వత అభివృద్ధి కార్యక్రమాలకు వినియోగించడానికై ప్రభుత్వం దరఖాస్తుదారులను నిర్బంధించవచ్చు.

పన్నెండవ సెక్షను ఋణాల తిరిగి చెల్లింపుకూ వడ్డీరేటుకూ సంబంధించినది. దీని తరువాతి సెక్షను మేరకు సహాయ గ్రహీతలు, ప్రభుత్వం నిర్దేశించిన ప్రకారం అప్రెంటీసుల శిక్షణ కొరకు ఏర్పాట్లు చేయవలసి వుంటుంది.

సహాయంగా పొందిన మొత్తంలో ఎంత భాగాన్నయినా దుర్వినియోగం చేసిన సందర్భంలోకానీ, సహాయం స్వీకరించిన వ్యక్తి నియమ నిబంధనలను ఉల్లంఘించిన సందర్భంలోకానీ, దరఖాస్తుదారు తప్పుడు వివరాలు అందజేసిన సందర్భంలోకానీ, సహాయాన్ని రద్దుచేయడానికై ప్రభుత్వానికి అధికారంఇచ్చే ముఖ్యమైన నిబంధన ఈ బిల్లులో చేర్చబడింది.

రాష్ట్రంలో సత్వర పారిశ్రామికీకరణను సాధించే నిమిత్తం సాధ్యమైనంత వరకు సహాయం అందజేయడానికి 17వ సెక్షనుక్రింద ప్రభుత్వానికి అధికారాలు సంక్రమిస్తాయి. 18వ సెక్షను ననుసరించి ప్రభుత్వానికి చెల్లించవలసివున్న మొత్తాలను 'భూమిశిస్తు బకాయీల'వలె రాబట్టవచ్చు. ఈ శాసన ప్రయోజనాలను నెరవేర్చేందుకై అవసరమైన నియమ నిబంధనలను రూపొందించడానికి 20వ సెక్షను ప్రభుత్వానికి అధికారం ఇస్తున్నది.

శాసనాల ఏకీకరణను లక్షిస్తున్న ఈ బిల్లు త్వరలోనే చట్ట రూపం దాల్చగలదని ఆశించబడుతున్నది. మొదటే పేర్కొన్నట్లు పరిశ్రమల అభివృద్ధికి ఉదారంగా సహాయం లభింపజేయడానికి యిది ఉద్దేశిస్తున్నది. పారిశ్రామిక శాసనాల చరిత్రలో ఈ నూతన శాసనం ప్రముఖఘట్టానికి పరవడి పెడుతుంది. రాష్ట్రంలోని పారిశ్రామికవేత్తలకు ప్రయోజనకారి అయిన ఇటువంటి పారిశ్రామిక శాసనాన్ని రూపొందించి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మరొక ఘన విజయాన్ని సాధించి చరిత్ర సృష్టించింది. రాష్ట్రంలో పారిశ్రామికాభివృద్ధికి ఇది దోహదం చేయగలదని ఆశించవచ్చు.

—పి. ఎస్.

---

న్యాయపాలన

## ఆక్ట్రాయ్ విధింపుకు రాష్ట్రం అధికారాలు

— పి. శేషాద్రి

1956 వ సంవత్సరపు హైదరాబాదు జిల్లా మునిసిపాలిటీల చట్టం 96 వ సెక్షను క్రింద ఆక్ట్రాయ్ పన్ను విధింపు సమర్థనీయమైనదా, కాదా అన్న అంశాన్ని ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ఇటీవల పరిశీలించింది. అదిలాబాదు సిటీ మునిసిపాలిటీకీ, మహాదేవ్ సీతారామ్‌కూ మధ్యనడిచిన వ్యాజ్యంలో ఈ అంశం హైకోర్టు పరిశీలనకు వచ్చింది.

హైకోర్టు, 'ఆక్ట్రాయ్' అన్నపదాన్ని వివరిస్తూ, ఇది భారత రాజ్యాంగంలో ప్రయోగించబడలేదనీ, అయితే 'పన్ను' అనే నిర్వచనమూ, రాష్ట్ర జాబితాలోని 52 వ అంశమూ దీనికి వర్తిస్తాయనీ పేర్కొన్నది. దీనిదృష్ట్యా, ఆక్ట్రాయ్ పన్ను విధింపును సమర్థించడానికి, స్థానిక ప్రాంతంలోనికి సరుకులను చేరవేయడం అచ్చట వాటిని వినియోగించడం జరగాలి.

ఈ పన్ను విధింపు రాజ్యాంగం 301 వ సూత్రంలో హామీ యిచ్చిన స్వాతంత్ర్యానికి భంగకరమైన దంటూ చేసిన వాదనను హైకోర్టు త్రోసి పుచ్చుతూ పరిపాలనా, నిర్వహణార్థం ధనసేకరణ కొరకు పన్ను విధించడానికి రాష్ట్రానికి గల అధికారాలను 301 వ రాజ్యాంగ సూత్రం అడ్డగించదని పేర్కొన్నది.

ఒకవేళ పన్నువిధింపు, 301 వ రాజ్యాంగ సూత్రంలో హామీ యివ్వబడిన వర్తక, వాణిజ్యాల స్వాతంత్ర్యానికి ప్రత్యక్షంగా భంగకరమైన దైనప్పటికీ 304 (బి) వ రాజ్యాంగ సూత్రం క్రింద దీనిని సమర్థించవచ్చు.

ఆక్ట్రాయ్ విధింపు 301 వ సూత్రానికి విరుద్ధమైనదన్న వాదనను హైకోర్టు కొట్టివేసింది. ప్రజల ప్రయోజనం దృష్ట్యా ఆక్ట్రాయ్ విధింపు సమ్మతమైనదేనని పేర్కొన్నది. 1956 వ సంవత్సరపు హైదరాబాదు జిల్లా మునిసిపాలిటీల చట్టం 96 వ సెక్షనుక్రింద ఆక్ట్రాయ్ పన్ను విధింపు రాజ్యాంగ రీత్యా సమర్థనీయమైనదని హైకోర్టు స్పష్టీకరించింది.

★

# మహాభారతము

తప్పగంతుల లక్ష్మణశాస్త్రి

## 14

### బ్రహ్మ సభావర్ణనము

బ్రహ్మ సభ యిట్టిది యని వర్ణింప శక్యముగాదు. పూర్వము సూర్యుడు మనుష్యరూపముతో మానవ లోకమునకు వచ్చుచు ఆ సభను చూచెనట. ఆ క్రమమును సూర్యుడు నాకు చెప్పగా వింటిని. దానిని బ్రహ్మదేవుడు తన మనస్సంకల్ప మాత్రముచేత నిర్మించెను. అట్టి సభను నేనుగూడ చూడదలచి సూర్యునితో నిట్లంటిని. 'మహాత్మా! ఆ బ్రహ్మ సభను చూచుటకు ఏ వ్రతములు ఎట్టి తపస్సులు ఆచరించవలెను. ఔషధము లేవైన సేవింపవలసి యుండునా" అని అడిగితిని. నా మాటవిని సూర్యుడు ఇట్లనెను. "బ్రహ్మ సభను జూచుటకు వేయి సంవత్సరములు బ్రహ్మ వ్రతమను పేరుగల వ్రతమును ఆచరించవలయును" అని చెప్పెను. అది విని నేను హిమవత్పర్వతముపైన ఆ మహా వ్రతమును చేయుటకారంభించితిని. అటు తరువాత సూర్య భగవానుడు నన్ను తోడుకొని బ్రహ్మసభకు పోయెను. ఆ సభా వైభవ మిట్టిదని చెప్పుటకు అలవికాదు. క్షణ క్షణము విచిత్ర రూపములను ధరించుచుండును. ఆ సభయొక్క కొలత ఇంత అని చెప్పుట అసాధ్యము. అట్టి సభను నేనెక్కడను చూచియుండ లేదు.అత్యంత సుఖప్రదమై సమ శీతోష్ణ వాయువుకలదై యుండును. అచ్చటి వారికి ఆకలిదప్పుల శ్రమ ఉండదు. చంద్ర, సూర్యాగ్నుల తేజస్సులను మించిన తేజస్సుగలదై యుండును. ఆ సభలో భగవంతుడగు బ్రహ్మదేవుడు దక్షుడు మొదలైన ప్రజాపతులచేత సేవింపబడుచు సమస్త దేవతలు, ఋషులు పరివేష్టించి యుండగా విరాజిల్లుచుండును. ధర్మార్థ కామ మోక్షములు, సకల వేద వేదాంగములు, సమస్త దేవతలు, యజ్ఞములు. సరస్వతి మొదలైన దేవీ గణము బ్రహ్మదేవుని చుట్టి యుందురు. కాల చక్ర-ధర్మ చక్రములు సర్వదా యచటనుండును. ద్వాదశాదిత్యులు, అష్ట వసువులు, ఏకాదశ రుద్రులు, పితృదేవతలు మొదలగు వారందరు నచ్చట నుందురు. వేయేల. మూడు లోకములలో గనపడు స్థావర జంగమములు నాకక్కడ గోచరించినవి. అక్కడికి పోయిన అతిథులను బ్రహ్మదేవుడు మిక్కిలి ఆదరించును." అని చెప్పి నారదుడు, యుధిష్ఠిరా! నలుగురు దిక్పాలకుల సభలను, చూచిన నేను, తిరిగి వాటితో సమానమైన ఈ మయ సభను మనుష్యలోకమున జూచి ఆనందించితిని." అని చెప్పెను.

యుధిష్ఠిరుడు నారదుడు చెప్పిన సభావర్ణనములను విని ఇట్లనెను. నారదా! ఇంద్రసభలో దేవగంధర్వాదులు అనేకు లున్నట్లు వర్ణించితివి. వారిలో మానవులకు చెందిన హరిశ్చంద్రుడు అను రాజుమాత్రమున్నట్లు చెప్పితివి. మనుష్యలోకములోని ఏ రాజులు చేయని పుణ్య కర్మను చేసి ఆయన ఇంద్రసభను పొందెను. ఈలాగే దేవ, పితృలోకమునకు పోయిన మా తండ్రి యగు పాండురాజును చూచియుందువు. అప్పుడా పాండురాజు మాకేమైనా సందేశమును బంపెనా? ఈ రెండువిషయములను వినుటకు మిక్కిలి కుతూహలము కలిగియున్నాను చెప్పుము".

ఆమాటవిని నారదుడు. "యుధిష్ఠిరా! హరిశ్చంద్రుడు బలవంతుడై సామ్రాజ్యమునేలెను. అనేక సామంతులాయనకు వశులైయుండిరి. ఆయన సువర్ణరథముపై నెక్కి తిరుగుచు తన శస్త్రప్రతాపము చేతసప్తద్వీపములను, సమస్త భూమండలమును జయించి, రాజసూయము అను మహాయజ్ఞమును చేసెను. భూమండల మందలి రాజులందరు ఆయనకు కప్పములను చెల్లించిరి. నిర్విఘ్నముగా యజ్ఞమును ముగించి ఆరాజు యథేష్టముగా యాచకులకు ద్రవ్యమును దానము చేసెను. విశేషముగా నన్న దానముచేసెను. పరాక్రమములోను, యశస్సులోను సాటి రాజులను మించియుండెను. ఆకారణముచేత హరిశ్చంద్ర మహారాజు మానవలోకములో ననేక వైభవముల ననుభవించుచు నింద్ర సభలో స్థానమును సంపాదించెను. రాజసూయయాగమును చేసిన వారందరూ ఇంద్రసభలో నింద్రునితో సమానముగా నానందింతురు. వీరేకాక యుద్ధములలో వెనుకాడక పోరాడి మరణించిన వారును, తీవ్రమైన తపస్సుచేత శరీరమును విడిచిన వారును ఇంద్రలోక సుఖమును పొందుదురు." అని చెప్పెను.

"పితృ లోకములో నీతండ్రి పాండురాజు నింద్రలోకము లోని హరిశ్చంద్రు వైభవములను జూచి యాశ్చర్య పడుచుండెను. అప్పుడాయన మనుష్యలోకమునకు వచ్చుచున్న నా ద్వారా ఇట్లు సందేశమును మీకు బంపెను:- నారదా! నా పుత్రులు పాండవులు సమస్త భూమండలమును జయించు సామర్థ్యము గలవారు. కనుక ఉత్తమ క్రతువగు రాజసూయమును చేయుడని చెప్పుము. అట్లు చేసినయెడల పుణ్యముచేత నేనును హరిశ్చంద్రుని వలె చాలాకాలము ఇంద్రునితో సమానముగా నింద్ర

సభలో ఇంద్రసౌఖ్యములను అనుభవించు చుందును" ఆ సందేశ
మును నేను నీకు చెప్పుటకు వచ్చితిని కనుక యుధిష్ఠిరా ! నీవు
గూడ రాజసూయయాగమును చేసి ఇంద్రలోక సౌఖ్యములను,
నీ తండ్రికి కలిగించి నీవును అనుభవింపుము. ఆ యాగమున
కనేక విఘ్నములను యజ్ఞఘ్నులైన బ్రహ్మరాక్షసులు కల్పించు
చుందురు. దిగ్విజయముచేసి సమస్త శత్రువులను జయించు
చుండవలెను. అనేక జననాశనము గలుగును. కనుక ధర్మరాజా
నీవు విచారించి యేది హితమో అది చేయుము. నీవు కోరినట్లు
అన్ని సమాచారములను నీకు తెల్పితిని. ఇకనాకు సెలవిమ్ము. నేను
ద్వారకానగరికి పోయెదను." అని చెప్పి నారదమహాముని
పాండవులను వీడ్కొని ఇంద్రప్రస్థము నుండి ద్వారకాపురికి
పయనమైపోయెను.

## రాజసూయ యాగము

నారదుడు చెప్పిన మాటలను విని యుధిష్ఠిరుడు తమ్ములతో
యోచించి రాజసూయ యజ్ఞమును చేయుటకు సంకల్పించెను.
ధర్మస్వరూపుడైన యుధిష్ఠిరుడు అందరి ప్రశంసలకు పాత్రు
డయ్యెను. ప్రజ లందరు అతనిని తండ్రివలె సేవించుచుండిరి.
లోకములో అతనికి ద్వేషి యెవడును లేనందున అతడు 'అజాత
శత్రువు' అను పేర ప్రసిద్ధుడయ్యెను. అతడు అందరిని ఆత్మీ
యులవలె చూచుచుండెను. భీమసేనుడు ప్రజలను రక్షించుచుండెను.
అర్జునుడు శత్రు సంహారము చేయుచుండెను. నకులుడు అందరి
తోను వినయపూర్వకముగా మెలంగుచుండెను. సహదేవుడు ప్రజ
లకు ధర్మోపదేశములు చేయుచుండెను. అందువలన యుధిష్ఠిరుని
రాజ్యమున ప్రజలు పరస్పర కలహములు లేక నిర్భయులుగాను,
స్వధర్మ పరాయణులుగాను వినయశీలురుగాను నుండిరి. ఆ రాజ్య
ములో కరువులు, ఈతి బాధలు లేకుండెను. యజ్ఞ సామగ్రి,
గోరక్షణము, కృషి, వాణిజ్యము ఇవి ఆ రాజ్యములో నున్నత
స్థాయిలో నుండెను. నిర్ధనులనుండి బాకీ పడిన కప్పములు వసూలు
చేయక ఎల్లప్పుడు ధర్మతత్పరుడై ఏలుచుండిన యుధిష్ఠిరుని
శాసనకాలములో రోగాగ్ని భయము, కరవు భయము, చోర
భయము, మోసగాండ్ర భయము లేకుండెను. రాజుగాని, రాజ
బంధువులుగాని ప్రజలకు బాధ కలిగించకుండిరి. ఇతర రాజులు
ఆయనతో కలిసి మెలిసి యుండిరి. అతని ఖ్యాతి సర్వత్ర వ్యాపిం
చెను. అన్ని సద్గుణములు నతనిని శోభింప జేసెను. శీతోష్ణ సుఖ
దుఃఖముల నతడు సహించుచుండెను.

ఒకనాడు యుధిష్ఠిరుడు మంత్రులను, తమ్ములను పిలిచి
రాజసూయము చేయవలెనని కోరెను. అందరు నామోదించిరి.
"ఆ యజ్ఞము చేయుటచేత సమస్త యజ్ఞములు చేసిన ఫలము
కలుగును. అవభృథ స్నానానంతరము, ఆ యజమాని 'సర్వజిత్తు,
సామ్రాట్టు అను ప్రసిద్ధిని బడయును కనుక రాజా! నీవు సమర్థు
డవు. మేము నీకు వశులమైయున్నాము. కనుక ఏమాత్రము విచా
రించక రాజసూయమును ఉపక్రమింపుము". అని మంత్రులనిరి.
వారి మాటలను విని కృష్ణునితో సంప్రదించి యజ్ఞమును ఆరం
భించుటకు పూనుకొని ధర్మరాజు శీఘ్రగమనుడైన దూతను ద్వార
కకు పంపించి కృష్ణుని పిలిపించి తన రాజసూయ సంకల్పమును
ఆ మహానుభావునకు దెలిపి ముందు కర్తవ్యమును బోధించుమని
శ్రీకృష్ణుని ప్రార్థించెను.

శ్రీ కృష్ణుడిట్లు బదులు చెప్పదొడంగెను "రాజసూయ
యాగము అన్ని విధముల శ్రేష్ఠమైనది. పూర్వము పరశు
రాముడు సర్వక్షత్రియులను నశింపజేసెను. ఇప్పుడు కొలది మంది
మాత్రమే మిగిలియున్నారు. గనుక యాగార్థమై క్షత్రియ విజయము
నీకు సులభ సాధ్యమగును. ఈ మిగిలిన క్షత్రియ లోక సంఘ
ముగా చేరి తమను జయించిన వాడే తమకు చక్రవర్తి కాగలడని
నిర్ణయించుకొని ఇక్ష్వాకు సంతానమైన పురూరవుని తమకు చక్ర
వర్తిగా చేసికొనినారు. అతనికి సంబంధించిన కులములు నూరు
గలవు. జరాసంధుడు తన వర్గమునకు చక్రవర్తి ఐనాడు. అతనికి
శిశుపాలుడు సర్వసేనాపతిగా నియుక్తుడైనాడు. దుష్టులైన రాజు
లందరు జరాసంధు నాశ్రయించిరి. అన్ని దిక్కులందు రాజు
లందరు ఇప్పుడు మితిమీరి యుందురు. అందరిని అణచి మనవశము
చేసికొనవలయును. యాదవులందరు నీకు హితులైయున్నారు.
కనుక అనేక దురంతములను చేసి రాజులను నిర్బంధించియున్న
జరాసంధుని జయించి రాజసూయము చేయవలసియుండును." అని
చెప్పెను.

ఆ మాట విని యుధిష్ఠిరుడు ఇట్లనెను. "ఏవిధముగా
నైనను దుష్టుడైన జరాసంధుని నీ బల సహాయము చేత నోడింప
దలచినాను. కాని, నీవే యిట్లు జరాసంధునికి భయపడినయెడల
లోకములో నాతనినెదురించువారు లేరు. నీవు, బలరాముడు, భీమ
సేనుడు, అర్జునుడు మొదలగువారి సహాయముచేత జరాసంధుని
నిర్జింపవలయును. ఏదేని యుపాయ మాలోచించి చెప్పుము."

ఆ మాటవిని భీముడిట్లనెను "ప్రయత్నము చేయకుండ
ఉన్న రాజు వల్మీకమువలె నశించును. సోమరితనము వదలి
యుపాయముచే పని చేయు రాజు దుర్బలుడైనను బలవంతుడగు
శత్రువును సాధించును. కృష్ణుని నీతి, నా బలము, అర్జునుని విజయ
శక్తి ఈ మూడును కలిసి జరాసంధుని తప్పక జయించగలవు. ఈ
మూడును త్రేతాగ్నులు యజ్ఞ సమాప్తి జేసినట్లు జరాసంధుని
సమాప్తి చేయగలవు."

ఆమాటవిని కృష్ణుడిట్లనెను "రాజా! అజ్ఞానులు పెద్ద కార్య
మును తలపెట్టెదరు కాని వాటి పరిణామమును గ్రహించజాలరు.
పూర్వము యవనాశ్వుని పుత్రుడు మాంధాత తనకు సాధ్యులైన
శత్రువులను జయించి చక్రవర్తి పదవిని పొందెను. భగీరథుడు
ప్రజాపాలనము చేత, కార్తవీర్యుడు తపోబలముచేత, భరతుడు
స్వబలముచేత, మరుతుడు సంపదచేత చక్రవర్తులైరి. వారు
ఒక్కొక్క గుణముచేత చక్రవర్తులు కాగలిగిరి. నీకు సామ్రాజ్య
ప్రాప్తికొఱకు ఆ యైదుగురి గుణములు–అనగా శత్రు విజయము,
ప్రజాపాలనము, తపశ్శక్తి, ధనవృద్ధి, ఉత్తమనీతి,–ఇవన్నియు
గలవు. కాని నీకు జరాసంధుడు ఆటంకముగానున్నాడు. అతడు
అన్యాయమును చేయుచు రాజులపైన అత్యాచారములను చేయు
చున్నాడు. ఎందరినో బంధీలనుగాచేసినాడు. మనము జరాసంధుని

ద్వంద్వయుద్ధములో సంహరించి ఆ రాజులనందరిని వశులనుగా చేసికొనవచ్చును."

కృష్ణుడు చెప్పినమాటలను విని యుధిష్ఠిరుడు ఇట్లనెను. "కృష్ణా! భీమార్జునులు నాకు రెండు నేత్రములు. నీవు నాకు మనస్సు. మీ ముగ్గురిని జరాసంధునిపై వదలి మీకేదైన కీడు గలగిన నా జీవనమే నిష్ఫలముకదా! జరాసంధు నెదుర్కొనుటకు యమునకుకూడ సాధ్యముకాదు. అట్లుండ మీరెంత? కనుక మీ ముగ్గురిని వానిపై పంపుటకు నేనొప్పుకొనను. కాబట్టి రాజసూయ యజ్ఞమును మానుట యుక్తముఅని తలచుచున్నాను."

ఆ మాటలు విని అర్జునుడు ముందుకు వచ్చియిట్లనెను. "రాజా! ఇతరులకు దుర్లభమైన శస్త్రాస్త్రములు, పరాక్రమము, ఉత్తమ సహాయము, బలము, ఇవన్నియు నాకు లభించియున్నవి. శత్రు జయము తప్పక సాధింతును. దైన్యము, మోహమును బలవంతుడు విడువవలెను. జరాసంధుని వధించి రాజులను రక్షించినచో నింతకన్న నేమికావలెను? మనము యజ్ఞము చేయకున్నచో మన అసామర్థ్యము, దౌర్బల్యము ప్రకటితమగును. మనము శాంతినే కోరినయెడల కాషాయ వస్త్రధారులమై సన్యాసి వేషముతో అడవిలో నివసించవలెను, సామ్రాజ్యమును కోరినయెడల శత్రు జయమును సాధించవలెను."

అర్జునుని మాటలు విని శ్రీ కృష్ణుడు ఇట్లనెను. "భారత వంశ రాజునకు తగినట్లుగా అర్జునుడు మాట్లాడెను. రాజా! మృత్యువు రాత్రి వచ్చునో పగలు వచ్చునో యెరుగము. యుద్ధము చేయని వానికి మరణమేలేదని మనము చెప్పలేము. నీతి, ఉపాయము లేనివారు యుద్ధములో నశింతురు. మన కీ రెండునుగలవు. నదీ వేగముచేత వృక్షములు నిర్మూలమైనట్లు నీతి కుశలత చేత శత్రువును నిర్మూలింప వచ్చును. ఇప్పుడొక్క జరాసంధుడే సామ్రాజ్యమును పాలించుచున్నాడు. మన మాతని వినాశనమునకు ప్రయత్నింపవలెను. జరాసంధుని చంపి యతని సైన్యముచేత మనము చచ్చినను, అనేక రాజులకు విముక్తి కలిగించిన పుణ్యము చేత తప్పక మనకు స్వర్గము లభించును." అని చెప్పెను.

ఆ మాట విని యుధిష్ఠిరుడిట్లనెను "కృష్ణా! జరాసంధుడెవడు? అతని పరాక్రమమెట్టిది? నీవంటి వాని నెదిరించి కూడ అతడు ఏల నశింపకున్నాడు" అని యడిగెను. దానికి శ్రీకృష్ణుడిట్లనెను.

## జరాసంధ చరిత్రము

"ధర్మ రాజా! పూర్వము మహా బలపరాక్రమ సంపన్నుడైన 'బృహద్రథుడు' అను రాజు మగధ దేశమును పాలించుచుండెను. సర్వదా యజ్ఞ దీక్ష బూని యతడు మహా తేజస్సుతో విరాజిల్లుచుండెను. భూమండల మంతయు అతని కీర్తి ప్రశంసలు వ్యాపించి యుండెను. ఆ రాజు కాశి రాజు యొక్క కవల బిడ్డల నిద్దరిని వివాహము చేసికొనెను. ఇద్దరిని సమానానురాగముతో నాదరించుచుండెను. గంగా యమునల మధ్య సముద్రుడువలె ఆ యిరువురి మధ్య రాజు ప్రకాశించుచుండెను. విషయ సుఖముల నాతడు అనుభవించుచు యౌవనమును గడపెను గాని పుత్రప్రాప్తి అతనికి కాలేదు. దానికై యనేక యజ్ఞములను, వ్రతములను చేసి విఫల మనోరథుడయ్యెను.

ఒకనాడు మహాత్ముడైన 'కాక్షీవంతుడు' అను మునీశ్వరుని కొడుకు 'చండ కౌశికుడు' తపస్సును చాలించి యిక్కడకు వచ్చి ఒక ఆమ్ర వృక్షమూలమునందున్నాడను సంగతి విని బృహద్రథుడు తన భార్యలతో నతనికడ కేగి యతనిని పూజించి నమస్కరించెను. ఆ ముని పరితుష్టుడై వరము కోరుమని రాజునకుచెప్పెను. రాజు పుత్రసంతతి కావలెను, అని వరమును కోరెను. ఆ మాట విని ముని కన్నులుమూసి ఆ మామిడిచెట్టుక్రింద ధ్యాన నిమగ్నుడై కూర్చుండెను. అప్పుడన్న అతని ఒడిలో నకస్మాత్తుగా నొక మామిడి పండు పడెను. పుత్రప్రాప్తికి కారణమైన ఆ ఫలమును అభిమంత్రించి నరేంద్రునకిచ్చి, 'దీనిని సేవించినచో సంతానము గలుగును పొమ్ము' అని పలికెను. ఆ మాట విని మునికి నమస్కరించి వారు తమ భవనమున కేగిరి.

రాజు ఆ ఫలమును ఇద్దరు భార్యలకిచ్చెను. దానిని రెండు భాగములుగా జేసి యిరువురు భుజించిరి. దానివలన నిద్దరును గర్భవతులైనందున రాజు సంతోషించెను. ఇద్దరు భార్యలు చెరి యొక శరీర శకలమును గనిరి. ఒక్కొక్క శకలములో నొక కన్ను, ఒక చెవి, ఒక కాలు, అర్ధముఖములు నుండెను. సజీవమైన ఆ ముక్కలను జూచి యిరువురును భయపడిరి. వారి ఆజ్ఞపైన దాసీ జనము ఆ రెండు సజీవ శరీర భాగములను కొనిపోయి రాజమార్గ చతుష్పథమునందు బడవైచిరి. రక్త మాంసములను భుజించు 'జరా' అను రాక్షసి వాటిని గైకొని ఆ రెంటిని జతపరచెను. వెంటనే సుందరరూపముగల ఒక్కటే కాయముగల బాలకుడుగా నేర్పడుటను జూచి నిశాచరి ఆశ్చర్యము నొందెను. ఆతడు వజ్రమువలె కఠినమగు కాయముగలవాడై యుండెను. ఆ బాలకుడు మిక్కిలి భయంకర ధ్వనితో నేడ్వసాగెను. రాణివాసము వారందరు ఆ శబ్దమును విని భయపడి రాజుతో కూడ బయటకు వచ్చిరి. రాణులకు పాలుచేపెను. రాక్షసి 'నేను ధర్మాత్ముడైన ఈ రాజు రాజ్యములో నున్నాను గనుక ఈ శిశువును సంహరించుట యనర్హము' అని తలచి మానవ నారీ వేషమును దాల్చి రాజున కా కుమారుని ఇచ్చి యిట్లనెను. 'ఇతడు నీ పుత్రుడు. నీవు ఈతనిని గైకొనుము. బ్రహ్మర్షి వర ప్రసాదము వలన జనించిన యీ శిశువును దాసీ జనము బయట పడవేయగా నేను కాపాడి తిరిగి నీకిచ్చుచున్నాను' అని చెప్పెను. వెంటనే ఆ బాలకుని రాజు తీసికొని యిరువురు పత్నులకు ఇచ్చెను. వా రాతనిని దీసికొని స్తన్యపానము చేయించిరి. ఆ రాజు నిశాచరినిజూచి 'నాకు పుత్రదానము చేసినదానవు నీవెవరవు?' అని యడిగెను.

ఆమాటకు రాక్షసి యిట్లు బదులుచెప్పెను. "నేను జర అను దానను. నీయింటిలో సౌఖ్యముగానున్నాను. నేను రాక్షసినేకాని పూర్వము బ్రహ్మదేవుడు నన్ను సృష్టించి నాకు 'గృహదేవి' యను పేరు పెట్టెను. నేను నరులయిండ్లలో నెల్లప్పుడు నుందును. నేను

దానవుల వినాశము కొఱకు నియోగింపబడితిని. నన్ను పుత్ర సహిత యువతినిగా ఏ పురుషుడు తనయింటిలో గోడపై వ్రాసి యుంచునో అట్టివానికి సర్వదా అభివృద్ధి కలుగును. లేకున్న హాని గలుగును. నన్ను నీ యింటిలో చిత్రరూపమున వ్రాసి ధూప దీపాదులచే ప్రతిదినము పూజించుటచేత సంతుష్టురాలనై నీకు నేనీ యుపకారము చేసితిని. ఈ రెండు భాగములు దైవగతి వలన కలిసికొనెను. నేను కేవలము నిమిత్తమాత్రము. మేరుపర్వతమును గూడ మ్రింగు శక్తి నాకుగలదు గనుక బాలకునిగూడ సులభముగా మ్రింగియుందును. కాని నీయింటిలో నాకుజరుగు పూజ వలన నేను సంతుష్టురాలనై ఈ బాలకుని మ్రింగక నీకు అర్పించితిని' అని చెప్పి రాక్షసి యచటనే అంతర్ధాన మందెను.

బృహద్రథుడు బాలుని తీసికొని భవనములో ప్రవేశించి జాతకర్మాదులు చేయించెను. మగధదేశములో నింటింట జరా రాక్షసిని గృహదేవతగా పూజించునట్లు ఆజ్ఞాపించెను. జర చేత సంధింపబడినవాడు గనుక నాబాలునకు 'జరాసంధుడు' అను నామకరణము చేసెను. ఆ బాలకుడు శుక్లపక్ష చంద్రుని రీతి అభివృద్ధి చెందెను.

కొంతకాలమునకు చండకౌశిక మహాముని తిరిగి మగధకు వచ్చెను. రాజు సపరివారముగా నతనిని సమీపించి యర్ఘ్యపాద్యా దుల నొసంగి సపుత్రకమైన తన రాజ్యము నతనికి సమర్పించెను. "రాజా! నేను దివ్యచక్షువుచేత నీ సంగతి యంతయు నెఱింగితిని. ఈ కుమారుడు బలపరాక్రమముచే విరాజిల్లు చుండును. ఇతని కీడైన రాజులు జగత్తున లేరు. శత్రువులు నశింతురు. దేవతలు గూడ నీతని బాధించలేరు. మూర్ధాభిషిక్తులైన రాజులందరి తేజస్సుల నితడు హరించి వారిపై సూర్యుని వలె విరాజిల్లు చుండును. ఈతని నెదిరించిన రాజులు నశింతురు. సమస్త రాజుల సంపదల నితడు హరించును. ఈతని రాజ్యము సుభిక్షముగా నుండును. ఇతడు సాక్షాత్తు పరమశివుని ప్రత్యక్షముగా చూడగలడు" అని చెప్పి చండకౌశికుడు తిరోధానమునందెను.

తరువాత బృహద్రథుడు జరాసంధుని రాజ్యపట్టాభిషిక్తుని జేసి భార్యలతో తపోవనమునకేగెను.

జరాసంధుడు రాజ్యమేలుచు రాజులందరిని వశులనుగా జేసికొనెను. కొంతకాలమునకు జయద్రథుడు, ఆతని భార్యలును కాలధర్మమునందిరి. జరాసంధుడు శివుని గూర్చి తపస్సుచేసి వరములను పడసి మహాబలవంతుడై విరాజిల్లెను. కృష్ణుడు కంసుని చంపిన తరువాత జరాసంధుడు కృష్ణునిపై వైరము పూనెను. ఆ ద్వేషము చేతనే బలవంతుడగు మగధరాజు తన గదను తొంబది తొమ్మిది పర్యాయములు త్రిప్పి తన గిరివ్రజ పట్టణమునుండి మథురానగరిపై విసరెను. అప్పుడా కృష్ణుడు మథుర యందుండెను. తొంబది తొమ్మిది యోజనముల దూరము వచ్చి ఆ గద మథురపై పడుచుండెను. ఆ గద పడిన సమాచారమును పురవాసులు కృష్ణునకు దెల్పిరి. ఆ చోటునకు 'గదావసానము' అను పేరు వచ్చెను.

జరాసంధునకు హంసుడు, డింభకుడు అను నిరువురు అమాత్యులుండిరి. వారు చాల బలపరాక్రమవంతులు. ఆ ముగ్గురును మూడు లోకముల నెదిరించుచుండిరి. అట్టి బలవంతులకు జడిసి కుకుర, అంధక, వృష్ణులు జరాసంధుని ఉపేక్షించిరి." అని చెప్పి కృష్ణుడు "ధర్మరాజా! హంస డింభక కంసులు సపరివారముగా మరణించిరి. ఇప్పుడు జరాసంధ వధకు కాలమాసన్నమైనది. అతడు శస్త్రహతుడు కాజాలడు. బాహు యుద్ధము చేతనే జయించ బడును. దానికి భీముడే సమర్థుడు. మేము జరాసంధుని గలిసి నప్పుడు అతడు మాలో నొకరితో ద్వంద్వయుద్ధమును గోరును. భీమునితో ద్వంద్వ యుద్ధము జరుగును. భీమసేనుడు తప్పక జరాసంధుని జయించగలడు. కనుక నీవు సందేహించక జరాసంధ వధార్థమై భీమార్జునులను నా వెంట బంపుము." అని పలుక యుధిష్ఠిరుడు కృష్ణునితో నిట్లనెను.

"కృష్ణా! నీవట్లనకుము. నీవుండగా మాకేలోపము గలుగదు జరాసంధుడు అవశ్యముగా వధింపబడును. రాజసూయముగూడ సంపన్నమగును. త్వరగా నీ రెంటిని సాధింతును. నాకు ధర్మ, కామార్థములవలె మీరు ముగ్గురున్నారు. మీరు లేక నేను జీవించ లేను. నీ యాశ్రమమువలన మాకు కార్యసిద్ధికాగలదు. మీరు ముగ్గురు నీతి, జయ, బలములువలె నున్నారు." అని చెప్పెను. ఆమాటకు అందరును సంతోషించిరి. కృష్ణుడు భీమార్జునులతో జరాసంధునిపై దండెత్తివెడలెను. జరాసంధుని వినాశము తప్పదని యందరు తలచిరి. కృష్ణార్జును లేకమైనచో దుస్సాధ్యములేదు. అనుకొనిరి. వారు అనేక నదీనదపురములను ఆక్రమించి తూర్పు ముఖముగా బయలుదేరి మగధదేశమును చేరి, రాజధానియగు గిరివ్రజ పట్టణమును చూచిరి. ఆ పట్టణము 'వరాహము, రాజ వృషభము, ఋషగిరి, మాతంగము, చైత్యకము, అనునైదు ఉన్నతపర్వతములచే చుట్టబడి యుండుటచేత దాని కాపేరువచ్చెను. ఆ పర్వతములాపురమును రక్షించుచున్నవి. ఆ పట్టణమునందే మహాతపస్వియైన గౌతముడు ఉశీనరదేశీయురాలైన శూద్రజాతి కన్యగర్భమునందు కక్షీవంతుడు మొదలగు పుత్రులను కనియుం డెను. ఆ కారణముచేత నాతడు ఆచట నివసించి మగధరాజవంశీ యులను రక్షించుచుండును. ఆ దేశము సుభిక్షముగానున్నది. అట్టి పురమునుచేరి జరాసంధుడు వైభవముతోనున్నాడు. వాని దర్పమును మనమిప్పుడు అణచెదముగాక అని కృష్ణభీమార్జునులు నిశ్చయించుకొనిరి.

( సశేషము )

## విద్యుచ్ఛక్తి

### ఇతోధికంగా విద్యుచ్ఛక్తి

రెండురాష్ట్రాలు సమిష్టిగా కలిసి చేపట్టిన మొట్టమొదటి పథకం మాచ్‌ఖండ్ జల విద్యుత్పథకం. ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా రాష్ట్రాల సమిష్టికృషి ఫలితం యీ ప్రాజెక్టు. గోదావరి ఉపనదికిమరో పిల్లనదిగావున్న మాచ్‌ఖండ్ నదీజలాలను వినియోగించేపథకంయిది ఒరిస్సారాష్ట్రంలోని కోరాపుట్ జిల్లాలోగల జైపూర్ సంస్థానంలోని తూర్పుకనుమలలో డుడుమాజలపాతంవద్ద విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయడానికి యీపథకం ఉద్దేశిస్తున్నది. మాచ్‌ఖండ్‌నది ఆంధ్ర, ఒరిస్సా రాష్ట్రాలకు సరిహద్దుగా ప్రవహిస్తున్నది. ఈజలపాతం వద్ద 875 అ. ఎత్తునుంచి పడే నీటి నుంచి రూ. 22.92 కోట్ల ఖర్చుతో విద్యుదుత్పత్తి చేసే పథకం ఒకటి పూర్తి చేయడం జరిగింది. ఈ మాచ్‌ఖండ్ జలవిద్యుత్ కేంద్రం స్థాపిత యంత్ర శక్తి 1,24,750 కిలోవాట్లలో 70 శాతం ఆంధ్రప్రదేశ్, మిగిలిన 30 శాతం ఒరిస్సా పంచుకుంటాయి. ఈ కేంద్రం విశాఖపట్టణం రైలు స్టేషనుకు సుమారు 120 మైళ్ళదూరంలో వుంది.

### తుంగభద్రనుండి విద్యుచ్ఛక్తి

పదకొండుకోట్ల రూపాయల ఖర్చుతో కూడిన తుంగభద్ర జలవిద్యుత్ ప్రాజెక్టు మైసూరు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలు విద్యుదుత్పత్తికి చేస్తున్న సమిష్టికృషికి నిదర్శనం. తుంగభద్ర జల విద్యుత్పథకం క్రింద తుంగభద్రఆనకట్ట దిగువన, తుంగభద్ర ఆనకట్టకు 14 మైళ్ళ దిగువనా — ఈ రెండు ప్రాంతాల్లో నీటి పారుదల కాలవల్లోకి నీటిని విడుదలచేసేచోట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేయడం జరుగుతుంది. ఒకొక్కచోట ఒకొక్కటీ 9 కిలోవాట్లుగల ఎనిమిది సెట్లు ఈ రెండు విద్యుత్కేంద్రాలలోనూ వుంటాయి. మొత్తం విద్యుదుత్పత్తి 72 మెగావాట్లలోనూ ఆంధ్రప్రదేశ్ వాటా 80 శాతం. అంటే 57.5 మెగావాట్లు అన్నమాట. మిగిలిన భాగం మైసూరుకు చెందుతుంది. ఏడాదిలో ఆరు నెలలు తుంగభద్రనుండి జలవిద్యుదుత్పత్తిని స్థిరీకరించే వుద్దేశంతో నెల్లూరులో 30 మెగావాట్ల థర్మల్ విద్యుత్కేంద్రాన్ని 1965లో నెలకొల్పారు. తుంగభద్ర జలవిద్యుత్పథకంక్రింద ఉత్పత్తిచేసే విద్యుచ్ఛక్తి ముఖ్యంగా రాయలసీమ ప్రాంతంవారికి అధిక ప్రయోజనకారి అవుతుంది. నిజాంసాగర్ జలవిద్యుత్పథకం క్రింద నిజామాబాదులోని మంజీరావద్ద నిజాంసాగర్ జలాలనుండి విద్యుదుత్పత్తి అభివృద్ధిపరచబడుతున్నది.

రామగుండం థర్మల్ విద్యుత్కేంద్రం 1957లో ప్రారంభించబడింది. దీని స్థాపిత యంత్రశక్తి 37,500 కిలోవాట్లు. అమెరికా సహాయక ఋణంద్వారా 62.5 మెగావాట్లుశక్తిగల సెట్టు నొకదానిని నెలకొల్పి యీ కేంద్రాన్ని విస్తృతపరచాలన్న ఆలోచన వుంది. అనుకున్నప్రకారం పని జరుగుతున్నది. 1968-69లో యిక్కడి సెట్టు పనిచేయడం ప్రారంభించవచ్చు.

సూపర్ థర్మల్ స్టేషన్‌గా పేర్కొనదగ్గదీ, రాష్ట్రానికి గర్వకారణమనదగ్గదీ అయిన కొత్తగూడెం థర్మల్ కేంద్రం తొలిదశ నిర్మాణం రూ 23.34 కోట్ల ఖర్చు అంచనాతో తృతీయ ప్రణాళికలో చేపట్టబడింది. 60 మెగావాట్ల రెండు సెట్లు 1966లో పని ప్రారంభించాయి. 1967లో 60 మెగావాట్ల శక్తిగల మరోరెండు యూనిట్లుకూడా నెలకొల్పబడ్డాయి. రూ 46 కోట్ల వ్యయంతో నిర్మించబడుతున్న శ్రీశైలం జలవిద్యుత్ ప్రాజెక్టు, ఎగువసీలేరు జలవిద్యుత్ ప్రాజెక్టు, దిగువసీలేరు జలవిద్యుత్పథకం — యివి వివిధ నిర్మాణదశలలోవున్న పెద్ద ప్రాజెక్టులు. వీటన్నిటివల్ల ముందుముందు విద్యుదుత్పత్తి మన రాష్ట్రంలో మరింత ఆశాజనకంగా వుండగలదని విశ్వసించవచ్చు.

### వెయ్యి కనెక్షన్లు

పెన్నా డెల్టా పథకం క్రింద నెల్లూరు, కోవూరు తాలూకాలలో సుమారు 21,000 ఎకరాలలో రెండవపంటను పండించడానికి మంజూరీ లభించింది. ఈ ఏడాది వ్యవసాయ పనులకుగాను 1,000 విద్యుచ్ఛక్తి కనెక్షన్లను – ముఖ్యంగా సూళ్ళూరుపేట, వెంకటగిరి, రాపూరు వంటి మెట్ట తాలూకాలలో — యివ్వాలని నిర్ణయించారు.

---

## మన పంటసీమలు

### ఆంధ్రప్రదేశ్ వరి వంగడాలకు బీహారు ప్రశంస

ఈ ఏడాదినుంచి ఖరీఫ్ పంటను ప్రారంభించే వుద్దేశంతో ఆంధ్ర, మద్రాసు రాష్ట్రాలనుంచి బీహారు ప్రభుత్వం సేకరించిన మేలురకం వరి వంగడాలు చాలా సత్ఫలితాలను యిచ్చాయి. బీహారు ప్రభుత్వం తమ రాష్ట్రంలో సుమారు 55,000 టన్నుల వరి వంగడాల్ని పంపిణీ చేసుకుంది. వీటిలో 31,000 టన్నులు ఆంధ్రప్రదేశ్‌నుంచీ, 451 టన్నులు మద్రాసు నుంచీ సేకరించింది. ఈ ఏడాది వర్షాలు తగినంతగా లేక, తగిన సమయంలో కురవకపోయినప్పటికీ ఈ శీత కాలంలో 48-50 లక్షల టన్నుల దిగుబడిని ఆశిస్తున్నారు. ఇంత దిగుబడి రావడానికి ప్రధానంగా ఆంధ్రప్రదేశ్ పంపిన వంగడాల ప్రత్యేకతే కారణమని బీహారు ప్రభుత్వం భావిస్తున్నది.

### రబీ పంటకాలానికి అధిక దిగుబడి రకాల కార్యక్రమం

సంకరజాతి సజ్జ, సంకరజాతి మొక్కజొన్న, సంకరజాతి జొన్న, అధిక దిగుబడి వంగడాలు తగినంత మొత్తంలో వ్యవసాయ శాఖవద్ద వున్నాయి. వీటన్నిటినీ రబీ పంట కాలంలో

పండించవచ్చు. ఈ వంగడాలను పొందే విషయమై వ్యవసాయ దారులు వ్యవసాయ శాఖ డైరెక్టరును సంప్రదించవచ్చు. అధిక దిగుబడి రకాలకు చెందిన పంటను అంతటినీ కొనే ఏర్పాట్లుకూడా జరిగాయి. ఈ పంటలకు అవసరమైన ఎరువులను, క్రిమి సంహారక మందులను సరసమైన ధరలకు అందించే ఏర్పాట్లుకూడా జరిగాయి.

## ఐ. ఆర్-8 రకం రైతులకు లాభదాయకం

మేలురకం వరి వంగడాలు వేటివల్లనైనా రైతులకు అధిక దిగుబడి, అధిక లాభాలు లభిస్తాయి. ఐతే ఐ. ఆర్_8 పొట్టిరకం వరి వంగడాలవల్ల యింకా ఎక్కువ లాభాలు రైతులకు కలుగుతాయి.

ఐ. ఆర్_8 రకంతో పాటు మరో రెండు మేలు జాతి రకాలనుకూడా ప్రయోగాత్మకంగా ఢిల్లీలో వేసి, వచ్చిన ఫలితాలను చూసి, పై నిర్ణయాన్ని ప్రకటించారు నిపుణులు.

ఒక ప్రయోగాత్మక క్షేత్రంలో ఐ. ఆర్_8 రకం హెక్టారుకు 8.6 టన్నుల దిగుబడిని యిచ్చింది. ఎన్. పి_130 రకం 4 టన్నులు, తైచుంగ్‌నేటివ్_1 రకం 6.2 టన్నులు దిగుబడినిచ్చాయి.

ఐ. ఆర్_8 రకం సేద్యానికి ఖర్చు ఎక్కువ అయినప్పటికీ పై రెండు మేలురకాల వంగడాలకన్నా దిగుబడిని ఎక్కువ యిస్తుంది. దీనివల్ల వ్యవసాయదారునికి హెక్టారుకు నికరంగా రూ. 4,225 లు లాభిస్తాయి. ఎన్. పి_130 రకంవల్ల 2,377 తైచుంగ్ నేటివ్_1 వల్ల రూ. 2,387 లు నికరలాభం వుంటుంది.

## సస్యరక్షణ చర్యలు-ఎలుకల నిర్మూలన పథకం

ఎలుకల నిర్మూలన పథకం ఒకటి 1967 ఫిబ్రవరిలో కేంద్ర ప్రభుత్వ పథకంక్రింద మంజూరైంది.

రాష్ట్ర ప్రభుత్వం యీ పథకాన్ని అమలు పరిచేందుకుగాను 18లక్షల ఎకరాలలో చల్లడానికై 1967_68 లో రూ. 3.6 లక్షల ఖరీదుచేసే క్రిమి సంహారకాలను కొనుగోలు చేయడానికి వీలుగా కేంద్రప్రభుత్వం 100 శాతం గ్రాంటును యివ్వడానికి అంగీకరించింది. ఇప్పుడు భారత ప్రభుత్వం, ఎలుకల నిర్మూలనకు సంబంధించిన పథకాన్నొకదానిని క్రిమి సంహారక, తెగుళ్ళ నివారణ పథకంలోని ఒక భాగంగా ప్రవేశపెట్టింది. ఎలుకలవల్ల కలుగుతున్న నష్టాన్ని ప్రజలు తెలుసుకొనేట్టు చేయడం, ఎలుకల నిర్మూలనను సమర్థవంతంగా రైతులు తమంతటతామే అమలు పరచేటట్టు చేయడం, ప్రస్తుతం వున్న ఎలుకల నిర్మూలన పద్ధతులను మరింత తీవ్రతరం చేయడం, ఎలుకల నిర్మూలన ఉద్యమాలను జరిపించడం ఈ పథకం ఉద్దేశం. ఎలుకల నిర్మూలనకుగాను అవసరమయ్యే మందులను రైతులకు ఉచితంగా యిచ్చే ఏర్పాటుకూడా ఈ పథకం క్రింద వుంది.

ఈ పథకాన్ని 1967_68 లో అమలు పరచాలన్న వ్యవసాయశాఖ డైరెక్టరు ప్రతిపాదనలను రాష్ట్ర ప్రభుత్వం అంగీకరించింది. ఉచితంగా రైతులకు పంచేందుకై అవసరమయ్యే ఎలుకల సంహారక మందులను కొనేందుకుగాను రాష్ట్ర ప్రభుత్వం రూ. 3.6 లక్షలు మంజూరు చేసింది.

## ఎరువుల సంస్థ

భారత ప్రభుత్వ ఎరువుల సంస్థ ట్రాంబే యూనిటుకు చెందిన ప్రాంతీయ కార్యాలయానికి హైదరాబాదులో ప్రారంభోత్సవం జరిగింది. దీనికి స్వాగతం పలుకుతూ దక్కన్ క్రానికల్ నవంబరు 28 వ తేదీ పత్రికలో ఉప సంపాదకీయంలో యీ విధంగా వ్రాసింది "మన రాష్ట్రంలో యీ ప్రాంతీయ కార్యాలయాన్ని ఏర్పాటు చేయడంవల్ల మన రైతులకు బహు విధాలుగా యిది తోడ్పడగలదు." 'హైదరాబాదులో ఈ ప్రాంతీయ కార్యాలయం ప్రారంభం కావడంవల్ల యిక్కడి ఎరువుల కొరత కొంత వరకు తీరిపోగలద'న్న తమ ఆశాభావాన్ని ఆంధ్రజనత నవంబరు 29 వ పత్రికలో వ్యక్తం చేసింది. రాష్ట్రంలో ఎరువుల కర్మాగారాన్ని నెలకొల్పవలసిన అవసరాన్ని కూడా యీ పత్రిక గట్టిగా నొక్కిచెప్పింది.

## సంగారెడ్డి పండ్ల పరిశోధక కేంద్రం

హైదరాబాదుకు సుమారు 60 కిలో మీటర్ల దూరంలో సంగారెడ్డిలో వున్న పండ్ల పరిశోధక కేంద్రానికి దేశంలోని వివిధ ప్రాంతాల నుండి విశేషంగా మామిడిపండ్లు, సీతాఫలాలు సరఫరా అవుతుంటాయి. ఇవికాక జామపళ్ళు, గింజలు లేని కమలాలు, గింజలు లేని నిమ్మపళ్ళు, గింజలులేని సపోటాపళ్ళుకూడా ఎక్కువగానే ఈ కేంద్రం సేకరిస్తున్నది.

భారతదేశంలో ఎక్కువగా మామిడిపళ్ళను పండించే రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ ద్వితీయ స్థానం వహిస్తుంది. మొదటిది బీహారు. ఆంధ్రప్రదేశ్‌లో సుమారు రెండు లక్షల ఎకరాలలో మామిడి తోటలున్నాయి.

భారతదేశంలోని వివిధ రాష్ట్రాలనుండీ, సింహళం నుండీ 289 రకాల మామిడి పళ్ళను యీ కేంద్రం సేకరించింది.

# మన పరిశ్రమలు

## పారిశ్రామిక ఉత్పత్తి

గత పది సంవత్సరాలలో భారతదేశంలో పారిశ్రామిక ఉత్పత్తులు దాదాపు రెండింతలుగా పెరిగాయి. కేంద్ర పారిశ్రామిక అభివృద్ధి, కంపెనీ వ్యవహారాల మంత్రి శ్రీ ఫక్రుద్దీన్‌అలీ అహమ్మద్ "రాష్ట్ర హద్దులు" అనే అంశంపై ఆలిండియా రేడియో ద్వారా ప్రసంగిస్తూ దేశంలో పారిశ్రామికీకరణకు గత పది సంవత్సరాలలో తీవ్రంగా కృషి జరిగి, గమనార్హమైన అభివృద్ధిని సాధించడం జరిగిందని ఆయన అన్నారు. 1960 మధ్య కాలంతో పోల్చినప్పుడు దేశంలో పారిశ్రామిక ప్రగతి అధికంగానే ఉంది.

దేశమంతటా సమానస్థాయిలో ప్రగతిని సాధించడానికి వీలుగా అన్ని ప్రాంతాలలో పరిశ్రమలను నెలకొల్పడానికి తీసుకున్న అనేక చర్యలను గూర్చిన వివరాలను శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహమ్మద్ వివరించారు.

రేడియో ప్రసంగం పూర్తి పాఠం ఈ దిగువ యివ్వడం జరిగింది.

"గత పది సంవత్సరాలలో పారిశ్రామిక రంగంలో మనం గమనార్హమైన అభివృద్ధిని సాధించాము. వాస్తవంగా గత పది సంవత్సరాలలో పారిశ్రామిక ఉత్పత్తులు అధికం కావడమేగాక రెండింతలుగా పెరిగాయి. 1950 మధ్య నాటికన్నా నేడు జరగాల్సిన కృషి చాలా ఉంది. గత కొన్ని సంవత్సరాలలో వేసిన పునాదులపై పటిష్ఠమైన పారిశ్రామిక రంగాన్ని నిర్మించడానికి వచ్చేసంవత్సరాలలో కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు, ప్రజలు యితోధికంగా కృషిచేయాల్సిన అవసరం ఉంది.

## విస్తృతమైన కృషి అవసరం

"ఈ కృషిలో విజయం సాధించాలనుకున్నప్పుడు ప్రాంతం, ప్రదేశం, రాష్ట్రం దృష్టితోగాక మొత్తం దేశ పారిశ్రామిక పరిస్థితిని దృష్టిలో ఉంచుకొని దేశ పారిశ్రామిక అభివృద్ధికి కృషి చేయాలి. అయితే సువిశాలమైన భారతదేశంలో ఏదో ఒక రాష్ట్రంలో, ప్రాంతంలో యేదో ఒక పరిశ్రమ కావాలనే వాదనలు ప్రతి వాదనలు, తదితర కోర్కెలు ఉండడం సహజం. ప్రజలు ప్రత్యేకంగా పారిశ్రామిక రంగంలో సంప్రదాయ సిద్ధంగా వెనుకబడి ఉన్న ప్రాంతం ప్రజలు-తమ ప్రాంతంలో సత్వర పారిశ్రామిక ప్రగతిని కోరడం న్యాయసమ్మతమే అవుతుంది. వాస్తవంగా అన్ని ప్రాంతాలలో సమంగా పరిశ్రమలను నెలకొల్పడం పారిశ్రామిక విధానాలలో భాగంగా ఉండాలి. దేశంలోని వివిధ రాష్ట్రాల మధ్యనే గాక రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో సహితం పరిశ్రమలను సమంగానే నెలకొల్పాలి. ఉదాహరణకు పారిశ్రామికంగా అభివృద్ధిగాంచిన మహారాష్ట్ర, పశ్చిమబెంగాలులలో కూడ పారిశ్రామిక ప్రయోజనాలు పొందని ప్రాంతాలు చాలా ఉన్నాయి. అనేక కారణాల వల్ల యీ దేశంలో పారిశ్రామిక అభివృద్ధి కొన్ని మహా పట్టణాలలోనే కేంద్రీకృతమై ఉంది. గత పది సంవత్సరాలలో పరిశ్రమల పంపిణీ సమంగా జరిగినప్పటికీ; వివిధ రాష్ట్రాల మధ్య, రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల మధ్య పరిశ్రమల పంపిణీ సమంగా జరగడానికి యింకా కృషిచేయాల్సి ఉంది.

"భారతదేశమంతా ఒకే ఆర్థిక యూనిటుగా భావించడం చాలా ముఖ్యం. ఇతరదేశాలవలె గాక మనకు విస్తృతమైన మార్కెటు ఉండి పరిశ్రమలను ప్రారంభించడం మన అదృష్టంగా భావించాలి. యూరప్‌లోని అభివృద్ధి చెందిన దేశాలతో సహా ప్రపంచంలోని చాలా దేశాలు, మార్కెటును విస్తృతపరచడానికి వీలుగా ఉమ్మడిమార్కెట్లను ఏర్పాటు చేసుకోవడానికి కృషి చేస్తున్నాయి. మనకు ఉమ్మడిమార్కెటు ఉంది. జీవనస్థాయి త్వరితగతిని అభివృద్ధిచెందుతున్న కారణంగా మార్కెటుకూడ పెరుగుతున్నది. తత్కారణంగా ఆధునిక టెక్నాలజీని వినియోగించుకోవడానికి వీలుగా భారీఎత్తున ఉత్పత్తిని పెంచాలి. ఆధునిక ఉత్పత్తివిధానాల నుండి అధిక ప్రయోజనాలను పొందడానికి వీలుగా పారిశ్రామిక ప్రగతి అన్ని రాష్ట్రాలలోను, రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలలోను సమంగా జరగడానికి పరిశ్రమలపంపిణీ జరగాలి. భారీ పరిశ్రమలను, ఆర్థిక, సాంకేతిక ప్రాతిపదికలపై నెలకొల్పాలని నేను భావిస్తున్నాను. సాధారణంగా పరిశ్రమల పంపిణీ విస్తృతంగా జరగనప్పటికీ వనరులను పొదుపుగా వినియోగించుకునే ప్రాతిపదికపై పారిశ్రామిక అభివృద్ధి విధానం రూపొందాలి.

"అయితే దేశంలోని వివిధ ప్రాంతాలలో పరిశ్రమలను సమంగా నెలకొల్పాలనే ప్రజల న్యాయమైన కోర్కెలను త్రోసిపుచ్చడంలేదు. తత్కారణంగానే పారిశ్రామికవిధానం తీర్మానంలో ఈదిగువ విధంగా పేర్కొన్నారు.. పారిశ్రామికీకరణద్వారా దేశం మొత్తం ఆర్థికపరిస్థితి మెరుగుపడడానికి వీలుగా వివిధ ప్రాంతాలలోని అభివృద్ధి వ్యత్యాసాలను త్వరితగతిని తగ్గించడం చాలా ముఖ్యం. సంస్థాగత, ఆర్థిక చర్యలద్వారా గ్రామీణపరిశ్రమలతో చిన్నతరహా పరిశ్రమలకు తోడ్పడుతూ సాధ్యమైనంత వరకు విస్తృత ప్రాతిపదికపై పారిశ్రామికీకరణ విధానాలను రూపొందించాలి. విస్మరించరాని రాజకీయ అంశంకూడ ఉంది. ప్రత్యేకంగా విభిన్నతలతో విశాలమైన మనవంటి దేశంలో-పార్లమెంటరీ ప్రజాస్వామ్యం, ఫెడరల్ రాజ్యాంగం, వయోజనవోటింగ్ గల మనదేశంలో-యీ అంశాన్ని విస్మరించరాదు.

## పారిశ్రామిక విధాన తీర్మానం

ఈ పరిస్థితులలో పారిశ్రామిక అభివృద్ధి ప్రణాళిక, మొత్తం ఆర్థిక ప్రణాళికలు విభిన్న జాతీయ, ప్రాంతీయ అభివృద్ధి సమానతలకు అనుగుణంగా ఉండాలని స్పష్టమవుతుంది. ఆర్థిక ప్రగతి పథంలో అటువంటి విభిన్నతలు ఉండడం సహజం. కొన్ని ప్రాంతాలు యితర ప్రాంతాల కన్నా ఎక్కువ వనరులు కలిగి ఉన్నాయి. కొన్ని పారిశ్రామిక అభివృద్ధి పథకాలలో ముడి ఇనుము, నూనెలవంటి కొన్ని విధాలైన వనరుల వినియోగానికి ఎక్కువ ప్రాధాన్యం యివ్వాల్సి ఉంటుంది. విద్యుచ్ఛక్తి, ఇంజనీరింగ్ ప్రయోజనాల రూపంలో ప్రాతిపదిక అంశాలు ఉండి పెట్టుబడికి ప్రోత్సహం కలిగించే ప్రాంతాలు ఉన్నాయి. తత్ఫలితంగా వివిధ ప్రాంతాలలో పారిశ్రామికాభివృద్ధి స్థాయి ఒకేతీరుగాగాక విభిన్నంగా ఉంటున్నది. పేద దేశంలో తక్కువగా ఉన్నవనరులను అసమానంగా పంపిణీచేసినప్పుడు అభివృద్ధి కుంటువడుతుందని గుర్తించాల్సిన అవసరం ఉంది. అభివృద్ధికి దెబ్బతగిలేవిధంగా సమాన ప్రాతిపదికకు ప్రాధాన్యత యివ్వరాదని నేను భావిస్తున్నాను.

## పంజాబులో సాధించిన అభివృద్ధి

"పేర్కొనదగిన మరొక అంశం కూడఉన్నది. భారీ పరిశ్రమలను నెలకొల్పే సందర్భంలో ప్రత్యేకంగా కేంద్రప్రభుత్వ ఆర్థిక వనరులతో పరిశ్రమలను నెలకొల్పే సందర్భంలో విపరీతమైన చర్చజరుగుతుంటుంది. ప్రత్యేకంగా, రాష్ట్రంలో అభివృద్ధికిచిహ్నంగా భావించడంవల్లనే భారీపరిశ్రమలు నెలకొల్పాలని కొంత వరకు కోరుతుండడమే యీ చర్చకు కారణం. రాష్ట్రంలో కొన్ని ఫ్యాక్టరీలు

అవిపెద్ద ఫ్యాక్టరీలే అయినా, నెలకొల్పడంతో ఆదాయంలోగానీ ఉపాధికల్పనలోగాని గమనార్హమైన మార్పురాదని గుర్తించడం జరగడంలేదు. పంజాబులో యిటీవల సాధించిన అభివృద్ధిపేర్కొనదగినది. అక్కడ భారీపరిశ్రమల సహాయంలేకుండానే ఆరాష్ట్రం అభివృద్ధిని సాధించింది. కొన్ని భారీపరిశ్రమలు నెలకొల్పినప్పటికీ ప్రత్యేకమైన అభివృద్ధి సాధించని రాష్ట్రాలుకూడ ఉన్నాయి. అన్నిరంగాలలో అభివృద్ధిని సాధించడానికి ముందు అన్నిటికీ మూలమైన వ్యవసాయరంగాన్ని అభివృద్ధిపరచడానికి పటిష్ఠమైన చర్యలు తీసుకోవాలి.

“గత 10–15 సంవత్సరాలలో రాష్ట్రాల మధ్య పారిశ్రామిక అభివృద్ధి విషయంలో గల అసమానతలను తొలిగించడానికి చాలా తక్కువకృషి జరిగిందని తరచుగా వాదిస్తుంటారు. వాస్తవిక విషయాలను పరిశీలించినప్పుడు యీ వాదన తప్పని స్పష్టమవుతుంది. ఉదాహరణకు, మూడు ప్రణాళికల కాలాలలో కేంద్రరంగంలోని పరిశ్రమల పెట్టుబడులలో 60 శాతం ఒరిస్సా, మధ్యప్రదేశ్, బీహారులలో ఖర్చుచేయడం జరిగింది. అయితే ప్రాంతీయ అవసరాల ప్రాతిపదికపై గాక యీ రాష్ట్రాలలో ఉక్కు పరిశ్రమలకు అవసరమైన ముడి పదార్థాలు లభించేవనరుల ప్రాతిపదకపై ఖర్చుపెట్టడం జరిగింది. పారిశ్రామికీకరణ ప్రణాళికలో భారీపరిశ్రమలకు ప్రాధాన్యంయివ్వడంకూడ దానికి కారణమైంది. నికరమైన పెట్టుబడుల వినియోగం విషయంలో ఎక్కువపెట్టుబడి వెనుకబడిన రాష్ట్రాలలోనే వినియోగించారు. విద్యుచ్ఛక్తి వినియోగం, విద్యుచ్ఛక్తి ఉత్పత్తి విషయంలోకూడ యిదే విధమైన నిర్ణయానికి వస్తాము. పురాతన పారిశ్రామిక రాష్ట్రాలైన మహారాష్ట్ర, పశ్చిమబెంగాలు విద్యుచ్ఛక్తి స్థాపిత ఉత్పత్తిశక్తిని ఎక్కువ చేశాయనడంలో సందేహంలేదు. అయితే దేశంలోని యితర ప్రాంతాలలో విద్యుచ్ఛక్తి ఉత్పత్తిరేటు పై రెండు రాష్ట్రాలకన్నా ఎక్కువగా ఉండి విద్యుచ్ఛక్తి సరఫరాలో సత్వర అభివృద్ధిని సాధించాయి ప్రాంతీయ అసమానతలను కొన్ని రాష్ట్రాలు ఆశించినంత త్వరగా తొలిగించడం జరగడం లేదనేది వాస్తవం. అయితే గతకొన్ని సంవత్సరాలుగా ప్రాంతీయవ్యత్యాసాలు తొలిగించేకృషి జరుగుతున్నదనడంలో యేమాత్రం సందేహంలేదు.

## భిన్నత్వంలోని ఏకత్వం

“నా ప్రసంగాన్నిముగించే ముందు మరో విషయాన్ని ప్రస్తావిస్తాను. అనేక కారణాలవల్ల భారతదేశంలో విచ్ఛిన్నకరశక్తులు అనేకం పనిచేస్తున్నాయి. జాతీయప్రయోజనాల నిమిత్తంలేకుండా స్పర్థలు రేకెత్తించడానికి భాషాదురభిమానం, మత, ప్రాంతీయ విభేదాలను తరచుగా వినియోగిస్తున్నారు. అయితే యీభిన్నత్వంలోనే ఒక ఏకత్వం అంతర్లీనంగావుంటూవున్నది. ఈ భిన్నత్వంలోని ఏకత్వాన్ని పటిష్ఠవంతంచేసేందుకే మనం మన కృషిని కేంద్రీకరించాలి. దేశం ఎంతోకాలంపాటు అభివృద్ధియాత్రలో పట్టుసడలిపోకుండా ముందుకుపోతూవున్నప్పుడే, వివిధప్రాంతాల, రాష్ట్రాలకోరికల్ని తీర్చడానికి వీలవుతుంది.

దేశంలోని ఏప్రాంతపు అభివృద్ధి, సమృద్ధి అయినా దేశాభివృద్ధి, దేశసమృద్ధి మీదనే ఆధారపడి ముడివేయబడివున్నదన్న విషయాన్ని విస్మరించ వలదని సమాజంలోని యోచనాపరులందరికీ విజ్ఞప్తిచేస్తున్నాను.”



## చురుకుగా నిర్మాణం కొనసాగుతున్న భారత్ హెవీప్లేట్, వెస్సల్స్ కర్మాగారం

కేంద్రప్రభుత్వం మన రాష్ట్రంలో నిర్మిస్తున్న భారత్ హెవీ ప్లేట్, వెస్సల్స్ కర్మాగారం నిర్మాణం చురుకుగా సాగుతున్నది. విశాఖపట్టణంలో రూ 16 కోట్ల వ్యయంతో నిర్మిస్తున్న ఈ కర్మాగారం ఎరువులకు, పెట్రోలియం పెట్రోకెమికల్ పరిశ్రమలు మొదలైన వాటికి అవసరమైన భారీ పరికరాలను పోతపోస్తుంది. ఈ కర్మాగారానికి శంకుస్థాపన జరిగినప్పటి నుండి యీ ఏడాదిలోనూ నిర్మాణపు పని అతిశీఘ్రంగా జరుగుతున్నది.

దీనికి 1967 జనవరిలో శంకుస్థాపన జరిగింది. జకొస్లొవేకియా సాంకేతిక సహాయంతో ఇది నిర్మించ బడుతున్నది. ఈ ఏడాదిలోనూ ప్రధానమైన కర్మాగారం పునాది నిర్మాణం చురుకుగా జరిగింది. సహాయక భవనాల నిర్మాణం కూడా ఇప్పుడే జరుగుతున్నది. ప్రధానమైన కర్మాగారం భవనానికి కావలసిన ఉక్కు పనులపోత యిప్పుడు జరుగుతున్నది. ఈ ఏడాది ఏప్రిల్–మే నెలలో ప్రధాన భవనాన్ని నిర్మించే పనిప్రారంభంకావచ్చు.

ఈ ఏడాది ఆఖరుకు చిన్నచిన్న పరికరాలపోత పనినికూడా పూర్తిచేయ్యాలని యాజమాన్యంవారు తలుస్తున్నారు.

## నాణ్యమైన వస్తువుల ఉత్పత్తికై లఘు పరిశ్రమలకు సూచన

లఘుపరిశ్రమల విస్తరణ శిక్షణ సంస్థలో జనవరి 3వ తేదీన రాష్ట్రగవర్నరు శ్రీ పట్టం ఎ. థానుపిళ్ళె ఆసియన్ ప్రొడక్టివిటీ సంస్థ లఘుపరిశ్రమల యాజమాన్యం శిక్షణ తరగతులకు సంబంధించిన ఇన్–ప్లాంట్ శిక్షణ కార్యక్రమంలో మాట్లాడుతూ జపాను దేశం పారిశ్రామికంగా అమోఘమైన విజయాన్ని సాధించడానికి ప్రధానకారణం అది లఘుపరిశ్రమలను యితోధికంగా అభివృద్ధి చేయడమేననీ; ఉత్తమమైన పద్ధతులతోనూ, సమర్థవంతమైన యాజమాన్యంతోనూ ఉన్నతమైన ప్రమాణాలుగల నాణ్యమైన వస్తువులను ప్రపంచమార్కెటులో పోటీచేట్లుగ మనదేశంలోని లఘు పరిశ్రమలు ఉత్పత్తి చేయాలనీ తెలియ జేశారు.

నాలుగు వారాలపాటు జరిగిన ఈ శిక్షణలో వియత్‌నామ్, థాయ్‌లాండ్, తైవాన్, కొరియా, జపాను, నేపాలు, సింహళం దేశాలకు చెందిన లఘు పరిశ్రమలకు సంబంధించిన వారు పాల్గొన్నారు.

అభివృద్ధి చెందుతున్న మన భారత దేశంవంటి దేశంలో ముడి సరుకు వినియోగం మీదా, పెట్టుబడి పరికరాలమీదా ఎక్కువ శ్రద్ధ చూపించడం అవసరం అనికూడా గవర్నరు తెలియ జేశారు. లఘు పరిశ్రమ దారులకు ఆధునిక యాజమాన్యపు మెళకువలను అందజేయడం చాలా అవసరమనీ, ఈ విషయంలో చక్కటి

ఫ్యాక్టరీలు ఎక్స్‌టెన్‌షన్ సర్వీస్ కార్యక్రమాల ద్వారా నిపుణుల సలహా సహాయాలను అందజేయడానికి ప్రభుత్వం ప్రయత్నాలు చేస్తున్నదని కూడా ఆయన తెలియ జేశారు.

### ఎయిర్ బ్లాస్ట్ సర్క్యూట్ బ్రేకర్

స్వదేశంలోనే తయారుచేయబడి, భారత భారీవిద్యుత్పరికరాల కర్మాగారంలోని స్విచ్‌గేర్‌లో పరిశీలింపబడిన మొట్ట మొదటి 132 కె.వి. బ్లాస్ట్ సర్క్యూట్ బ్రేకర్ 1967 డిసెంబరు 3వ తేదీన ఆంధ్రప్రదేశ్ విద్యుచ్ఛక్తి మండలికి చెందిన షాపూర్ నగర్ సబ్‌స్టేషనులో పనిచేయడం ప్రారంభించింది.

### వికారాబాదు పారిశ్రామిక వాడ

హైదరాబాదుకు 64 కిలోమీటర్ల దూరంలో గల వికారాబాదుకు సమీపంలో శివారెడ్డి పేట గ్రామంలో వికారాబాదు పారిశ్రామిక వాడవున్నది. హైదరాబాదు జిల్లాలోని వెనుకబడిన ప్రాంతాలలోనూ, గ్రామీణ ప్రాంతాలలోనూ పారిశ్రామికాభివృద్ధిని సాధించడం యీ పారిశ్రామికవాడ నెలకొల్పడంలో ప్రధానోద్దేశం. ఇక్కడ మొత్తం 24 యూనిట్లు వున్నాయి. 16 యూనిట్లలో ఆయా పరిశ్రమలను అప్పుడే నెలకొల్పడం జరిగింది. వీటిలో పన్నెండు యూనిట్లు పని కూడా ప్రారంభించాయి.

### సింగరేణి గనులకు కొత్త అధిపతి

భారత పునరావాస మంత్రిత్వశాఖకు చెందిన సంయుక్త కార్యదర్శి శ్రీ అనిల్‌దేను సింగరేణిగనుల మేనేజింగ్ డైరెక్టరుగా నియమించారు. శ్రీ దే జనవరి 17న ఛార్జితీసుకున్నారు. *

## కుటుంబనియంత్రణ

వెంకటేశ్వర్రావు బజారునించి కాయగూరలు పట్టుకొచ్చాడు. ఇవ్వాళ కాకరకాయలు వొచ్చాయి. కాకరకాయల వేపుడు అతనికి చాలాయిష్టం. భార్యనుపిలిచి వేపుడు చేయించమని చెప్దామనుకున్నాడుగాని భార్య పలకనేలేదు. తనే నేరుగా వంటింట్లోకి వెళ్ళాడు. వంటిల్లు ఖాళీగావుంది. దొడ్లో వున్నదేమోనని పిలిచాడు. సమాధానంలేదు. వీధిలో ఆడుకుంటున్న పిల్లల్ని అడిగితే ఏమో అన్నారు వాళ్ళు.

రెండోవాడు పక్క వాళ్ళింటికి వెళ్ళి చూసొచ్చాడు. అక్కడా లేదట. ఎక్కడికి వెళ్ళిందిచెప్మా అనుకుంటుండగా పక్కింటావిడే చంటాడిని ఎత్తుకునివచ్చి "జక్కు గన్నవరం వెళ్ళాలనుకుంటున్నానని యిందాకచెప్పింది అన్నగారూ. బహుశా అక్కడికి వెళ్ళిందేమో" అంది ఆవిడ.

అవును. అక్కడికే వెళ్ళుంటుంది. ఈ విషయంలో నేను ముందుకు రాకపోతే తనే బైలుదేరిందన్న మాట-గొణుక్కున్నాడు వెంకటేశ్వర్రావు.

జక్కు సక్కుబాయి కృష్ణాజిల్లా దివితాలూకాలోని ఒక ఎలిమెంటరీ పాఠశాలలో ఉపాధ్యాయిని. ఆమెభర్త అదే తాలూకాలోని మొవ్వగ్రామంలో జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాలలో గుమాస్తాగా పనిచేస్తున్నాడు. అతనికి నెలకు 107 రూపాయల జీతం వస్తుంది. భార్యకు నెలకు 170 రూ. వస్తాయి. సక్కుబాయి వయస్సు 33 సంవత్సరాలు. ఆమెకు ఇరవైమూడోయేట ఒక కొడుకు పుట్టాడు. రెండోకాన్పు ఆడపిల్ల. ఇప్పుడు ఆపిల్ల వయస్సు 7 సంవత్సరాలు. మూడోకాన్పు తర్వాత సక్కుబాయి భర్తతో తమకు యిక పిల్లలు చాలనిచెప్పింది.

• • *

"ఇక్కడికి రావడంలో మీఉద్దేశమేమిటి?"

"కుటుంబ నియంత్రణను గురించి కరపత్రాలవీ వుంటే చదవాలనిపించింది. నా కింక పిల్లలు అక్కర్లేదనుకున్నాను. శాశ్వతంగా యీ సమస్యకు ఒక పరిష్కారమార్గాన్ని ఆలోచిద్దామనిపించింది. ఈ కరపత్రాలు ఎంతో ఆశ కలిగించాయి"

"మరి మీ సహోధ్యాయినుల మాటేమిటి?"

"కుటుంబ నియంత్రణని గురించి నేను ఎప్పుడుచెప్పినా వాళ్ళు నన్ను నిరుత్సాహ పరుస్తుండేవారు. అందుకని ఎవరికీ చెప్పాచెయ్యకుండా యిల్లావొచ్చేశాను".

"ఇప్పుడు మీకు ఎలా అనిపిస్తోంది?"

"చాలా సంతోషంగా వుంది నాకిప్పుడు"

"మరి మీ భర్తమాటేమిటి?"

"నేను వచ్చిన మర్నాడే ఆయనవచ్చి చూసివెళ్ళారు. మంచి పనేచేశావు అన్నారు. పిల్లల్ని కాస్త కనిపెట్టుకుని వుండమని పంపించాను."

సక్కుబాయి శిబిరాన్నించి తిరిగి వెళ్ళేముందు ఆమెభర్త మూడేళ్ళ పిల్లనికూడా వెంటబెట్టుకొని వచ్చాడు.

వాళ్ళు సంతోషంగా యింటికి వెళ్ళిపోయారు.

### వెసెక్టమీ శిబిరాలు

మెదక్‌జిల్లా కుటుంబనియంత్రణ సంస్థ అధ్వర్యంలో డిశంబరు 18 నుంచి 20 వరకు గజ్వేల్ పంచాయతీ సమితిలో 450 వెసెక్టమీ శస్త్ర చికిత్సలు జరిగాయి.

గజ్వేల్ సమితిలోని గజ్వేలులోనూ, జగదేవపూర్‌లోనూ వర్గల్‌లోనూ, సిద్దిపేట సమితిలోని కొండపాకలోనూ ప్రత్యేక వెసెక్టమీ శిబిరాలు నిర్వహించ బడ్డాయి.

బికనూరులో డిశంబరు 20న నిజామాబాదుజిల్లా కలెక్టరు శ్రీ టి. ఎల్. శంకర్, కుటుంబ నియంత్రణ శిబిరానికి ప్రారంభోత్సవం చేశారు. ఈ ఏడాదిలో యీ జిల్లాలో యింతవరకు 2300 వెసెక్టమీ శస్త్ర చికిత్సలు జరిగాయి.

కరీంనగర్ జిల్లాలోని పెద్దపల్లి పంచాయతీ సమితి అధ్వర్యంలో డిశంబరు 16 న ఐ. యు. సి. డి. శిబిరం ఒకటి నిర్వహించబడింది. సుమారు 30 ఐ. యు. సి. డి పరిశీలనలు జరిగాయి.

ఒంగోలు పంచాయతీ సమితి డిశంబరు నెలలో ఆరు వసెక్టమీ శిబిరాలను నిర్వహించింది. 129 వెసెక్టమీ శస్త్ర చికిత్సలు జరిగాయి.

వరంగల్ జిల్లా, చెర్యాల పంచాయతీ సమితిలోని చెర్యాల, కేశవపూర్, పందుమర్తి, బుచ్చన్న పేటలలో యిటీవల 4 రోజుల పాటు జరిగిన వెసెక్టమీ శస్త్ర చికిత్సల కార్యక్రమంలో 173 వెసెక్టమీ శస్త్ర చికిత్సలు జరిగాయి.

ఒంగోలు తాలూకాలోని కొరిసిపాడు పంచాయతీ సమితి అధ్వర్యంలో తొమ్మిది గ్రామాలకు కలిసి పదిరోజులపాటు వెసెక్టమీ శిబిరాన్నొకదానిని ఏర్పాటు చేశారు. ఈ పది రోజులలో మొత్తం 110 శస్త్ర చికిత్సలను జరిపారు.

గూడూరు తాలూకాలో కుటుంబ నియంత్రణ వారోత్సవ సందర్భంగా గూడూరు పంచాయతీ సమితి ఒక వెసెక్టమీ కేంద్రాన్ని ఏర్పాటు చేసింది. ఇందులో 92 వెసెక్టమీ శస్త్ర చికిత్సలు జరిగాయి.

## కుటుంబనియంత్రణ సందేశం

దేశం నలుమూలలా కుటుంబనియంత్రణ ఉద్యమాన్ని విస్తరింపజేయడానికి సామూహిక ప్రచారం, ఉద్బోధనిమిత్తం రు. 10 కోట్లుకేటాయించారు.

తీవ్రతరప్రచారం, సమాచారం అందజేయడం, ఉద్బోధ కార్యక్రమాలను అమలుజరిపేటందుకు రాష్ట్ర ప్రభుత్వాలకు రు. 636 లక్షలు మంజూరు చేయడం జరిగింది.

కేంద్రసమాచార, ప్రసారమంత్రిత్వశాఖ తమవివిధ డివిజన్లద్వారా ప్రచార కార్యక్రమాలు నిర్వహించడానికి రు. 269 లక్షలు కేటాయించారు.

ఆరోగ్య, కుటుంబనియంత్రణ, పట్టణాభివృద్ధి మంత్రిత్వశాఖ సమూహిక ఉద్బోధ, ప్రచార డివిజన్ల వినియోగార్థం రు. 93 లక్షలు కేటాయించారు.

ఫిల్ములు, సంగీతనాటకాలు, తోలుబొమ్మల ప్రదర్శనలు, బస్సుబోర్డులు. హోర్డింగులు, వస్తుప్రదర్శనలు, భజనలు, కీర్తనలు, కథలద్వారా గ్రామీణ, పట్టణ ప్రాంతాలలో కుటుంబ నియంత్రణ ప్రచారం చేయడంజరుగుతుంది.

ప్రజలు కుటుంబ నియంత్రణ విషయాలు తెలుసుకొని, ఆచరించడానికి వీలుగా విస్తృత ప్రాతిపదికపై వారినికలుసుకుని అన్ని విధాలైన ప్రచారసాధనాలను, మార్గాలను వినియోగించి వివిధ స్వచ్ఛంద, సాంఘికసంస్థలద్వారా ప్రచారంజరపడం అవసరమని ప్రభుత్వం భావిస్తున్నది.

కుటుంబనియంత్రణ కార్యక్రమాలు స్వచ్ఛంద స్వభావం కలవి.

బాలబాలికల వివాహవయస్సును ఎక్కువచేసేదృష్టితో ప్రస్తుతం అమల్లో ఉన్న చట్టాలను సవరించాలనే ప్రతిపాదనను ఆరోగ్య, కుటుంబనియంత్రణ, పట్టణ అభివృద్ధి మంత్రిత్వ శాఖ పరిశీలిస్తున్నది.

## పరిమిత కుటుంబం

అనుదిన సంతోషణములు,
జనితశ్రమ తాప దుఃఖ సంశోషణములు
తనయుల సంభాషణములు,
జనకులకుం కర్ణయుగళ సద్భూషణముల్

తనయుల సంభాషణములు—చిన్నబిడ్డల ముద్దుపలుకులు—తల్లిదండ్రులకు యెంతటి అపారమైన ఆనందానుభూతులను కలిగించగలవో పోతనమహాకవి భాగవతంలోని ప్రహ్లాదచరిత్రములో అతి రమణీయముగా అభివర్ణించినారు. పసిబిడ్డల ముద్దుపలుకులు ప్రతిరోజు ప్రమోదాన్ని కలిగిస్తాయట; తాపాన్ని, దుఃఖాన్ని పారదోలుతాయట; అన్నిటికి మించి ఆ ముద్దు పలుకులు తల్లిదండ్రుల చెవులకు అలంకారాలుగా శోభిల్లుతాయట!

ఏదో ఒక పరిమిత కుటుంబములోని ప్రశాంతిని, ఆరోగ్యమూ, అందమూ తొణికిసలాడే పసిబిడ్డల ముద్దుపలుకులను తల్లిదండ్రుల ఆనందాన్ని దృష్టిలో ఉంచుకొని పోతనగారు యీ పద్యము వ్రాసివుంటారు. పోతన పద్యములోని యీ మధురమైన మాటలకువాస్తవిక రూపకల్పన ఒక పరిమిత కుటుంబములోనే మనకు పరిపూర్ణముగా సాక్షాత్కరిస్తుంది.

—'కుటుంబమిత్ర' నుండి

# గృహిణి

## పిలకా గణపతి శాస్త్రి

విజయలక్ష్మి అతికష్టంమీద అమ్మమ్మ చేతికందించిన మందు తాగింది. అంతేగాని మరి సమాధానమేమీ చెప్పలేదు. తిరిగి నెమ్మదిగా పరుపుమీద పడుకుని కనుగొలుకులలో నిలిచిన కన్నీటి బిందువులు రెండు కొనగోటితో తుడిచి వేసుకుని సన్నని క్షీణ స్వరంతో సణిగింది.

'ఈ మధ్యన ఎప్పుడయినా నీ దగ్గరకాని, ఆయన దగ్గరకాని ఈ గొడవ తలపెట్టానా అమ్మమ్మా! ఆయనకి నన్నంత మభ్య పెట్టవలసినంత అవసరం ఏమివచ్చిందని బాధపడుతున్నాను. అంతే! అంత నిలుచున్న పాటుగా మద్రాసు వెళ్ళవలిసివస్తే కాస్త ఒక ఉత్తరంముక్క రాసిపడవెయ్యకూడదూ? ఇన్నాళ్ళనించి సరోజతో కలిసి ఊళ్ళన్నీ బలాదూరు తిరుగుతుంటే నేనేమన్నా కాదన్నానా? ఈ మధ్యన ఎప్పుడయినా అసలామాట తలపెట్టానా?......ఇంతకీ ఒకళ్ళని అనవలసిన పని ఏమిఉంది? నేను పూర్వజన్మలో చేసుకున్న కర్మ ఇంతే!

వర్ధనమ్మ ఆమె దుస్సహదైన్యం గమనించి తిరిగి అనేక విధాల నచ్చజెప్పి ఎలాగో అలాగ మనస్సు కుదుట పరుచుకోవలసినదని బ్రతిమాలుకుంది. విజయలక్ష్మి దానికేవిధంగాను బదులు చెప్పలేదు. అసలామె అమ్మమ్మమాటలే తిన్నగా వినిపించుకోలేదు. భర్త సరోజతో కలిసి చెన్నపట్టణంలో ఏదో హోటలులో దిగి ఉండవచ్చునని అనుమానించింది. వారిద్దరు ఇక అడ్డమాకలు లేక సినీమాలకి, నాటకాలకి, పాటకచేరీలకి, గుర్రపు పందాలకు బీచికి వెడుతూ హాయిగా కాలక్షేపం చేస్తున్నట్టు కూడా ఊహించుకుంది. ఆ సంతోషంలో వారిద్దరి కేరింతాలు, వేళాకోళాలు, కిలకిల నవ్వులు మొదలయిన హావభావ చేష్టలన్నీ ప్రత్యక్షంగా చూసినట్లు భావించుకున్నది. తిరిగి అస్తమానము అవే తలుచుకుని, నుదురు చేత్తో పట్టుకుని తలనెప్పి ఎక్కువయినదని అమ్మమ్మతో చెప్పి అదేపనిగా మూలిగింది.

### జరిగినకథ

పార్థసారథికి నాటకాలపిచ్చి. రాఘవ నాట్యకళా మండలి ద్వారా నాటకాలు వేస్తుండేవాడు. నాటకాల పిచ్చిలోపడి అతను సరిగా యింటికే వచ్చేవాడుకాడు. అతని భార్య విజయలక్ష్మి ఎంతగా చెప్పినా అతను వినిపించుకోలేదు. ఒకసారి పార్థసారథి నాటకం పని మీద ఏలూరు వెళ్ళివస్తానని చెప్పి వెళ్ళి, అన్న టయిముకు రాలేదు. విజయలక్ష్మి అనుమానంతో వివరాలు సేకరించగా పార్థసారథి, నాటకంలో హీరోయిన్ వేసే అమ్మాయితో మద్రాసు వెళ్ళినట్టు తెలిసింది.

మనవరాలి పరిస్థితి పరిశీలిస్తూంటే వర్ధనమ్మ గుండె తరుక్కుపోయింది! తలనొప్పికి నుదుటిమీద శొంఠి గంధంతో దట్టంగా పట్టువేసింది. మరి కొంత సేపటికి బాగా ఉపశమించిన



తరవాత ముంగురులు సవరిస్తూ చల్లగా హితబోధ ప్రారంభించింది. ఆ మాటల సందర్భంగా ఆ పట్టణంలో పేరుమోసిన ఒక ప్లీడరు భార్య విచిత్ర గాథ ప్రస్తావించింది.

ఆమె చాలా చక్కనిది. అయితే అమాయకురాలు. సాధ్వి. నలుగు రయిదుగురు పిల్లలు కూడా కలిగిన తరువాత, యాభై ఏళ్లు పైబడిన ఆ ప్లీడరు సిటీ గరల్స్ హైస్కూలు టీచరు లీలావతితో సరసాలారంభించాడు. అయినా అతని భార్య ఆ వ్యవహారం వినీ విననట్టు మాట్లాడకూరుకుంది. మాటికి మాటికి లీలావతి వాళ్ళ ఇంటికి వస్తూ పోతూనే ఉంటుంది. అయినా ఆ ప్లీడరు భార్య, పెనిమిటిని గురించి గాని, ఆమెను గూర్చి గాని ఎన్నడు ఒక్క పల్లెత్తు మాటయినా అనలేదు! మరి కొన్నాళ్ళకా లాయరు లీలావతి కొక చక్కని జిగినీ గొలుసు చేయించాడు. ఆ వ్యవహారం అంతటితో ఆగలేదు. ఒక పెద్ద ఇల్లు కూడా కొని ఆమె పేర రాసి ఇచ్చాడు. పొద్దస్తమానము ఆ లీలావతి ఇంట్లోనే కాలక్షేపం చేస్తూంటాడు. అయినా ఆ మహా ఇల్లాలు పెదవి కదపక తన సంసారం రొష్టు కాకుండా ఎంతో గుట్టుగా కాలక్షేపం చేస్తూంది. అప్పుడప్పుడు భర్తతోను, లీలావతితోను కలిసి నాటకాలకి, సినీమాలకి కూడా వెడుతూంటుంది. ఆమెతో ఎంతో కలిసికట్టుగా పిచ్చాపాటీ మాట్లాడు తుంటుంది. ఆ విధంగా సంగ్రహంగా ఆ విషాద గాథ ముగించిన తరువాత వర్ధనమ్మ ఉసూరుమని నిట్టూర్చి మనవరాలిని తిరిగి చల్ల చల్లని మాటలతో ఓదార్చింది.

'చూడమ్మా! విజయమ్మా! ఈ ఊళ్ళో ఇంకా ఇలాంటి వాళ్ళెందరో ఉన్నారు! వాళ్ళంతా నీలాగే బాధపడి గొడవ పెడుతున్నారా? క్రమ క్రమంగా అన్నిటికి అలవాటుపడి అసలు ఏమి జరగనట్టే మాట్లాడ కూరుకుంటున్నారు. ఊరికే ఉన్నవి లేనివి అదే పనిగా తవ్వుకుని అలాగ కుమిలి కుమిలి దుఃఖిస్తూ కూర్చుంటే లాభమేమిటి చెప్పు! ఈ వేళ కాకపోతే రేపయినా అతనికి కాస్త మంచి చెడ్డలు తెలియకపోవు! మీ ఆయన ఏమీ చిన్నవాడూ, చితకవాడూ కాదుగదా! అప్పుడే ఇద్దరు పిల్లల తండ్రి. పైగా నలుగురిలోను తల ఎత్తుకుని తిరుగుతున్నవాడు. అతను మాత్రం తన బాగోగుల సంగతి ఆలోచించుకోలేడూ? అదీకాక కిట్టనివాళ్ళు 'ఇదిగో పులి అంటే అదిగో తోక!' అంటారు! అవన్నీ నిజమే అనుకుని అనుమానపడితే ఎలాగ చెప్పు! కాస్త నామాట విని ఎలాగో అలాగ సమాయించుకో తల్లీ!'

ఆ ప్రసంగం పూర్తిగా ముగియక మునుపే విజయలక్ష్మి మరింత గట్టిగా మూలుగుతూ అటు ఇటు దొర్లి వర్ధనమ్మకేసి చూసి కస్సుమని బుసకొట్టింది.

'అమ్మమ్మా! నాకు ఆ ఊళ్లో వాళ్ళ గొడవలన్నీ ఎందుకు చెబుతావు! నే నవి వినలేకుండా ఉన్నాను! ఇంతకీ ఎవళ్ళ నుదుటి మీద ఎలాగ రాసిపెట్టి ఉంటే అలాగవుతుంది! ఎవళ్ళ కర్మానికి వాళ్లు కర్తలు! బెంగ పెట్టుకుని నేనేమి అయిపోనులే! నువ్వేమి భయపడక్కరలేదు! తెలిసిందా? అయ్యో! నా కామాత్రం అదృష్టం కూడానా? ఈ జ్వరం ఇలాగే ఎక్కువయిపోయి, ఇంతటితో నా బాధలన్నీ విరగడయిపోయినా బాగుండును! కాని నేనంతటి అదృష్టవంతురాలిని కానులే! ఇంకా నా రాత ఇంతే! నువ్వు అనవసరంగా ఆ గొడవలేవి నాతో చెప్పవద్దు! తెలిసిందా? వెళ్ళి పిల్లలిద్దరిని సముదాయించుకో! వాళ్లు బొత్తిగా బెంగటిల్లి పోతున్నారులా ఉంది? వెళ్లమరి! ఎందుకలాగ నాకేసి చూస్తావు!'

ఆ దురుసు ప్రసంగం చట్టచివర పసి పిల్లలమాట తలచుకోగానే విజయలక్ష్మి గొంతు గద్గదికతో గజగజ వణికింది. తన ఓదార్పువల్ల మనవరాలి కంతటి మనోవ్యథ కలగ గలదని వర్ధనమ్మ చూచాయగా నయినా ఊహించలేదు! లేకపోతే ఆ ప్రస్తావన ఎత్తకపోయి ఉండును! అందుచేత ఆమె ఎంతో నిర్ఘాంతపడి విజయలక్ష్మికేసి చూసి తిరిగి బ్రతిమాలుకుంది.

'ఎందుకే వెర్రిదానా! అలాగ కస్సు బుస్సుమంటావు! ఇంతకి నేనేమన్నానని? కాస్త మనస్సు సంబాళించుకో మనేనా అన్నది! పోనీలే అమ్మా! నీకంత కష్టంగా ఉంటే ఇక ఆ గొడవ లేవి ఎత్తనులే. ఏమి అనుకోకమ్మా!'

ఆమె లోలోపలినించి ఉప్పొంగుతున్న డగ్గుత్తికతో మరి మాట్లాడలేక పోయింది. ఆ సమయంలో వివాహంనాటి సంగతి ప్రస్తుత పరిస్థితి తలుచుకుని వర్ధనమ్మ ఎంతో బాధపడింది. చాలా చిన్నప్పటి నించి ఆమె విజయలక్ష్మిని అనుక్షణము అల్లారు ముద్దుగా పెంచింది. పెద్ద దానిని చేసింది. ఎప్పుడూ కింద అడుగే పెట్టనీయలేదు. పెళ్ళి ఈడు వచ్చిన తరువాత తన దగ్గర ఉన్న రొఖ్ఖంలో ఆరువేల దాకా ఖర్చుపెట్టి మనవరాలి కన్నివిధాల మంచి సంబంధం తీసుకురావలసిందని అల్లుడి చెవిలో ఇల్లు కట్టుకొని వాపోయింది. మొట్టమొదట దానికి అతడంతగా ఇష్టపడక పోయినా మాటిమాటికి కాదు కూడదని బలవంత పెట్టింది.

ఆ తరవాత విజయలక్ష్మి అత్తవారింటికి వెళ్లుతున్నప్పుడు చిన్నప్పటినించి పెంచిన మమకారం ఆపుకోలేక, మనస్సులో ఇష్టం లేకపోయినా, తన అభిమానం అంతా దిగమ్రింగుకొని ఆమెతో బాటు అత్తవారింటికి వెళ్ళింది. ఆపైన ఏడాదిలో ఏ రెండు మూడు నెలలో తప్ప ఆమె ఎన్నడు తన కుమార్తె దగ్గర ఉండలేదు! ఇన్నాళ్ళనించి మనవరాలినే కనిపెట్టుకుని ఉంటూ కాలక్షేపం చేసింది. మొట్టమొదటినించి పార్థసారథి కూడా ఆమె నెంతో గౌరవించాడు. ఎల్లప్పుడు తమ ఇంట్లోనే ఉండి, పిల్లలకి, విజయలక్ష్మికి పెద్ద దిక్కులేని కొరత తీర్చవలసిందని ఎన్నోవిధాల బ్రతిమాలుకున్నాడు.

ఆ రోజుల్లో అతడు తానేమి చెప్పినా కాదనకుండా గౌరవించాడు. అటువంటి మనిషి ఈనాడు భార్యమాట లక్ష్యపెట్టడం లేదు సరిగదా, తన హితవుకూడా బొత్తిగా పాటించడంలేదు! అయినా నాలుగయిదుసార్లు లామె కొంచం వ్యంగ్యంగా 'అయిన దానికి, కానిదానికి అంత దుబారా ఖర్చుకూడదు నాయనా?' అని

మృదువుగా మందలించింది. కాస్త పసిపిల్లలు బయలుదేరుతున్న సంగతి ఆలోచించుకోవలసిందని హెచ్చరించింది. కాని ఆమాట అతడు తిన్నగా వినిపించుకున్నట్టే కనబడలేదు. అంతకన్న ఆమె ఏమి చెయ్యగలదు? కొన్నాళ్ళు గడిచిన తరవాత అతి రహస్యంగా ఆలోచన చెప్పి, మామగారిచేత అల్లుడి పేర నాలుగయిదు ఉత్తరాలుకూడా రాయించింది. అయినా పార్థసారథిలో రవంతయినా మార్పు కనబడలేదు! ఇంక ఎవరు మాత్రం చెయ్యగలిగింది ఏమి మిగిలింది? అందుచేత ఇలవేలుపు అమ్మవారిమీదే భారం అంతా మోపి కానున్నదేమో కాకమానదని గుండె రాయి చేసుకున్నది.

ఆ పైన వర్ధనమ్మ విజయలక్ష్మివైపు చూసి కొంచెం కోడి కునుకుపట్టిందని గమనించి, చప్పుడు కాకుండా లేచి, నెమ్మదిగా పసిపిల్లల దగ్గరికి వెళ్ళి నేలమీద కొంగుపరుచుకొని మేనువాల్చి విశ్రమించింపే.

## 12

స్వయంగా వచ్చి సావిత్రికిగాని, కృష్ణమూర్తికి గాని వర్ధనమ్మ చెప్పినదాకా విజయలక్ష్మికి జ్వరంవచ్చిన సంగతే తెలియ లేదు. ఇటీవల నాలుగయిదు రోజులనించి పరీక్షల పేపరుదిద్దుకోడం కోసమని కొంచెం చీకటి పడిందాకా స్కూల్లోనే ఉండి పోతున్నాడు కృష్ణమూర్తి. వర్ధనమ్మ చెప్పిన వార్త విని కొంత ఆశ్చర్యపడి అడిగాడు.

'బామ్మగారూ! ఆయనగారు ఊళ్లో లేనప్పుడు కొంచెం ముందుగానే ఈ సంగతి నాతో చెబితే, మందు, మాకు పట్టుకుని వద్దునుగా! అనవసరంగా మీ రొక్కరు శ్రమపడడం ఎందుకు? ఇంతకి విజయలక్ష్మి జ్వరం కొంచెమయినా తగ్గుముఖం పట్టిందా?'

ముసలావిడ రవంత కంగారుపడుతూ నీళ్లు నమిలింది.

ఏమో! నాయనా జ్వరం ఇన్నాళ్ళు కాస్తుందని అనుకున్నానా? మర్నాటికో మూడోనాటికో పథ్యానికి రాకపోతుందా అనుకున్నాను. ఈ మాత్రానికే అనవసరంగా నిన్ను శ్రమపెట్టడమెందుకని మాట్లాడ కూరుకున్నాను. నామట్టుకినాకు జ్వరం కొంచెం తగ్గుముఖం పడుతూనట్టే కనబడు తూంది!. కాని దాని ధోరణి చూసిన తరవాత, ఏమి తోచక ఈ మాట నీతో చెప్పి పోదామని వచ్చాను'

ఆ సంగతి విని రెండు మెతుకులు నోట్లో పెట్టుకుని వెంటనే తామిద్దరము బయలుదేరి వస్తున్నామని చెప్పి కృష్ణమూర్తి వర్ధనమ్మని వెంటనే ఇంటికి పంపించివేశాడు. ఆదరాబాదరాగా సావిత్రితో కలిసి భోజనం ముగించుకుని వీధి గుమ్మానికి తాళంవేసి భార్యతో బాటు పార్థసారథి ఇంటికి బయలుదేరాడు.

ముసలావిడ అనవసరంగా కంగారు పడుతున్నది గాని, అంత భయపడవలసిన దేమిలేకపోవచ్చునని అతడనుకున్నాడు. అప్పటికప్పుడే దాదాపుగా రాత్రి తొమ్మిది గంటలు కావచ్చింది. భార్యాభర్తలిద్దరు పార్థసారథి ఇంట్లో అడుగుపెట్టే సరికి వర్ధనమ్మ పిల్లలనిద్దరిని మనవరాలికి సమీపంలో ఉన్న మంచంమీద పడుకో బెట్టి నెమ్మదిగా బుజ్జగిస్తూ జోకొడుతున్నది. విజయలక్ష్మి వేరొక పెద్దమంచంమీద దుప్పటిముసుగు తన్నుకుని కళ్ళు మూసుకుని పడుకుంది. ఆమె కెదురుగా బల్లమీద హరికేన్‌లైటు వెలుగుతూంది. ఆ బల్లమీద ఏవేవో రంగు రంగుల మందుల సీసాలు తళతళ లాడుతున్నాయి. కృష్ణమూర్తి విజయలక్ష్మి కెదురుగా ఒక కుర్చీ మీద చతికిలపడి ఆమె ముఖం జాగ్రత్తగా పరిశీలించాడు. సావిత్రి అంతలోనే పిల్లలిద్దరిని తాను జోకొట్టగలనని ఫలహారం చేసి రావలసిందని బలవంతపెట్టి ముసలావిణ్ణి వంటఇంట్లోకి పంపించి వేసింది.

కృష్ణమూర్తి విజయలక్ష్మి పరిస్థితి పరిశీలించి చాలా ఆశ్చర్య పడ్డాడు. అంతలోనే ఆమె అంతగా కృశించి పోగలదని అతడనుకోలేదు. జ్వరం ప్రారంభించి నాలుగు రోజులు కూడా కాలేదు! అయినా ఆమె బాగా చిక్కి శల్యమయినట్టు కనబడింది. దానికేమి కారణమో తెలియలేదు. సావిత్రి, అతడు ఆమెకేమాత్రమయినా నిద్రా భంగం కలగ గలదేమోఅన్న భయంతో నిమ్మకి నీరెత్తినట్టు నిశ్శబ్దంగా కూర్చున్నారు. ఆపైన పసిపిల్ల లేచి 'అమ్మేది?' అని మారాము మొదలు పెట్టింది. కాని సావిత్రి వెంటనే ఆ పసిదానిని నెమ్మదిగా జోకొట్టింది.

ఆ అలికిడి విని విజయలక్ష్మి నెమ్మదిగా కళ్లు తెరిచి కృష్ణమూర్తిని చూసి రవ్వంత ఆశ్చర్యపడి, అతి కష్టంమీద లేచి కూర్చుని మొలకెత్తుతున్న చిరునవ్వుతో క్షీణస్వరంతో అడిగింది.

'ఎప్పుడు వచ్చావు బావా! ఇదిగో! సావిత్రి కూడా ఇక్కడే ఉన్నట్టుందే! ఎప్పుడు వచ్చింది?'

'ఇద్దరము భోజనాలు చేసి ఇప్పుడే బయలుదేరి వచ్చాము. మాకిన్నాళ్ళ నించి నీకు జ్వరం వచ్చినట్లే తెలియలేదు! ఇప్పుడు కాస్త నింపాదిగా ఉందా?'

వికసిస్తున్న చిరునవ్వుతో విజయలక్ష్మి ఒక సుదీర్ఘ నిశ్వాసం విడిచిపెట్టి మరింత క్షీణ స్వరంతో ప్రతి సమాధానం చెప్పింది.

'ఈవేళ జ్వరం కొంచెం తగినట్టే ఉందిమరి! నూరు మీద ఆరు పాయింట్లు కన్న ఎక్కువ రాలేదు! నిన్నటి కన్న, మొన్నటి కన్న కొంచెం నయమే!...అదేమిటి బావా! అలా నిర్ఘాంతపడి చూస్తున్నావు! అమ్మమ్మగాని నిన్ను అనవసరంగా కంగారు పెట్టిందా?'

'మరేం కంగారు పెట్టలేదు గాని, ఇదేమిటి విజయా! ఇంతలోనే ఇలాగ చిక్కి శల్యమయి పోయావు! కళ్లు రెండు అలాగ వాచిపోయాయేమిటి? సమయానికి అతను ఊళ్లో లేడని బెంబేలు పడి అనవసరంగా రాగాలు పెడుతూ కూర్చున్నావా?'

విజయలక్ష్మి క్షణకాలం కృష్ణమూర్తివైపు చూసింది. చీర చెంగుతో కళ్లు, చెక్కిళ్లు నెమ్మదిగా తుడుచుకుని అతికష్టం మీద లేని చిరునవ్వు తెచ్చిపెట్టు కుంది.

' అబ్బే ! రాగాలు పెట్టడం యేమిటి ? అదేం లేదే ! ఇందాకటి నించి తలనొప్పి కొంచెం ఎక్కువ అయింది. అందుచేత కళ్లు అలాగ కనిపిస్తున్నాయేమో ! అంతే ! అనవసరంగా రాగాలు పెట్టడ మెందుకు ? '

అలాగ ఏమిలేదని కొట్టి పారవేసినా ముఖవైఖరినిబట్టి ఆమె అంతరాంతరాలలో ఏదో దుస్సహ దుఃఖ వేదనతో కుమిలి పోతున్నదని కృష్ణమూర్తి క్షణంలో పసికట్టి వేశాడు.

' ఏమి లేకపోవడ మేమిటి విజయా ; ఆ మాత్రం గ్రహించ లేనను కున్నావా ? ఇంతకి ఎందు కిలాగ బాధపడు తున్నావు ? ఏమిటా బాధ ? నీకేమి లోటు వచ్చింది ? పోనీ ఒక సారి వెళ్లి డాక్టరు గారిని తీసుకురానా ?'

' అక్కర లేదులే ! ' వాడిపోతున్న చిరునవ్వుతో, అణగించి వేసుకున్న గాద్గదికతో విజయలక్ష్మి మాట్లాడలేక ముఖం కొంచెం కిందికి వంచివేసుకుంది. అంతలోనే ఒకటి రెండు కన్నీటి బిందువు లామె చెక్కిళ్లమీద తరళించాయి. కృష్ణమూర్తి కుర్చీ ఆమె మంచానికి బాగా దగ్గరగా లాక్కుని ఉట్టి పడుతున్న ఆత్మీయతతో గొంతు కొంచెం తగ్గించి బ్రతిమాలు కున్నాడు.

'అదేమిటి విజయా ! ఎందుకలాగ ఏడుస్తున్నావు ! ఇంతకి ఏమి జరిగింది ? కాస్త నాతో చెప్పకూడదా ? నేనేమన్నా పరాయి వాణ్ణా ? ఎందుకింత మధన ? ఒకవేళకడుపులో ఏదైనా బాధ గాని బాగా ఎక్కువవుతూందా ?

విజయలక్ష్మి చెక్కుచెదరని లేత చిరునవ్వుతో మరింతగా తల వంచివేసుకుంది. కృష్ణమూర్తి అదేవిధమయిన ఆర్ద్ర స్వరంతో, ఆప్యాయతతో తిరిగి తిరిగి బ్రతిమాలుకున్నాడు. ఆపైన ఇక ఆమె లోలోపలినించి ఉవ్వెత్తుగా చెలరేగుతున్న దుఃఖోద్వేగాన్ని నిగ్రహించుకోలేక రెండు చేతులతోను ముఖము కప్పుకొని పక్కమీద కూలబడి వెక్కివెక్కి ఏడవడం మొదలు పెట్టింది. ఆ ధోరణి గమనించి కృష్ణమూర్తి ఎంతో కంగారు పడ్డాడు.

'విజయా విజయా ! అదేమిటి అలాగ పడిపోయావు ! ఎందుకలాగ ఏడుస్తున్నావు ! ఏమిటి బాధ ? తలగాని తిరిగిందా ?'

పిల్లలిద్దరిని జోకొడుతున్న సావిత్రి అదే క్షణంలో ఎంతో కంగారుగా ఆమె పక్కలో కూర్చొని నుదురు, కణతలు నిమురుతూ ఇనుమడిస్తున్న ఆత్రతతో అడిగింది.

'అదేమిటి అక్కయ్యా! అలాగ పడిపోయారు ? ఎందుకలాగ కంటనీరు పెట్టుకుంటున్నారు ? ఏమి జరిగింది ? బాధగాని ఏమయినా ఎక్కువయిందా ? తలనెప్పి మళ్ళీఎక్కువయిందా ?'

విజయలక్ష్మి మరి మాట్లాడలేదు. అలాగే కుమిలి కుమిలి దుఃఖించింది. మరికొంత సేపటి కామె శోకోద్వేగం శాంతించింది. క్రమంగా తిరిగి రవంత చిరునవ్వు పెదవి మీదినించి తొంగి చూసింది.

'అబ్బ ! బాధఏమిలేదు ! అనవసరంగా కంగారుపడకండి! ఎందుచేతనోగాని మనస్సులో పెద్దగుబులు, కంగారు బయలు దేరాయి. మరి భరించలేక అలాగపడిపోయాను ! అంతే '

ఆమె గొంతులో ఉద్వేగం క్రమ క్రమంగా శాంతించింది. సావిత్రి, కృష్ణమూర్తి అప్పటికిక కంగారు పడవలసినంత అవసర మేమి లేదని గ్రహించుకున్నారు. విజయలక్ష్మి చీరచెంగుతో కళ్లు, చెక్కిళ్లు గట్టిగా ఒత్తుకుని తుడుచుకుని తిరిగి బాగా తెచ్చిపెట్టు కున్న చిరునవ్వుతో వారిద్దరికేసి చూసంది. సావిత్రి వెంటనే ఫ్లాస్కులో మిగిలిన వేన్నీళ్లలో హార్లిక్సు కలిపి ఆమె చేతి కందించింది. విజయలక్ష్మి మొట్టమొదట అక్కర లేదన్నది. కాని భార్యా భర్త లిద్దరి బలవంతంమీద రవ్వంత హార్లిక్సు గొంతులో పోసుకున్నది.

ఆమె ఆ విధంగా అకస్మాత్తుగా దుఃఖించడానికేమి కారణమో కృష్ణమూర్తి కవగాహన కాలేదు! విజయలక్ష్మి చెప్పిన కుంటిసాకు అతనికంతగా నమ్మదగినదిగా కనిపించలేదు. దానికేదో లోతయిన కారణమే ఉండి తీరాలని అనుమానించాడు. కాని ఎన్నెన్ని విధాల ఆలోచించినా అతనికేమి అంతు చిక్కలేదు. 'ఇప్పుడే వస్తాను' అని భార్యతో చెప్పి నెమ్మదిగా వంట ఇంట్లోకి వెళ్ళి, ఫలహారం ముగించి ఇంటి పనులేవో చక్కబెట్టుకుంటున్న వర్ధనమ్మ దగ్గర ఒక పీటమీద కూర్చుని మాటల సందర్భంలో విజయలక్ష్మి అకస్మాత్తుగా పరుపు మీద కూలబడి వెక్కి వెక్కి దుఃఖించిన విషయం వెల్లడించాడు.

నాలుగయిదు క్షణాల వరకు ఆవిడ తీవ్రంగా ఏదో ఆలోచిస్తూ మాట్లాడకూరుకుంది. అంతేగాని అంతగా ఆత్రత వ్యక్తీకరించలేదు. ఆ తరువాత కృష్ణమూర్తి తిరిగి ప్రశ్నించాడు.

'అదేమిటి బామ్మగారూ! విజయ ఇంతలోనే అంత చిక్కి శల్యమయి పోయిందేమిటీ?'

'ఏమో నాయనా! దాని వాలకం చూస్తే నాకేమి పాలుపోవడంలేదు? మనసులో ఏదో దిగులు పెట్టుకుని ఆనాటి కానాటికి అలాగ పూచికపుల్లలా తయారవుతూంది! ఇక అతని సంగతి చూస్తే అంతకన్న విడ్డూరంగా ఉంది! ఆవేళ సాయంత్రానికి తిరిగి వస్తానన్న పెద్ద మనిషి ఇంత వరకు ఇంటిముఖం పట్టలేదు! పిల్ల లిద్దరు 'నాన్న ఏడీ' నాన్న ఏడీ!'అంటూ బొత్తిగా బెంగటిల్లి పోతున్నారు!'

'ఇంతకి విజయ కెందుకింత దిగులు! జ్వరం కొంత తగ్గుముఖం పట్టిందిగాని హెచ్చడం లేదుగా! ఇంత మాత్రానికే బెంబేలు పడడం ఎందుకు?'

కృష్ణమూర్తి ముఖంమీద తీవ్ర జిజ్ఞాసార్ధకంగా బొమముడి విరిగింది. వర్ధనమ్మ దిగులుగా మూలిగినట్టు ఒక దీర్ఘ నిశ్వాసం విడిచి పెట్టింది.

(సశేషం)

## నారీ లోకం

# హైదరాబాదులోని సేవాగృహం

శ్రీమతి శ్రీరాజ్యం సిన్హా

హైదరాబాదులోని సేవాగృహం 1958 మే నెల మొదటివారంలో 18 మందితో ప్రారంభమైంది. ఏ విధమైన ఆధారము లేని గౌరవనీయ దీనకుటుంబాలకు చెందిన విధవలు, విధివంచితలు, భర్తృ పరిత్యక్తలు అయిన మహిళలకు ఆర్థికంగా స్వయం పోషక శక్తినీ, నైతికంగా ధైర్యాన్నీ కల్పించడానికి వీలయిన శిక్షణ యిచ్చే ఉద్దేశంతో ఈ సేవా గృహాన్ని ప్రారంభించారు. తల్లితోపాటు ఏడేళ్ళలోపు పిల్లలు యిద్దరినికూడా ఈ సేవా గృహంలో చేర్చుకుంటారు. స్త్రీ జనాభ్యుదయ శాఖ క్షేత్ర కార్య కర్తలైన సహాయ స్త్రీ జనాభ్యుదయ శాఖాధి కారులు ఈ సేవా గృహంలో చేర్చుకునే వారిని ఎంపికచేస్తారు. ఇందులో చేర్చుకొనబడేవారి వయసు 18 సంవత్సరాలకు పైబడి 30 సంవత్సరాలలోపు వుండాలి. అవసరమైన సందర్భంలో, ఉచితమని భావించినప్పుడు, వయః పరిమితిని కొద్దిగా సడలిస్తారు. అంతిమంగా అభ్యర్థినులను ఎంపికచేసే అధికారం హైదరాబాదులోని ఈ సేవాగృహం సూపరింటెండెంటుకు వుంటుంది. ఇందులో చేర్చుకోబడే వారంతా వయోజన మహిళలే. వారిని వారి యోగ్యతలనుబట్టి ఆయాతరగతులలో చేర్చుకుంటారు. సాధారణ విద్య విషయంలో యిక్కడ నాలుగవ తరగతి, ఒకటవ ఫారం, రెండవఫారం, ఇ. ఎస్. ఎల్. సి. అని నాలుగు తరగతులు వున్నాయి. అభ్యర్థిని యోగ్యతనుబట్టి ఆమెను ఆయాతరగతులలో చేర్చుకుంటారు. అయితే ఏడాది పొడుగునా అదేక్లాసులో వుండనవసరం లేదు. తగిన అర్హత సంపాదించుకోగానే వారిని ఆపై తరగతికి పంపుతారు. ఈ శిక్షణ కాలం మొత్తం మూడేళ్ళు. సేవాగృహంలోని మహిళలను ఇ. ఎస్. ఎల్. సి. పరీక్షకు సిద్ధం చేయడమే ఈ శిక్షణ ప్రధాన ఉద్దేశం. సాధారణ విద్యతోపాటు పుస్తకాల బైండింగు, టైలరింగు వంటి చేతి పనులలోకూడా శిక్షణ యిస్తారు. ఇక్కడ



ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ జనవరి 9 న గాంధీభవన్‌లో మహిళా సమావేశానికి ప్రారంభోత్సవం చేశారు

ఒక చర్మ పరిశ్రమ విభాగంకూడా వుంది. ఇది శిక్షణ-ఉత్పత్తి కేంద్రంగా పనిచేస్తున్నది. నర్సరీ విభాగంకూడా ఒకటి యిక్కడ వుంది. బృందాల వారీగా ఈ మహిళలు యీ చేతి పనుల శిక్షణ తరగతులకు హాజరవు తుంటారు. భవిష్యత్తులో ఉపాధి సంపాదించుకునే ప్రయత్నంలో యీ శిక్షణ వారికి ఎంతయినా ఉపయోగిస్తుంది. ఉదయం 10 గంటలనుండి మధ్యాహ్నం ఒంటి గంట వరకు వీరు సాధారణ విద్య తరగతులకు హాజరవుతారు. మధ్యాహ్నం నించి సాయంకాలం వరకు చేతిపనుల శిక్షణ తర

గతులకు హాజరవుతారు. టైలరింగులో సర్టిఫికెట్టు పరిక్షస్థాయి వరకు యీ మహిళలకు శిక్షణ యిచ్చి పరీక్షలకు కూర్చోబెట్టుతారు.

సాధారణ విద్య, సాంకేతిక విద్యలను పొందడంతో బాటు క్రీడలు, సంగీతం వంటి మనోల్లాస కార్య కలాపాలలోకూడా ఈ ఆశ్రయ గృహంలోని మహిళలు పాల్గొంటారు.

సమాజ కృషినికూడా యీ మహిళలు చేపట్టుడం యీ సేవాగృహం ప్రత్యేకత. ఈ సేవాగృహం పని అంతా బృదాలుగా యిందులోని మహిళలే చేస్తారు. విడిగా సేవకులు లేరు. వంట చేయడం ఊడ్చడం; రోగగ్రస్తులకు సేవజేయడం, స్టోర్సు నిర్వహణ యీ పనులన్నీ మేట్రన్ ఆజమాయిషీ క్రింద ఇందులోని మహిళలే చేస్తారు.

ఈ సేవా గృహాలలోని మహిళల నిర్వహణ ఖర్చులకుగాను ప్రభుత్వం పెద్దలకు ఒకొక్కరికి నెలకు రూ 25/- చిన్న పిల్లలకు ఒకొక్కరికి రూ 20/లు చొప్పున యిస్తుంది. పై మొత్తం లోపలే తమ ఆహారపు ఖర్చులను వారు పరిమితం చేసుకోవలసి వుంటుంది. వస్త్రాలు, బెడ్డింగు, పుస్తకాల ఖర్చు, పరీక్షఫీజులు మందులు మొదలైనవికూడా ప్రభుత్వం అందజేస్తుంది.

ఈ సేవాగృహంలో 150 మంది మహిళలు, 60 మంది చిన్న పిల్లలు వుండడానికి అనుమతించబడింది. ప్రస్తుతం యిందులో 86 మంది మహిళలు, 33 మంది చిన్న పిల్లలు వున్నారు. ఇంతవరకు ఈ సేవాగృహంలో ఆశ్రయం పొందిన వారు 602 మంది వున్నారు. వీరిలో సుమారు 336 మందికి గ్రామసేవికలుగా, వంటచేసేవారిగా (బాలగృహాలు మొదలైన వాటిలో) చేతిపనుల ఉపాధ్యాయినులుగా ఉపాధి కల్పించబడింది. షార్టుహేండ్, టైప్‌రైటింగ్‌లలో శిక్షణ, నర్స్‌ట్రెయినింగువంటివి కల్పించబడ్డాయి.

ఈ యేడాది 1968 ఏప్రెల్‌లో జరిగే ఇ.ఎస్.ఎల్.సి. పబ్లిక్ పరిక్షకు 30 మందిని పంపిస్తున్నారు. 8 మంది 1967 డిశంబరులో జరిగిన టెయిలరింగ్ పరిక్షకు కూర్చున్నారు.

ఈ సేవాగృహంలోని మహిళలకు వారివారి అభిరుచులకు అనుగుణంగా తమ భావిజీవితంలో ఉపాధికల్పించడానికి తగు శిక్షణను యిక్కడఅందజేస్తున్నారు. శిక్షణ కాలానంతరం వీరికి ఉపాధి కల్పించడానికి కూడా యీ సేవాగృహం విశేషంగా కృషి చేస్తుంది.







# బాలల సంక్షేమం

శ్రీమతి ఫూల్‌రేణు గుహా

ఏ సాంఘిక సంక్షేమ కార్యక్రమంకూడా బాలల సంక్షేమాన్ని విస్మరించలేదు. బాలల సంక్షేమంలో అన్నిటికన్న ప్రధానమైనది వారి విద్యాభ్యాసం. ఇది ముఖ్యంగా రాష్ట్రప్రభుత్వాలకు సంబంధించినది. ఎందుకంటే విద్య ఆ యా రాష్ట్ర ప్రభుత్వాలకు సంబంధించిన అంశం గనుక.

0—16 వయసు గ్రూపు పిల్లల సంక్షేమాన్ని అభివృద్ధి పరచడానికి సంబంధించిన పథకం ఒకటి వుంది. దీనిని రాష్ట్ర ప్రభుత్వాల ద్వారా జరిపిస్తారు. దీనికి నూటికి నూరు శాతం నిధులను కేంద్రం అందజేస్తుంది. ప్రస్తుతం 17 డిమాన్‌స్ట్రేషన్ ప్రాజెక్టులు పనిచేస్తున్నాయి. సుమారు 30,000 మంది పిల్లలకు వర్తించేట్టుగా సమాజాభివృద్ధి బ్లాకుల్లో ఈ డిమాన్‌స్ట్రేషన్ ప్రాజెక్టులు ఒక్కొక్కటీ పనిచేస్తున్నాయి.

తృతీయ ప్రణాళికా కాలంలో సుమారుగా యీ ప్రాజెక్టుల గురించి రూ 40 లక్షలు ఖర్చుచేయడం జరిగింది.

ఈనాడు చాలా చోట్ల బాలవాడీలు, బాలలగృహాలు నెలకొల్ప బడుతున్నాయి. పాఠశాలలకు వెళ్ళే వయసురాని చిన్నపిల్లల సంక్షేమానికి యీ బాలవాడీలు విశేషంగా తోడ్పడుతున్నాయి. ఈ మాదిరి చిన్నపిల్లల సంరక్షణ అనేది ఒక ప్రత్యేకమైన నైపుణ్యంగల పని గనుక బాలసేవికల శిక్షణకు ఒక సమగ్ర కార్యక్రమాన్ని 1961_62 లో చేపట్టారు.

గ్రామీణ ప్రాంతాలలోనూ, పట్టణ ప్రాంతాలలోనూ శిక్షణ యిచ్చే కార్యక్రమాలను స్వచ్ఛంద సంస్థలే చేపట్టాయి. తృతీయ ప్రణాళికా కాలంలో పట్టణ ప్రాంతాల నిమిత్తం 1,361 బాల సేవికలకు శిక్షణ యిచ్చారు. వీరిలో 1,129 మందికి ఉద్యోగాలు లభించాయి. 1966 డిసెంబరు 31 నాటికి 551 మంది బాలసేవికలు శిక్షణ పొందుతూవున్నారు. వీరి శిక్షణకు వెచ్చించిన సొమ్ము రూ 17 లక్షలు.

తృతీయ ప్రణాళికలో 269 మంది బాలసేవికలు దీర్ఘకాలిక శిక్షణ కోర్సులను, 189 మంది తక్కువ కాలవ్యవధి కోర్సులను పూర్తిచేశారు. తృతీయ ప్రణాళికా కాలంలో రూ. 104.97 లక్షల ఆర్థిక సహాయాన్ని వివిధ స్వచ్ఛంద సంస్థలకు అందజేశారు. ఈ స్వచ్ఛంద సంస్థలు బాలల సంక్షేమానికి కృషిచేసే సంస్థలు. ఇవి బాలల సంక్షేమానికి అనేక విధాలుగా పని చేస్తున్నాయి.

11_14 వయసు పిల్లలకు ఆర్థిక కారణాలవల్ల విద్యాభ్యాసానికి ఆటంకం ఏర్పడితే అట్టివారికి వృత్తి విద్యా శిక్షణ సౌకర్యాన్ని కల్పించేందుకు సమగ్రమైన పథకం ఒకటివుంది. ఈ పథకం 1963 లో ప్రారంభించబడింది. ఇప్పుడు యీవిధమైన శిక్షణను యిస్తున్న కేంద్రాలు 63 పనిచేస్తున్నాయి. వీటిలో సుమారు 3,000 మంది బాలలు వృత్తి విద్యలో శిక్షణ పొందుతున్నారు.

## బాలనేరస్తులు, వికలాంగులు

కేంద్ర బాలల చట్టం మార్గంలో చట్టాల్నిచేసి ఆయా రాష్ట్ర ప్రభుత్వాలే బాలనేరస్తులకు సంబంధించిన కార్యక్రమాల్ని రూపొందించుకున్నాయి. సంస్థేతర, సంస్థాగత సేవలను యివి అందజేస్తుంటాయి. సర్టిఫైడ్ పాఠశాలలు, బోర్‌స్టల్ పాఠశాలలు, రిమాండ్‌గృహాలు వంటివాటిని కూడా నెలకొల్పుతాయి. బాలనేరాలను నిరోధించడానికి తృతీయ ప్రణాళికలో రూ. 148 లక్షలు కేటాయించారు.

శారీరకంగానూ, మానసికంగానూ వైకల్యంగల పిల్లల విద్యాభివృద్ధికీ, శిక్షణకూ, పునరావాసానికీ ప్రభుత్వం తీవ్రంగా కృషి చేస్తున్నది. గ్రుడ్డి విద్యార్థుల విద్యాభ్యాసానికై డేరాడూన్‌లోని కేంద్ర బ్రైల్ ముద్రణాలయం గ్రుడ్డివారి కొరకు ఉద్దేశించిన లిపిలో సుమారు 204 పుస్తకాలను ప్రచురించింది.

తృతీయ ప్రణాళికా కాలంలో వికలాంగుల నిమిత్తం ఖర్చు చేసిన మొత్తం సుమారుగా ఒకకోటి వుంది. ప్రణాళికాబద్ధమైన ప్రాజెక్టులకుగాను సుమారు 70 లక్షల రూపాయలు వెచ్చించడం జరిగింది.

వికలాంగుల నిమిత్తం ప్రస్తుతం పనిచేస్తున్న తొమ్మిది ప్రత్యేక వికలాంగుల ఉపాధికల్పన కేంద్రాలూ యింతవరకు 40,000 మంది వికలాంగులకు ఉపాధి సౌకర్యం కల్పించాయి.

గ్రుడ్డివారికి చదువుచెప్పే ఉపాధ్యాయుల శిక్షణకై ఢిల్లీ, బొంబాయి, నరేంద్రపూర్ (పశ్చిమ బెంగాలు) లలో శిక్షణా కేంద్రాలు పనిచేస్తున్నాయి. తృతీయ ప్రణాళికా కాలంలో 1,876 మంది గ్రుడ్డివారు, వికలాంగులు అయిన విద్యార్థులకు స్కాలర్ షిప్పులు మంజూరు చేయడం జరిగింది.

## సమీకృత కార్యక్రమాలు

చతుర్థ ప్రణాళికలో కుటుంబ సంక్షేమం, బాలల సంక్షేమం ప్రధానమైన కార్యక్రమాలు. గ్రామీణ ప్రాంతంలో యీ సంక్షేమ కృషిని కేంద్రీకరించాలని ప్రభుత్వం ఉద్దేశించింది.

బాలబాలికలకు_ముఖ్యంగా పాఠశాలలకు వెళ్ళే వయసురాని బాలబాలికలకు వివిధసేవా కార్యక్రమాలను అమలుజరపడం, గృహ విజ్ఞాన కళలలో మహిళలకు, బాలికలకు శిక్షణ అందజేయడం, బిడ్డల పెంపకం, ఆరోగ్యం, శిక్షణ, పౌష్టికాహారం వంటి వాటిలో శిక్షణను అందజేయడం, గ్రామీణ మహిళలు

తీరిక వేళల్లో పనిచేసుకుని ఆర్థికంగా సుస్థిరమైన వనరులను కల్పించుకోవడానికి తోడ్పడంవంటి సహాయక కృషి యీ కార్యక్రమాల క్రింద జరుగుతుంది.

తొలిచర్యగా 1967_68 లో శిశు, కుటుంబ సంక్షేమ పథకంక్రింద 17 సమీకృత శిశు సంక్షేమ ప్రదర్శనా ప్రాజెక్టులు నెలకొల్పబడ్డాయి.

వెనుకబడిన తరగతులవారి పిల్లల సంక్షేమం, విద్య అలక్షింపబడలేదు. ప్రభుత్వం, వారి విద్యాభివృద్ధికీ, సంక్షేమానికీ తగు చర్యలు తీసుకుంటున్నది. ఆశ్రమ పాఠశాలలు (రెసిడెన్షియల్ పాఠశాలలు,) బాలవాడీలు మొదలైన వాటిని నెలకొల్పి వెనుకబడిన తరగతుల విద్యార్థులకుకూడా యితర వర్గాలవారితో సమంగా విద్యాభివృద్ధి, విజ్ఞాన వికాసాలకు అవకాశాలను ప్రభుత్వం కల్పిస్తున్నది. తృతీయ ప్రణాళికా కాలంలో వివిధ రాష్ట్రాలలో 186 ఆశ్రమ పాఠశాలలు ప్రారంభించ బడ్డాయి. 1, 13, 144 విద్యార్థులకు మధ్యాహ్న భోజన సౌకర్యం కల్పించబడింది. 4,64, 176 మంది విద్యార్థులకు పాఠ్య పుస్తకాలను, స్టేషనరీ, తదితర పరికరాలను అందజేయడం జరిగింది.

సమాజంలోని అసమానతలు తొలగింపబడితేగాని ఆరోగ్యప్రదమైన సాంఘిక జీవితం నెలకొనదు. ఈ అసమానతలను తొలగించే విషయంలో ప్రభుత్వానికి మొత్తం సమాజం యావత్తూ చేయూతనిస్తే తప్ప అదిసాధ్యంకాదు. తెలివైన సమాజం ఎప్పుడూ అందుకు పూనుకుంటుంది. 

---

యువత - నవత

# విద్యార్థుల సమస్యలు

కె. వి. నారాయణ రెడ్డి

భారతదేశ చరిత్రలో 1967 సంవత్సరాన్ని విద్యార్థుల ఆందోళనల సంవత్సరంగా పేర్కొనవచ్చు. కొన్ని సందర్భాలలో యీ ఆందోళనలు అతి తీవ్రస్థాయికి చేరుకొని వ్యధను కలిగించాయి. గత సంవత్సర కాలంలో పత్రికలు విద్యార్థుల సమ్మెలు, తగాదాలు, ప్రదర్శనలు ప్రకటించని వారం ఒకటికూడలేదు. విద్యార్థుల యీ "ఉద్యమానికి" సాంఘిక బాధ్యత తెలిసిన పరిణతి చెందిన నాయకత్వం లోపించింది. విద్యార్థులు తాము ఎదుర్కొంటున్న వాస్తవమైన సమస్య లేమిటో వారిలో చాలామందికి తెలియకపోవడం విచారకరమైన విషయం. భారతీయ విద్యా విధానాల లోగల లోపాలనుగూర్చి వారు ఆలోచించడంలేదు. జాతీయ విద్యార్థి సంఘాన్ని ఏర్పాటుచేసేకృషి యింతవరకు ఫలించలేదు. పోటీ సంఘాల విమర్శలు, పరస్పర నిందారోపణలు మాత్రం జరుగుతున్నాయి. విద్యార్థుల యిబ్బందులనుగూర్చి వ్యక్తిగత ఆందోళనయేమైనప్పటికీ వివిధ సమయాలలో వివిధ దేశాలలో విద్యార్థిశక్తిని రాజకీయ ప్రయోజనాలకు వినియోగించడంవల్ల కలిగే ప్రయోజనం యేమి కానరాలేదు.

దేశంలో విద్యార్థుల అశాంతికి కారణాలను కూలంకషంగా పరిశీలించకపోవడం ఆశ్చర్య కరమైన విషయం. నివారించాల్సిన క్రమశిక్షణా రాహిత్యం, అక్రమ ప్రవర్తనలు, సానుభూతితో పరిష్కరించాల్సిన విద్యాసౌకర్యాలు, అవకాశాల సమస్యలమధ్య విచక్షణ చూపడం జరగడంలేదు. విద్యాసంస్థలు విద్యార్థులను వేర్పాటు దృష్టితో చూస్తున్నాయనే భావన విద్యార్థులలో ప్రబలిందనడంలో సందేహంలేదు. విద్యార్థులలో అశాంతికి కారణాలలో యిది ఒకటనీ, ఇదే ఆందోళన, ప్రభుత్వ వ్యతిరేక ధోరణిగా బహిర్గత మవుతున్నదనీ నేను భావిస్తున్నాను.

విద్యార్థుల లోకంలో అశాంతికి కారణాలను కూలంకషంగా పరిశీలన జరిపినప్పుడు అది విద్యేతర విషయాలను పరిశీలించడమే అవుతుంది. అయితే ప్రస్తుతవ్యాసం లక్ష్యం అదికాదు. అందువల్ల విద్యా విషయక దృష్టితోనే యీ అంశాన్నిగూర్చి పేర్కొంటాను.

ఇంతవరకు విద్యా విషయక కమీషనులు, సమావేశాలు, గోష్ఠులు కేవలం విద్యా విషయాలు, వాటికి సంబంధించిన చర్యలను, పాఠ్య విషయాలను గూర్చిమాత్రమే చర్చించాయిగాని విద్యార్థుల వాస్తవిక అవసరాలనుగూర్చి చర్చించకపోవడం ఆశ్చర్యకరం. భారతీయ కళాశాలలు, పాఠశాలలలో తక్కువ ప్రమాణాలనుగూర్చి నిరసిస్తూనే విద్యార్థుల మేధాశక్తిని గరిష్ఠ ప్రమాణంలో అభివృద్ధి చేయడానికి ఎట్టి ప్రయత్నం చేయలేదు. విద్యార్థుల స్వంత వనరులను పరిసర పరిస్థితులను పూర్తిగా వినియోగించుకునే విధంగా సహాయపడే బాధ్యతను భారతదేశంలోని ఏ కళాశాలగాని పాఠశాలగాని తీసుకోలేదని చెప్పవచ్చు. వివిధ క్లబ్బులు, సంఘాలు యూనియనులు విద్యార్థులకు తగిన పరిస్థితులను కల్పించడానికి తాత్కాలికమైన కృషిని జరుపుతూ అర్ధమనస్కంగానే సహాయపడినా యనడంలో సందేహంలేదు. అయితే విద్యార్థులకు

సంబంధించిన కొన్ని ముఖ్యమైన అవసరాలను తీర్చడంలో అవి వని నిస్సహాయమైన అంగీకరించాలి.

"యువకులలో నిక్షిప్తంగా ఉండి సాధారణ విశ్వ విద్యాలయ కార్యక్రమాలద్వారా పూర్తిగా వినియోగంలోకి రాకుండా ఉప్పొంగుతున్న సృజనాత్మకమైన, నిర్మాణాత్మకమైన శక్తియుక్తులకు" గుర్తింపుగా యిటీవలి కాలంలో జాతీయ, ప్రాంతీయ స్థాయిలలో యువజన ఉత్సవాలను నిర్వహించారు. అయితే కళాత్మక శక్తిఉన్న ఏదో కొందరు విద్యార్థులకు మాత్రమే యీ ఉత్సవాలు అవకాశం కల్పించినట్లు వెల్లడి అవుతుంది. యువజన ఉత్సవాల ప్రాముఖ్యతను గుర్తిస్తూ ప్రతి విద్యార్థి లక్ష్య పరిశీలన, ప్రణాళిక స్వయం నిర్ణయం, తన అభివృద్ధికి సంబంధించిన సమస్యల పరిశీలన, తదవృత్తి, విద్యా కార్యక్రమాల అవసరాలను గుర్తించి తగిన పరిస్థితులను రూపొందించుకోవడానికి అవసరమైన వాతావరణాన్ని విద్యా సంస్థలు కల్పించాలి. ముఖ్యమైన యీ అంశానికి సంబంధించిన విద్యార్థి కౌన్సిళ్లు, విద్యార్థి సర్వీసులను ప్రవేశ పెట్టాలని నేను సూచిస్తున్నాను. దీని ఫలితంగా కొన్ని భారతీయ కళాశాలలు ఎదుర్కొనే క్లిష్ట సమస్యలు పరిష్కరించబడే అవకాశం ఉంటుంది.

కొన్ని విద్యా సంస్థలలో విద్యార్థుల సర్వీసులు, విద్యార్థుల కౌన్సిళ్ల ఏర్పాటు చేయడానికి చెదురు మదురుగా ప్రయత్నాలు జరిగినప్పటికీ అమెరికాలో జరిగిన మాదిరిగా, అత్యవసరంగా కావలసిన ప్రతి విద్యార్థికి సలహా అందజేసే విద్యార్థి కౌన్సిళ్లు విద్యార్థుల సర్వీసులను విస్తృత ప్రాతిపదికపై ఏర్పాటు చేయడం జరగడంలేదు. మన విద్యా వ్యవస్థను పునర్నిర్మించడంలో వాటి ప్రాముఖ్యతను, ఉపయోగాన్ని గుర్తించినప్పుడు, విద్యార్థులకు ఉపయుక్తమయ్యేవిధంగా రూపొందించి వాటిని ఏర్పాటుచేయాలి.

పాఠ్య ప్రణాళికను తగ్గించే విషయంలోను, విద్యార్థుల అసంతృప్తికి కారణమైన పరీక్షలు, ఉన్నతాధికారులపై చర్యలను తీసుకునే విషయంలోను విద్యార్థుల కోరికలను తక్షణం తీర్చక పోవడంతో విద్యార్థుల ఆందోళన బయలు దేరడం విచారించదగినదే అయినా, వా సహజమైన విషయంగా పేర్కొనవచ్చు. విద్యార్థుల న్యాయమైన కోర్కెలను తీర్చక పోవడంగాని, అధికారులు వారి బాధ్యతలను నిర్వర్తించడంలో విఫలులైనప్పుడుగాని విద్యార్థులు ఆందోళన చేయక తప్పని పరిస్థితి ఏర్పడుతున్నదనడంలో సందేహంలేదు. అయితే విద్యార్థులు నిర్వహించే నిరసన సమావేశాలు, ప్రదర్శనలలో ఎక్కువభాగం వారి ఆదర్శాలకు అనుగుణంగా జరగడంలేదు. ప్రస్తుత పరిస్థితులను మార్చడానికి జరిగేకృషిని ఖండించడానికి విద్యార్థులకు అన్నివిధాల హక్కు ఉన్నది. భవిష్యత్తులో దేశనాయకులుగా రూపొందనున్నవారు తమ అభిప్రాయాలను, ఆందోళనను వ్యక్తంచేయాల్సి ఉంటుంది. అయితే ప్రతి సందర్భంలో తమ మాటమాత్రమే నెగ్గాలనే తత్వంతో తమ అమూల్య శక్తియుక్తులను, కాలాన్ని వ్యర్థం చేయడం కూడదు. ప్రస్తుతం విద్యార్థులలో రేకెత్తిన అశాంతి త్వరలోనే సద్దుమణుగుతుందనడంలో నాకేమాత్రం సందేహం లేదు. ఎందుకంటే ఇతర దేశాలలో మాదిరిగానే మనదేశంలోని విద్యార్థులుకూడ దేశ నిర్మాణ కృషికి అంకితమై ఉన్నారు. ★

---

*కార్మిక కల్యాణం*

# కార్మిక సౌభాగ్యానికి కృషి

కార్మికుల, స్థితిగతులను, సమాజంలోని యితర బీదవర్గాల స్థితిగతులను అభివృద్ధి పరచడానికి ప్రశాంతమైన పద్ధతులను అనుసరించి సమాజంలో బృహత్తరమైన మార్పును తెచ్చేందుకు ప్రభుత్వం పూనుకున్నదని జనవరి 11న హైదరాబాదులో ప్రధాన మంత్రి అన్నారు.

సనత్‌నగర్‌లో ఏర్పాటు చేసిన బ్రహ్మాండమైన కార్మికుల ఊరేగింపులో ప్రసంగిస్తూ వ్యవసాయ, పారిశ్రామిక రంగాలలో ఉత్పత్తి పెరిగితేనే ధరలు తగ్గుముఖం పట్టగలవని ప్రధాని తెలియజేశారు. దేశ శ్రేయస్సుకూ, కార్మిక కళ్యాణానికీ అంతరాయాన్ని కలిగించే సమ్మెలు, ఘెరావోలు తలపెట్టవద్దనీ, శ్రమించి పనిచేయవలసిందనీ ప్రధాని, కార్మికులకు విజ్ఞప్తి చేశారు.



ఈ ఊరేగింపులో అనేకమంది స్త్రీలు కూడా పాల్గొన్నారు కొందరు స్త్రీలు తమ బిడ్డలను ఎత్తుకొని ఈ ఊరేగింపులో పాల్గొని ప్రధాని సందేశాన్ని విన్నారు.

తమ ప్రసంగంలో ప్రధాని సమ్మెలు, ఘెరావోల గూర్చి ప్రభుత్వానికి కార్మికులకు మధ్యవుండ వలసిన సంబంధాలను గూర్చి ఆంధ్రప్రదేశ్ ప్రగతిని గూర్చి మాట్లాడారు.

ఈనాటి సమాజంలో_ ముఖ్యంగా శాస్త్రీయ, సాంకేతిక రంగాలలో విప్లవాత్మకమైన మార్పులు వచ్చిన యీనాటి రోజుల్లో_ కార్మికులు చాలా ప్రధానమైన పాత్ర వహిస్తారని ప్రధాని అన్నారు. "పరిశ్రమల్ని పనిచేయించేది కార్మికులే. దేశం అభివృద్ధి సాధించడం అనేది తేలికైన పనేమీకాదు. ఎంతమంది ప్రజలు వున్నారో అన్ని సమస్యలు మనకు వున్నాయని వెనకటికి జవహర్లాల్ నెహ్రూజీ ఒకసారి అన్నారు. భారత దేశపు సమస్యలు అనేకం వున్నాయి. ఒకదానితో ఒకటి ముడిపడి ముళ్ళకంపలా ఒకదానితో ఒకటి పెనవేసుకుపోయి వున్నాయి. వీటన్నిటినీ ఒక్కసారిగా పరిష్కరించేందుకు మన దగ్గర మంత్రదండం ఏమీ లేదుకదా".

పరిశ్రమల యాజమాన్యంలోనూ, కార్మికులకు మరిన్ని సౌకర్యాలను కల్గించే విషయంలోనూ కార్మికులు ఎక్కువగా పాల్గొనాలని ప్రభుత్వం భావిస్తున్నదని ప్రధాని తెలియజేశారు.

కార్మిక సమస్యల పరిష్కారంలో ప్రభుత్వానికీ, కార్మికులకూ సన్నిహితమైన అవగాహన అవసరమనీ; ప్రభుత్వ సమస్యలను కార్మికులు, కార్మికుల సమస్యలను ప్రభుత్వం పరస్పరం అవగాహన చేసుకోవాలనీ ప్రధాని అన్నారు.

తమ అభివృద్ధికి యితర దేశాల వనరులను వినియోగించుకునే పాశ్చాత్య దేశాలకూ, భారత దేశానికీ ఎంతో భేదం వున్నదని ప్రధాని అన్నారు. "భారతదేశం తన కాళ్ళమీద తాను నిలబడవలసివుంది. భారతదేశంలో జనాభా చాలా ఎక్కువ. ఎక్కువ జనం వ్యవసాయంమీద ఆధారపడి వున్నారు. వెనుకబడిన తనం, పేదతనం యీ దేశాన్ని పీల్చి పిప్పిచేస్తున్నది. విశేషించి కృషిచేసి వీటిని మనం పారద్రోలాలి."

ఆంధ్రప్రదేశ్ శీఘ్రగతిని పురోగమిస్తున్నదని, ముందు ముందు మరింత వేగంగా పురోగతిని సాధించగలదని తాను విశ్వసిస్తున్నానని ప్రధాని తమ ఆశాభావాన్ని వ్యక్తం చేశారు. దేశంలోంచి పేదతనాన్ని పారద్రోలి సుందరమైన ఐశ్వర్య విలసితమైన వాతావరణాన్ని మన చుట్టూ నిర్మించుకుందాం అన్నారు ఆమె.

కార్మికులు అల్లరి దృక్పథాన్ని విడనాడి, వుత్పత్తిని పెంచేందుకు ప్రశాంత వాతావరణంలో విశేష కృషితో పరిశ్రమించాలని ముఖ్యమంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి తమ ఉపన్యాసంలో పేర్కొన్నారు.



*గిరిజన సంక్షేమం*

# ఆంధ్రప్రదేశ్ గిరిజన మహాసభ

మహారాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ వి. పి. నాయక్ జనవరి 10వతేదీన హైద్రాబాదులో ఆంధ్రప్రదేశ్ గిరిజన మహాసభను ప్రారంభించారు. శ్రీ నాయక్ మొదట కొద్దిసేపు గిరిజనభాష బంజారాలో మాట్లాడి తరువాత ఇంగ్లీషులో ప్రసంగించారు. గిరిజన శాసన సభ్యులు, సమితి అధ్యక్షులు, గిరిజన ప్రతినిధులతో కూడిన సభాసదులు శ్రీ నాయక్ ఉపన్యసించిన సమయంలో పదే పదే దీర్ఘంగా హర్షధ్వానాలుచేశారు. గిరిజనులు కష్టించిపనిచేసి ప్రస్తుతం లభిస్తున్న సదుపాయాలను సంపూర్ణంగానూ, సక్రమంగానూ వినియోగించుకోవాలని శ్రీనాయక్ ఉద్బోధించారు. ఇతోధికంగా నిధులు లభింపజేయాలని ఆందోళనచేయడం కంటే కేటాయించిన నిధులను సరిగ్గా ఉపయోగించుకోవడం ప్రధానం అని ఆయన చెప్పారు. గిరిజనులకు, హరిజనులకు, వెనుకబడిన తరగతులకు సంబంధించిన పథకాలు వందల సంఖ్యలో అమలుజరుగు తున్నాయని ఆయన అన్నారు.

కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ ఎస్. నిజలింగప్ప మాట్లాడుతూ గిరిజనులయొక్క, సమాజంలోని అన్ని వెనుకబడిన వర్గాల యొక్క ఉద్ధరణ జరిగే పర్యంతం దేశం నిజమైన అభివృద్ధి సాధించలేదని అన్నారు.

దేశంలో మూడుకోట్లమంది గిరిజనులువున్నారనీ, వారి సముద్ధరణకై అనేక సంక్షేమ పథకాలు అమలు జరుగుతున్నాయనీ కేంద్రసాంఘిక సంక్షేమ శాఖామంత్రి శ్రీఅశోక్ మెహతా అన్నారు. ఈ పథకాల ఆచరణలో గల లోపాలను సరిచేయడం జరుగుతుందని ఆయన చెప్పారు.

కేంద్ర సాంఘిక సంక్షేమశాఖ సహాయ మంత్రి శ్రీమతి ఫూల్‌రేణుగుహా మాట్లాడుతూ, గిరిజనుల సముద్ధరణార్థం ప్రభుత్వం తీసుకుంటున్న చర్యలు వారికి ప్రయోజనం చేకూర్చలేదనడం యథార్థంకాదని చెప్పారు. గిరిజనులలో అక్షరాస్యుల సంఖ్య 1931 లో 0.7 శాతం కాగా 1961 సంవత్సరం నాటికి 8.54% కు పెరిగిందని ఆమె అన్నారు.

కేంద్ర సాంఘిక సంక్షేమశాఖ ఉపమంత్రి శ్రీ జె. బి. ముత్యాలరావు ప్రసంగిస్తూ ఆంధ్రప్రాంతంలో గిరిజనులుగా పరిగణించబడుతున్న ఎరుకలు, యానాదులు సుగాలీలు తెలంగాణా ప్రాంతంలోకూడా త్వరలో గిరిజనులుగా పరిగణించ బడగలరని అన్నారు.

రాష్ట్ర సాంఘిక సంక్షేమశాఖ మంత్రి శ్రీ అరిగె రామస్వామి

ఉపన్యసిస్తూ ముఖ్యమంత్రికి గిరిజనులపట్ల గాఢసానుభూతి కలదని అన్నారు.

మహాసభకు అధ్యక్షత వహించిన రాష్ట్ర వ్యవసాయశాఖా మంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి మాట్లాడుతూ, అటవీప్రాంతాలలోని సేద్యయోగ్యమైన బంజరుభూములను గిరిజనులకు ఇవ్వడానికి ప్రభుత్వం నిశ్చయించిందని చెప్పారు.

## ఆదిలాబాదు జిల్లాలో కేటాయింపులు

ఆదిలాబాదు జిల్లా పరిషత్తుకు చెందిన సాంఘిక సంక్షేమం, ఆర్థిక వ్యవహారాల స్థాయీ సంఘాల సమావేశాలు కలెక్టరు శ్రీ కె. రంగారావు అధ్యక్షతన ఇటీవల ఆదిలాబాదులో జరిగాయి. ఈ సందర్భంలో డినోటిఫైచేసిన తెగల నిమిత్తం ఒక మంచి నీటి బావి నిర్మించడానికి ఆసిఫాబాదు పంచాయతీ సమితికి రూ. 2000/-లు, బోథ్ పంచాయతీ సమితికి చెందిన నరిగొండలో హరిజనుల నిమిత్తం ఒక మంచినీటి బావి నిర్మించడానికి రూ. 2,100 లు కేటాయించారు.

ఆర్థిక విషయాల సంఘం 15 నిమ్న జాతుల హాస్టళ్ళకు రూ. 83,200 5 వెనుక బడిన తరగతుల హాస్టళ్ళకు రూ. 49,500లు కేటాయించింది. ఇవి ఆదిలాబాదు, నిర్మల్, బోథ్ మథోల్, భీమారంలో వున్నాయి.

ఆదిలాబాదు, ఉట్నూరు బోథ్‌లలోని మూడు గిరిజన బాలుర హాస్టళ్ళు, ఉట్నూరులోని ఒక గిరిజన బాలికల హాస్టలు కొరకు రూ. 45, 258 లు, మూడు ఆశ్రమ పాఠశాలల కొరకు రూ. 27,534 లను కూడా ఈ సంఘం ప్రత్యేకించింది.

గిరిజనుల పిల్లలు చదువుకునే 71 ప్రాథమిక పాఠశాలలు, డినోటిఫైచేసిన తెగల పిల్లలు చదువుకునే 9 పాఠశాలలకు రూ. 1,15,264 లు కేటాయించారు.

ఆర్థికంగా వెనుకబడిన తరగతులకు 185 స్కాలర్‌షిప్పులు ఇవ్వడానికి రూ.13,000 లు నిమ్నజాతులకు 455 స్కాలర్‌షిప్పులు ఇవ్వడానికి రూ 32,000లు, పుస్తకాలు కొనడానికి రూ.3,260లు. హరిజనులుగా మతం మారినవారికి 56 స్కాలర్‌షిప్పులు ఇవ్వడానికి రూ.1,500లు, నిమ్నతెగలకు 1,247 స్కాలర్‌షిప్పులు ఇవ్వడానికి రూ.26,000లు మంజూరు చేశారు.

### లంబాడీలు

"హైదరాబాదు గాంధీభవన్‌లో ఇటీవల ప్రధానమంత్రికి ఒక లంబాడీ స్త్రీ వినతి పత్రం సమర్పించింది. లంబాడీలు కష్టజీవులు. ఆంధ్రప్రదేశ్‌లో నాగార్జునసాగర్ ఆనకట్ట నిర్మాణంలోనూ, కాలువల త్రవ్వకంలోనూ వీరు గణనీయమైన పాత్రవహించారు. లంబాడీ శ్రామికులు ముఖ్యంగా స్త్రీలు ఈ పనులలో పూర్తిగా మనస్సుపెట్టి ఓపికతో కఠినంగా కాయ కష్టంచేయడాన్నిచూసిన వారెవ్వరూ ప్రభావితులు కాకుండాపోరు.

బ్రహ్మాండమైన నాగార్జున సాగర్ ప్రాజెక్టు నిర్మాణంలో లంబాడీ మహిళలు నిర్వహించిన అద్భుతమైన పాత్రకు చిహ్న ప్రాయంగా ఆనకట్ట సమీపంలో లంబాడీవనిత ప్రతిమను నెలకొల్పడం ఆంధ్ర ప్రభుత్వం ఔదార్యాన్ని ప్రదర్శిస్తున్నది. నాగార్జున సాగర్ ప్రాజెక్టు క్రింద సేద్యయోగ్యంచేయబడే భూములను లంబాడీలకు కేటాయించి వారు వ్యవసాయవృత్తిలో స్థిరపడడానికి అవకాశాలు కల్పించడం సముచితం. తెలంగాణా జిల్లాలలో ఈ విధంగా ఆవాసం కల్పించడానికి భూములు చాలా వున్నాయి"

—"ఇండియన్ ఎక్స్‌ప్రెస్"

*అల్పసంఖ్యాకవర్గాలు*

# నగరంలో కన్నడిగులు

హైదరాబాదు నగరంలోని కన్నడ సాహిత్య మందిర్ సభ్యులు, జనవరి 12 వ తేదీన కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ ఎస్. నిజలింగప్ప గౌరవార్థం స్వాగత సభ జరిపారు. ఆ సందర్భంలో ప్రసంగిస్తూ శ్రీ నిజలింగప్ప, ఈ మందిర్‌కు మైసూరు ప్రభుత్వం రూ. 50,000 లు విరాళంగా ఇస్తుందని ప్రకటించారు. ప్రజల మనస్సులలోనుంచి భాషా దురభిమానం తొలగిపోయేవరకు దేశం అభివృద్ధిజెందదని ఆయన అన్నారు. విభిన్న భాషలు మాట్లాడే ప్రజలమధ్య సుహృద్భావ సంబంధాలు, భావ సమైక్యత పెంపొందనిదే ప్రగతి సాధ్యంకాదని ఆయన చెప్పారు. శ్రీ నిజలింగప్ప, విశాల హైదరాబాదు పౌరులకు జోహార్లర్పిస్తూ, భాషా సామరస్యానికీ, విభిన్న సంస్కృతుల సమ్మేళనానికీ ఈ నగరం అద్వితీయమైన, ఆదర్శప్రాయమైన దృష్టాంతమని అన్నారు. స్థానిక ప్రజలతో కలిసి మెలిసి సఖ్యతతో జీవించవలసిందిగా ఆయన ఇచ్చటి కన్నడిగులను ఉద్బోధించారు. ప్రజలలో మత సామరస్యాన్ని పెంపొందించడానికి కన్నడ సాహిత్య మందిర్ జరుపుతున్న కృషిని శ్రీ నిజలింగప్ప కొనియాడారు.

ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి అధ్యక్షత వహించారు. అల్పసంఖ్యాక భాషా వర్గాలవారికీ, మతాలవారికీ ఆంధ్రప్రదేశ్‌లో సమానావకాశాలు కల్పించబడుతున్నాయని ఆయన అన్నారు.

## భారతీయ ముస్లిముల ప్రగతిపట్ల రాజు హసన్ హర్షం

భారతీయ మహమ్మదీయులు సాధిస్తున్న అభివృద్ధి పట్ల, భారత దేశంలో ఇస్లాం మతం చెందుతున్న పరిణామం పట్ల రాజు

...సన్ తమ హర్షం ప్రకటించారు. రంబత్‌లో జరిగిన ఒక స్వాగత సభలో ఖురాన్ 14 వ శతాబ్ద్యుత్సవాలను ముగింపజేస్తూ ఆయన ఈ అభిప్రాయం వెలిబుచ్చారు.

భారత రాయబారి శ్రీ మహరాజ్ కృష్ణ రస్గొత్రా, పదమూడు దేశాలకుచెందిన మత పండితులు, రాయబారుల సమక్షంలో "ఖౌమీ ఆవాజ్" సంపాదకుడూ, పార్లమెంటు సభ్యుడూ అయిన శ్రీ హయాతుల్లా అన్సారీలతో రాజు హసన్ లాంఛన ప్రాయంగా సంభాషించారు. "దేశాల విశిష్ఠతనూ, ప్రజల విశిష్ఠతనూ వారి లక్ష్యాలు, చర్యలనుబట్టి నిర్ధారించాలి. భారతదేశపు దృక్పథం, చర్యలు, విధానాలు ప్రశంసనీయమైనవి. ఈ దేశం నుంచి మేము ఎంతో ఆశిస్తున్నాము" అని ఆయన అన్నారు.

ఆయన శ్రీ అన్సారీకి ప్రతిభావంతులైన మేధావులకు ఇచ్చే పతకాన్ని సమర్పించారు. ఇండియా మొరాకోల మధ్య మైత్రి వర్థిల్లుతున్నదని శ్రీ అన్సారీ అన్నారు.

## ఖురాన్ పఠనంలో ఇండియాకు అయిదవ స్థానం

కౌలాలంపూర్‌లో ఇటీవల జరిగిన అంతర్జాతీయ ఖురాన్ పఠనం పోటీలో భారత ప్రతినిధి అయిదవ స్థానం పొందారు. మలయేషియాకు ప్రథమ స్థానం లభించగా పాకిస్తాన్‌కు ఏడవ స్థానం వచ్చింది.

ఈ పోటీలో సుమారు 18 దేశాలు పాల్గొన్నాయి.

యు.ఏ.ఆర్, సౌదీ అరేబియా, ఇండోనీషియా, ఫిలిప్పైన్స్, సింగపూర్, థాయిలాండ్, మలయేషియా సభ్యులు న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించారు. ఈ అన్ని దేశాల ప్రతినిధులు పోటీలో పాల్గొనగా సూడాన్ ప్రభుత్వం ఒక పరిశీలకుని పంపించింది. మొత్తం 64 మంది పోటీలో పాల్గొన్నారు

మౌలానా దీన్ మహమ్మద్, ఖతీబ్ మెహరి, మూర్వి ఫాజిల్, (పంజాబు విశ్వ విద్యాలయం) ఫాజిల్ జమోబెద్, భారత దేశానికి ప్రాతినిధ్యం వహించారు. ఈయన అప్లియాత్‌లో నిపుణుడు. అరబ్బీలో మంచి వాగ్దాటిగల పండితుడు. అఖిల-భారత పోటీలో ఈయన ఎన్నుకొనబడినారు



## సమాధాన వేదిక

*బి. శేషగిరిరావు, కొత్తగూడెం, హైద్రాబాదుజిల్లా.*

ప్రశ్న-9 : వజ్రాలు మొదలైన విలువైన రాళ్ళనుగూర్చి మాట్లాడుతున్నప్పుడు వాటి బరువును కేరట్లలో ఉదహరిస్తూ వుంటారు. కేరట్లంటే ఏమిటి ?

జవాబు : ఒక కేరటు అంటే 200 మిల్లీగ్రాములన్నమాట.

*వి. సాంబశివరావు, గుండాడు, కరీంనగర్ జిల్లా*

ప్ర-10 : కొన్ని వేపచెట్లు క్రమంగా ఆకులు మొదలుకొని బోదె వరకు ఎండిపోతున్నాయి. నివారణోపాయంసూచించండి?

జవాబు : వేపచెట్ల విషయంలో మీరు పేర్కొన్న వ్యాధిలక్షణాలు "డైబ్యాక్" ను పోలి వున్నట్లు కనిపిస్తున్నది. నిమ్మజాతి చెట్లలోకూడా ఇటువంటి లక్షణాలు కానవస్తాయి. నేలలో చాలా తక్కువ లోతులోనే గట్టి పొరవున్నటువంటి భూములలోకానీ, నీరు పోవడానికి సరిఅయిన పరిస్థితులు లేని సందర్భాలలో కానీ ఈ వ్యాధిలక్షణాలు పొడసూపుతాయి.

అటువంటి చెట్లను పరీక్షించే నిమిత్తం మీకు దగ్గరలో వున్న వ్యవసాయ శాఖాధికారిని సంప్రదించండి. భూమి, పైన పేర్కొన్నవిధంగా అననుకూలంగాలేని సందర్భంలో ఎండిపోయిన చెట్టు ముక్కలను రాజేంద్రనగర్‌లోని ప్రభుత్వ ప్లాంట్ పాథాలజిస్టుకు పంపించండి. ఆయన దానిని పరీక్షించి తగు నివారణ చర్యలు సూచిస్తారు.

*వి. బైరాగిరాజు, రాకోడు, విజయనగరం*

ప్ర-11 : ఎటువంటి పరిస్థితులలో భూమిలో ప్రకంపనాలు సంభవిస్తుంటాయి ?

జవాబు : భూగర్భంలో కలిగే ఒత్తిడుల కారణంగా ప్రకంపనాలు సంభవిస్తుంటాయి. ఈ ఒత్తిడుల మూలంగానే ఆ పరిసర ప్రాంతాలలో తరుచుగా పెద్ద ప్రకంపనాలు కలుగుతుంటాయి. శబ్దాలు భూకంపం సంభవించేటంత ఉధృతంగా రాకపోవచ్చు.

*బి. ఆర్. ప్రసాద్, నెల్లూరు*

ప్ర-12 : ఆంధ్రప్రదేశ్‌లో మత్స్యశాఖ జరిపిన కృషిని గురించి వివరిస్తారా ?

జవాబు : సముద్రతీరంలోనూ, చెరువులు మొదలైన భూప్రాంతంలోని వనరులలోనూ మత్స్య సంపదను పెంపొందించడానికీ, పరిపోషించడానికీ మత్స్యశాఖ వివిధ చర్యలు తీసుకుంటుంది. చేపలవేట, మార్కెటింగ్ పద్ధతులను అభివృద్ధి పరచడానికై మత్స్యశాఖ జాలరులకు సహాయం కూడా చేస్తుంది.

*టి. చెంచురామయ్య, వాల్తేరు*

ప్ర-13 : సామ్యవాద సరళి సమాజం అంటే ఏమిటి ? ఇట్టి సమాజంలో ప్రైవేటు రంగం పాత్ర ఏమిటి ?

జవాబు : సామ్యవాద సరళి సమాజం అంటే, సమానావకాశాలు, సాంఘికన్యాయం, పనిచేసే హక్కు, జీవనయోగ్యమైన వేతనం పొందే హక్కుల ప్రాతిపదికపైన ఏర్పడిన సాంఘిక వ్యవస్థ అన్నమాట.

ఉత్పత్తి రంగాలలో ప్రైవేటురంగం చొరవ తీసుకొనవలసి వుంటుంది. కాబట్టి ఇటువంటి సమాజంలో ఈ రంగం ప్రముఖపాత్ర వహిస్తుంది.

*వి. మల్లేశ్వరరావు, శ్రీకాకుళం*

ప్ర_14 : గులాబీ మొక్కకు ఉపయోగించవలసిన ఎరువు ఏది ?

జవాబు : గులాబీ మొక్కలకు ఈ దిగువ విధంగా ఎరువు వేయవచ్చు.

మిశ్రమం : బాగా కుళ్ళిన ఎరువు ... ఆరు భాగాలు

| | |
|---|---|
| ఆకు ఎరువు | ... మూడు భాగాలు |
| ఇసుక | ... రెండు భాగాలు |
| ఎర్రమన్ను | ... నాలుగు భాగాలు |
| తోటమన్ను | ... రెండు భాగాలు |

*వి. గంగయ్య, లింగంపేట, నిజామాబాదుజిల్లా*

ప్ర_15 : మా తోటలలో మిరపచెట్లకు రోగాలు తగులుతున్నాయి. దయచేసి నివారణోపాయం సూచించండి ?

జవాబు : మీ మిరప చెట్లను పరీక్షించి నివారణ చర్యలు సూచించే నిమిత్తం స్థానిక మొక్కల సస్యరక్షణ సిబ్బందిని సంప్రదించండి. చెట్లపైన వేయడానికి దిగువ పేర్కొన్న మిశ్రమాన్ని వాడవచ్చు :—

| | | |
|---|---|---|
| 1. | ఆముదపు పిట్టు | ... 5 పౌనులు |
| 2. | అమ్మోనియం సల్ఫేటు | ... 1 పౌను |
| 3. | సూపర్ ఫాస్ఫేటు | ... 1 పౌను |
| 4 | పొటాసియం సల్ఫేటు | ... 1 పౌను |
| 5. | "స్టెరమీల్" | ... 2 పౌనులు |

ఈ మిశ్రమాన్ని బాగా ఎదిగిన చెట్లకు ఒక పౌను మోతాదులో వేసి, సమృద్ధిగా నీళ్లు పెట్టాలి.

*వి. వేణుగోపాలం, ఐనవల్లి, తూర్పుగోదావరిజిల్లా*

ప్ర_16 : హరిజనుల ప్రగతిని గురించి వివరించే ప్రత్యేక సమాచార పత్రాన్ని దేనినైనా ప్రభుత్వం ప్రచురిస్తున్నదా ?

జవాబు : లేదు.

*ఎల్. వి. రమణశర్మ, చాగల్లు, పశ్చిమ గోదావరిజిల్లా*

ప్ర_17 : ఆంధ్రప్రదేశ్ సముద్రతీరపు నిడివి ఎంత ?

జవాబు : దాదాపు 1,000 కిలోమీటర్లు.

*ఎస్. ఓంప్రకాశ్, హైద్రాబాదు*

ప్ర_18 : లోటు బడ్జెటు అంటే ఏమిటి ? కరెన్సీ నోట్లను అధికంగా అచ్చువేయడమా ? అలాగైనట్లయితే అది ద్రవ్యోల్బణకు దారితీయదా ?

జవాబు : లోటు బడ్జెటు అంటే, ప్రభుత్వానికి పన్నుల రూపంలో వచ్చే రాబడి ప్రభుత్వ రంగంలోని సంస్థలవల్ల వచ్చే ఆదాయం, ప్రజలనుంచి స్వీకరించే ఋణాలు, నిధులు మొదలైన వాటినిమించి ఖర్చుపెట్టడమన్నమాట. ప్రభుత్వం ఇటువంటి లోట్లను రిజర్వు బ్యాంకునుంచి ఋణం పొందిగానీ లేదా తన రొక్కపు నిలవలను తీసుకొని గానీ సర్దుబాటు చేసుకోవచ్చు. ఈ రెండు సందర్భాలలోకూడా ఇది డబ్బుసరఫరాలో పెంపుదలకు దారితీస్తుంది. ప్రతి చర్యలు తీసుకోకపోయినట్లయితే, సరుకులలోనూ సేవలలోనూ పెంపుదల లేకుండా చలామణీలోనున్న డబ్బు మాత్రమే పెరిగినట్లయితే ద్రవ్యోల్బణం ఏర్పడుతుంది.

ప్రతి చర్యలను అనేక విధాల తీసుకోవచ్చు : కఠిన ఆర్థిక విధానాన్ని అవలంబించడం ; ఆహార ధాన్యాలు, వస్త్రాలు తదితర అత్యవసర వస్తువుల నిలువలను పెంచడం ; లోటు బడ్జెటువల్ల వుత్పన్నమైన ఇతర ప్రమాదకరమైన ధోరణులను అరికట్టడం రేషనింగు వంటి చర్యలుకూడా కొంతవరకు తోడ్పడతాయి. ✱



ఈసంచికలోని వివిధ శీర్షికలను గురించి, ఇందలి రచనలను గురించి మీ అభిప్రాయాలు తెలుపండి. మీ సూచనలకు, సలహాలకు, విమర్శలకు స్వాగతం.

సీరియల్

# తిరస్కృతి

వాసిరెడ్డి సీతాదేవి

## జరిగిన కథ

సత్యం, సూర్యం అన్నదమ్ములు. సత్యం చిత్రకారుడు. సూర్యం పట్నంలో చదువుకుంటున్నాడు. సరళ చిన్నప్పుడే తల్లిదండ్రులను కోల్పోయి ఆయింట ఆశ్రయంపొందింది. సరళను సత్యాకు యిచ్చి పెళ్ళిచెయ్యాలని చిన్నప్పటినుంచీ అనుకుంటున్నారు. అయితే సూర్యం నాజూకుచూస్తే సరళకు వ్యామోహం కలిగింది.

“సరళా! చూడమ్మా నీకోసం కమల వచ్చింది.” శాంతమ్మ కేక విని సరళ గబగబా బయటికి వచ్చింది.

“కమల అత్తవారింటి నుంచి వచ్చింది. నిన్న చూట్టానికి వచ్చింది. అదుగో ఆమె ఆ గదిలో కూర్చొని వుంది చూడు.” అంది శాంతమ్మ.

చిన్ననాటి స్నేహితురాలును, ముఖ్యంగా వివాహం అయి వెళ్ళిపోయి సంవత్సరం తర్వాత వచ్చిన కమలను కలుసుకోవడానికి ఆరాటంగా పరుగెత్తింది సరళ మెల్లగా గదిలోకి. ఉయ్యాల బల్లమీద కూర్చొని విలాసంగా చిన్నగా ఊగుతున్న కమలను కళ్ళప్పగించి చూస్తూ నిల్చునిపోయింది సరళ. కమల అంతకుముందు సూర్యం వర్ణించినలాంటి ముడి వేసుకుని వుంది. దేవతా వస్త్రాలను అధిగమించే మిలమిల లాడుతున్న నైలాన్ చీర, కాళ్ళకు జరీ చెప్పులు, చేతికి రిష్టువాచీ!

“ఏమిటోయ్ అలా చూస్తున్నావు? అంత గుర్తుపట్టకుండా మారిపోయానా?” కిలకిల నవ్వింది కమల. సరళకు ఆమె నవ్వులో కూడా ఓ ప్రత్యేకత కనిపించింది.

“నువ్వేనా? అచ్చంగా సినిమాలో చూసిన ఎవరో లాగున్నావు.” అమాయకంగా అంది సరళ ఇంతింత కళ్ళు చేసుకుని కమలను చూస్తూ.

కమల మళ్ళీ కిలకిల నవ్వింది. సరళ వెళ్ళి కమల పక్కగా కూర్చొని కమల చీరను పట్టుకొని నలిపి చూస్తూ “ఏం చీర ఇది? నలిపినా నలగటంలేదు, ఎంత మెత్తగా ఉందో?” అంది సరళ ఆశగా.

“దీన్ని షిఫాన్” అంటారు అంది కమల.

“ఎంతవుతుందేమిటి?” ఆశగా అడిగింది సరళ.

దాని అసలు ఖరీదు పాతిక రూపాయలే అయినా డెబ్బయిఅయిదు అని గబుక్కున అనేసింది కమల.

“డెబ్బయ్ అయిదా? బాబోయ్!” ఆశ్చర్యంగా అంది సరళ.



“మరి హైదరాబాదు లాంటి పట్నంలో ఉండటమంటే ఏమనుకున్నావ్? ఇవి రోజు ఇంట్లో కట్టుకునే చీరలు. బయటకు వెళ్ళాలంటే నూటపాతిక ఖరీదు చేసే చీరయినా కనీసం ఉండాలి.”

సరళ ఆశ్చర్యపోయింది. తను కట్టుకున్న చీరవైపు చూసుకుంది. అరవయ్యోనంబరు గుంటూరు నేత చీర ‘అబ్బ ఎంత ముతకగా ఉందో!’ అనుకుంది. కమల పక్కన కూర్చోటమంటే కొంచెం సిగ్గుగా కూడా అనిపించింది.

సరళ భావాలను కొంతవరకు అర్థం చేసుకున్న కమల అన్నది. "జీవితం అంటే పట్నంలోనే చూడాలి. ఈ మారుమూల పల్లెటూరి జీవితంకూడా ఒక జీవితమేనా! నీలాంటి అందమైన వాళ్ళయితే ఎన్ని ఫ్యాషన్లయినా చేసుకోవచ్చును."

"ఆ ముడి ఎలా వేసుకుంటారు ?" సరళ కుతూహలంగా ప్రశ్నించింది.

"బాగుందా ?"

"ఆఁ లా బాగుంది. సూర్యం బావ అన్నీ బద్ధాలే చెబుతాడు. ఇలాంటి ముడి వేసుకున్న స్త్రీ నారదుడి లాగుంటుందనీ, మొఖం ముంజకాయను గుర్తు తెస్తుందనీను."

కమల పకపక నవ్వింది. సరళ కూడా శృతి కలిపింది.

"అయితే సూర్యం ఇక్కడే వున్నాడా ?"

"అవును సెలవలకు వచ్చాడు. డాక్టరు చదవబోతున్నాడు కలకత్తాలో" గొప్పగా చెప్పింది సరళ.

"ఆహాఁ" అని ఊరుకుంది కమల అదొక పెద్ద కబురు కాదన్నట్లు. సరళకు కొంచెం నిరుత్సాహం కలిగింది.

"సత్యం ఇంట్లోనే ఉన్నాడా ?"

"లేదు. ఎక్కడకో వెళ్ళాడు" సరళకు వళ్ళు మండింది. తను చిన్నబావను గురించి చెబుతుంటే మాట మారుస్తుందేం అనుకుంది.

"సరళా నీకు ఈ ముడి వెయ్యమంటావా?"

"అత్తయ్య ఊరుకోదేమో !" సాలోచనగా అంది సరళ.

"నిజమేలే. నన్ను ఈ ఊరివాళ్ళంతా కొత్తదాన్ని చూసినట్లు ఎంత వింతగా చూస్తున్నారో! పోనీయ్! చూస్తే చూశారు. నాతోపాటు ఆడిపాడిన వాళ్ళుకూడా కొత్తమనిషిని చూసినట్లు చూసి ఊరుకుంటున్నారు. ఎప్పుడొచ్చావనయినా అడగరు. ఇప్పుడు ఇక్కడకు వొస్తున్నప్పుడు ఆ నాగరత్నం కనిపించింది. నేనే పలకరించా ఉండబట్టలేక. సరిగా పలకనైనా లేదు. ఏదో తప్పుచేసిన వాళ్ళను చూస్తున్నట్లు చూస్తూ ఊరుకుంది. అంది కమల కొంచెం బాధగా.

సరళ కమల మాటలను వినిపించుకునే స్థితిలో లేదు.

"చెప్పులు కూడా వేసుకున్నావే! ఎంత మెరుస్తున్నాయో!"

"అవును. హైదరాబాదులో అందరూ వంటింట్లో కూడా చెప్పులు వేసుకుంటారు."

సరళ ఆశ్చర్యంగా వింటూ కూర్చుంది. సరళ కుతూహలాన్ని గమనించిన కమల చెప్పుకు పోసాగింది.

"అసలు పట్నంలో రోజులు నిముషాల్లా గడిచిపోతాయి. స్నేహితులూ, సినిమాలూ పిక్‌నిక్‌లూ."

"పిక్‌నిక్ అంటే"

"స్నేహితులతో కలసి వన భోజనాల లాటివి." కమల చెప్పుకు పోతూ ఉంది. సరళ ఆశ్చర్యంగా వింటూఉంది.

కమల సరళకంటే రెండేళ్లు పెద్ద. చిన్నప్పుడు అసలు ఏమీ బాగుండేది కాదు. ఎక్కువ మాట్లాడేది కూడా కాదు. పల్లెటూరి బట్టలు కట్టి సరళా, నాగరత్నం మొదలైన వాళ్లు ఏడిపిస్తుండేవారు. ఇప్పుడు సరళ దృష్టిలో కమల ఏదో లోకం నుంచి వచ్చిన మనిషిలా కనిపించసాగింది.

"మీ ఆయనకు ఉద్యోగమటగా? ఏం ఉద్యోగం?"

"ఎల్.డి.సి." అని చెప్పటానికి మనస్సురాని కమల "యు.డి.సి." అనేసింది.

అదేదో చాలా పెద్ద ఉద్యోగమే. అనుకుంది సరళ. యల్.డి.సి. అన్నా. యు.డి.సి. అన్నా. లేక ఐ.సి.యస్ అన్నా సరళకు అర్థం అయేది ఒకటే. అది బస్తీలో ఉద్యోగం చెయ్యటం గొప్ప ఉద్యోగస్తుడి భార్యకావటం. ఇంకాగొప్ప ఉద్యోగస్తులు బంగళాల్లో ఉంటారనీ. వాళ్ల పిల్లల్ని బడికి తీసుకెళ్ళాలంటే జవాన్లుఉంటారనీ. ఉద్యోగం చేసేవాళ్లు దొరల్లా వేషం వేసుకొని ఎంతో చక్కగా సిగరెట్లు తాగుతారనీ సరళవిన్నది. కమల భర్తకూడా సిగరెట్లు కాలుస్తాడు కాబోలు! మామయ్య యితే లంకపొగాకు చుట్టలు కాల్చుతాడు! అనుకుంది సరళ.

"ఇంక ఎన్ని రోజులుంటావు?" సరళ ప్రశ్నించింది. కమల్ని ఇంకా ఎన్నో అడగాలనివుంది సరళకు.

"రావటం అయితే ఓ ఇరవయ్ రోజులు ఉండాలనే వచ్చాను. కాని బాబోయ్ ఈ పల్లెటూర్లో నాలుగు రోజులకే నా ప్రాణంపోతున్నట్లుంది. రెండు రోజుల్లో వెళ్ళిపోతాను."

సరళకు కమల మాటలు అర్థం కాలేదు. తనుపుట్టిపెరిగిన ఊరిలోనే ఉండలేకపోతుందా? ఒక సంవత్సరం బస్తీలో ఉండగానే తన ఊరినేమర్చిపోయిందా? తనుకూడా అలా మర్చిపోగలదా? తనకు ఈ ఊరంటే ఎంత ఇష్టమో! ఈ ఇల్లూ, అత్తయ్యా, మామయ్యా, ఇంటిముందున్న మల్లెచెట్టూ, దొడ్లోని జామచెట్టూ అంటే తనకెంతో ఇష్టం. ఆమాటకొస్తే ఊళ్లోని ప్రతివస్తువూ తనకు ఇష్టమే కమల మీద సరళకు కొంచెం కోపంకూడా వచ్చింది.

"వెధవ ఊరు. ఇంత కాలం ఈఊళ్లో ఎలాఉండ గలిగానా అని ఇప్పుడు ఆశ్చర్యం వేస్తుంది. ఎక్కడ చూసినా దుమ్మూ బురదా! స్నానంచెయ్యాలంటే కాళ్లకింద బురద. ముఖ్యంగా ఇంతలావుచెంబు ఒకటిపట్టుకొని ఊరిబయటకు బయలు

దేరాలంటే చచ్చేంత సిగ్గుగా ఉందిబాబూ!." ముఖం ఆముదం తాగుతున్నప్పుడు పెట్టినట్లు పెట్టింది కమల

సరళకు కమల మాటలు విస్మయాన్ని కలిగించాయి. "పల్లెల్లో ఉండేవాళ్లు చెంబులు తీసుకోకుండానే ఊరిబయటకు వెళతారా?" ఆశ్చర్యంగా అడిగింది

కమల పకపకనవ్వింది. సరళ అయోమయంగా చూసింది.

"అసలు పట్నంలో బయటకు వెళ్ళక్కరలేదుగా? ఇంట్లోనే దొడ్లుంటాయి. మేము ఉన్న ఇంట్లోనైతే వంటింటి పక్కగదే కక్కసు." అంది కమల గర్వంగా

ఈసారి ఆముదం ముఖం పెట్టటం కమల పనయింది.

"ఛీ పాడు! ఇంట్లో పాకీదొడ్లేమిటి!" ఏవగించుకుంటూ అంది.

"ఎలాటి దొడ్లనుకున్నావు? బొంబాయి పింగాణీతో చేస్తారు? ఎంత శుభ్రంగా మిలమిల లాడుతుంటాయో?"

"పింగాణీయా?" ఆశ్చర్యంగా అడిగింది సరళ.

సరళకు పింగాణీవస్తువులంటే బలేఇష్టం. రెండు పింగాణీ బొమ్మలు (దొర–దొరసాని, ఒక పింగాణీ పళ్లెం ఉన్నాయి సరళ దగ్గర. ఒకసారి ఆ ఊరు తన చిన్నప్పుడు దాసర్లు పింగాణీ జర్మన్ సిల్వర్ సామానులు తెచ్చారు. తను అత్తయ్యను పడి పించి అడిగికొనుక్కుంది. అత్తయ్య దగ్గర చిరిగిపోయిన జరీ చీర ఉంటే ఆ చీర జరీతో కొన్నది. ఆ వస్తువులకోసం తనూ సూర్యం పోట్లాడుకున్నారు కూడా. అత్తయ్య చిన్నబావకు నాలుగు వడ్డించి వాటన్నిటినీ తనకే ఇచ్చింది. భోషాణంలో ఎంత భద్రంగా దాచుకుందో!

సరళ వెంటనే వెళ్ళి పింగాణీతోచేసే అవిఎలా ఉంటాయో చూడాలనిపించింది.

"డాక్టరు పాసయ్యాక మా చిన్న బావకూడా హైదరాబాదులోనే ఉద్యోగం చేస్తాడంట. అక్కడ చాలా పెద్ద పెద్ద ఆసుపత్రులు ఉన్నాయటగా? అప్పుడు నేనుకూడా అక్కడే ఉండిపోతాను చిన్న బావదగ్గర." అంది సరళ ఏ ఆలోచనా లేకుండానే.

"అదేమిటి నువ్వు సూర్యంతో ఎలా ఉండిపోతావు. నువ్వు చేసుకొనేది మీ పెద్దబావనేగా?" అంది ఆశ్చర్యంగా కమల.

తన తప్పును తెలుసుకున్న సరళ మాట్లాడలేదు. తను చెప్పే ప్రతివానికీ అడ్డుప్రశ్న వేసి తన ఉత్సాహం మీద నీళ్లు పోస్తున్న కమల మీద చిర్రెత్తుకొచ్చింది సరళకు

"అక్కా అమ్మరమ్మంటూందే?" అంటూ కమల చెల్లెలు వసంత వచ్చింది. వసంత సరళ ఈడుది. (సశేషం)

---

6వ పుటనుండి)

*"పద్మశ్రీ" బిరుదు పొందినవారిలో కొందరు.*

1. శ్రీ అక్కినేని నాగేశ్వరరావు, చలనచిత్ర కళాకారుడు ఆంధ్రప్రదేశ్
2. శ్రీ ఎన్. టి. రామారావు, చలనచిత్ర కళాకారుడు, ఆంధ్ర ప్రదేశ్.
3. కుమారి యామినీ కృష్ణమూర్తి, నర్తకి.
4. శ్రీ డి. ఆర్. బెంద్రె, కన్నడకవి, మైసూరు.
5. శ్రీమతి దుర్గా కోటె, చలనచిత్ర నటి, మహారాష్ట్ర
6. శ్రీ జె. ఎస్. భొంగారె, మాజీ ముఖ్య సలహాదారు (చలన చిత్రాలు) భారత ప్రభుత్వం, కొత్తఢిల్లీ.
7. శ్రీ ఎం. ఆర్. అచేర్కర్, కళాకారుడు, మహారాష్ట్ర.
8. శ్రీమతి వైజయంతిమాల, చలనచిత్ర నటి.
9. శ్రీ సునీల్‌దత్, చలనచిత్ర కళాకారుడు, మహారాష్ట్ర.

## పోలీసు పతకాలు

19 వ రిపబ్లిక్ దినోత్సవంనాడు 112 మంది పోలీసు అధికారులకు వారి విశిష్ట సేవలకు గుర్తింపుగా రాష్ట్రపతి పోలీసు పతకాలు ఇచ్చారు. దిగువ తెల్పిన ఆంధ్రప్రదేశ్ పోలీసు అధికారులకు యీ పతకాలు లభించాయి.

సర్వశ్రీ సి. చెన్నకృష్ణయ్య, డిప్యూటీ ఎస్.పి. నరసారావుపేట సబ్‌డివిజన్, పి. నరసింహులు డి. ఎస్. పి., క్రైమ్ బ్రాంచి, సి.ఐ.డి, జి. మహేశ్వరరావు, ఆర్. సయ్యద్ హుసేన్ పోలీసు ఇనస్పెక్టర్లు, అవినీతి నిరోధకశాఖ; ఎస్. సుబ్బారాయుడు, పోలీసు ఇనస్పెక్టర్, క్రైమ్‌బ్రాంచి, సి.ఐ.డి., కోకా హనుమంత. రావు, పోలీసు ఇనస్పెక్టరు, సయ్యద్ బషీరుద్దీన్ అహమ్మద్ ఎస్.ఐ బి. నారాయణ, హెడ్‌కానిస్టేబిల్, వరంగల్లు.

# రాష్ట్ర జనవారోత్సవాలు

హైదరాబాదులో చారిత్రాత్మకమైన నిర్ణయాలు తీసుకుంటున్న తరుణంలోనే రాష్ట్ర ప్రజలు మరో చారిత్రాత్మకమైన రాష్ట్ర జనవారోత్సవాలను భారీ ఎత్తున మహా వైభవంగా జరుపుకున్నారు. జంట నగరాలలోని చాలామంది ప్రజలు ఒకవైపు రాజకీయ పార్టీ సమావేశాలకు హాజరు అయినప్పటికీ నగరంలోని వివిధ ప్రదేశాలలోను, ప్రముఖ క్రీడాస్థలాలలోను రాష్ట్ర జన వారోత్సవాలను జరుపుకునే ప్రజా సమూహాలు కనిపించేవి.

ఎవరో ఒక ప్రముఖ నాయకుడు ఉత్సవాలకు ప్రారంభోత్సవం చేసే సంప్రదాయాలను విడనాడి ప్రప్రథమంగా రాష్ట్ర ప్రజలు యీ వారోత్సవాలను జరుపుకుని నిక్షిప్తమై ఉన్న తమ ప్రతిభా విశేషాలను ప్రదర్శించారు. రాష్ట్ర రాజధానిలోని ప్రజలు లాల్ బహదుర్ నగర్‌లో కాంగ్రెసు మహా సభలకు హాజరయినా, జన సంబంధశాఖ రూపొందించిన రాష్ట్ర జన వారోత్సవ కార్యక్రమాలు ప్రజల మనస్సును ఆకర్షించాయి.



రాష్ట్ర జనవారోత్సవాలకు జనవరి 8వ తేదీన హైదరాబాదులో డా. శకుంతలాదేవి బాపూజీ ప్రారంభోత్సవం చేస్తున్న దృశ్యం

జనసంబంధశాఖ మంత్రి, శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ, జన సంబంధశాఖ సంచాలకులు శ్రీ బి. ఎన్. రామన్ రూపొందించిన యీ కార్యక్రమాలు ప్రజల జీవన రంగానికి సంబంధించిన అన్ని అంశాలకు వర్తించాయని ప్రజలు గుర్తించగలిగారు. మానవునిగా తమ వ్యక్తిత్వాన్ని, విశిష్టతను ప్రతి ఒక్కరు గుర్తించారు.

ప్రజలలో సాంస్కృతిక పునరుద్ధరణకు అంకురార్పణ చేస్తూ రాష్ట్ర జన వారోత్సవాలు జరిగిన జనవరి 8వ తేదీ చరిత్రలో చిరస్మరణీయ మవుతుంది. వివిధ వృత్తులకు చెందినవారు, విభిన్న జీవనరంగాలకు చెందినవారు అందరు కలిసి ఎంతో వైభవంగా యీ ఉత్సవాన్ని జరుపుకున్నారు. వ్యవసాయదారులు, నేతవారు, గితపారిశ్రామికులు, బెస్తలు, గొల్లలు, వడ్రంగులు, కళాకారులు, కుమ్మర్లు, పెయింటర్లు, ఫొటోగ్రాఫర్లు, వాద్యకారులు, కుట్టు పనివారలు, వ్యాపారులు—ఒకరేమిటి అన్ని వృత్తులకు చెందిన, అన్ని రంగాలకు చెందిన ప్రజలు ఉత్సాహంతో యీ కార్యక్రమాలలో పాల్గొని తమ ప్రతిభావ్యుత్పత్తులను ప్రదర్శించారు. జంట నగరాలలోని వివిధ కేంద్రాలలో యీ ఉత్సవాలను వైభవంగా జరిపారు. విక్టరీ ప్లేగ్రౌండులోను, ముషీరాబాదు కార్మిక సంక్షేమ కేంద్రంలోను ప్రజలు అధిక సంఖ్యలో పాల్గొన్నారు. ముషీరాబాదు కేంద్రంలో డా. శకుంతలాబాయ్ స్త్రీల సమావేశంలో ప్రసంగించారు. కార్మిక సంక్షేమ కేంద్రం సూపరింటెండెంటు శ్రీ యాదగిరి యాదవ్, డా. సత్యనారాయణస్వామి, కార్మికశాఖ కమీషనరు శ్రీ భారతచంద్ ఖన్నా ఐ. ఎ. ఎస్. తదితరులు ఉత్సవాల ప్రాముఖ్యతను గూర్చి చెప్పారు.

వారోత్సవపు రెండవ రోజును, అనుబంధ వృత్తులు, పనుల ద్వారా తమ ఆదాయం పెంచుకుంటున్న వారికొరకు కేటాయించారు. ఈ పనులలో వారు తమ నైపుణ్యం ప్రదర్శించ గలగ



హైదరాబాదులోని ముషీరాబాదు కార్మిక సంక్షేమ కేంద్రంలో రాష్ట్ర జనవారోత్సవాల బహుమతీ ప్రదానం

దానికి వీలుగా పలురకాల పోటీలను సూచించడం జరిగింది. మూడవ రోజును జంతువుల సంక్షేమదినంగా పాటించడానికి నిర్ణయించబడింది. జంతువులకు మంచి ఆహారం తదితర సౌకర్యాలు కల్పించవలసిన అవసరాన్ని పెంపకందార్లు గుర్తించేటట్లు చేయడం ఈ దినోత్సవం ఉద్దేశ్యం. ఈ సందర్భంగా అనేక పోటీలు సూచించబడినవి.

నాలుగవ రోజు, వివిధ ఆటల పోటీలకు ప్రత్యేకించబడింది. తమ ప్రతిభాసామర్థ్యాలను ప్రదర్శించడానికి ఈ పోటీలు యువకులకు, వృద్ధులకూ, ధనికులకు, పేదలకూ సమానావకాశాలు కలిగించాయి. ఒకరోజుపాటు నాకౌట్ టోర్నమెంట్లు యేర్పాటు చేశారు. క్రీడాకారులు అభిమానులు పీటిపట్ల ఎంతో ఆసక్తి కనబరిచారు.

అయిదవ రోజున రాష్ట్రంలోని అనేక గ్రామాలలో వివిధ సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించారు. వీటిలో అనేక మంది జనులు ఎంతో ఉత్సాహంగా పాల్గొన్నారు.

ఆరవ రోజును సాంఘిక సేవాదినంగా జరిపారు. ఈ సందర్భంలో ప్రజలు అధిక సంఖ్యలో సేవా కార్యక్రమాలు చేపట్టారు.

జనవరి 14వ తేదీ ఆంధ్రప్రదేశ్ ప్రజలందరికీ పండుగ రోజు. జనవారోత్సవాల ముగింపు దినం అది. ఆనాడు వందలాది గ్రామాలలో ప్రజలు వైభవంగా వేడుకలు జరుపుకున్నారు. రాష్ట్ర జన వారోత్సవాలలో ప్రజలు తారతమ్యాలు లేకుండా ఆనందంతో ఉత్సాహంతో పాల్గొన గలిగారు. అప్పటి అనుభూతులు ప్రజలలో శాశ్వత ముద్ర వేశాయి.

రాష్ట్ర జన వారోత్సవాల లక్ష్యం యిదే. ఈ యేడాది ప్రాథమిక యూనిటు స్థాయిలో నిర్వహించబడిన రాష్ట్ర జనవారోత్సవాలకు బయటివారి సహాయం అక్కరలేక పోయింది. ప్రజోత్సాహమే ఈ ఉత్సవాలను విజయవంతం చేసింది. జన సంబంధ శాఖ పొందుపరచిన రాష్ట్ర జన వారోత్సవాలు ప్రజలు జరుపుకొని ఆనందించవలసిన ప్రజోత్సవాలు.

## గుంటూరులో

గుంటూరులోని బ్రహ్మానందరెడ్డి స్టేడియంలో జరిగిన జన వారోత్సవాల కార్యక్రమానికి అధ్యక్షత వహిస్తూ కలెక్టరు శ్రీ ఎం. వెంకటరత్నం, జనసంబంధ శాఖ జిల్లా స్థాయిలో అన్ని శాఖల కార్యకలాపాలను సమన్వయ పరచాలని కోర్కొన్నారు.



రాష్ట్ర జన వారోత్సవాల సందర్భంగా గుంటూరులో
బహిరంగ సభలో ప్రసంగిస్తున్న
జిల్లాకలెక్టరు శ్రీ ఎం. వెంకటరత్నం

జిల్లా పరిషత్తు అధ్యక్షుడు శ్రీ ఎం. నాగేశ్వరరావు మాట్లాడుతూ, గ్రామీణ ప్రాంతాలలో సంప్రదాయకమైన సాంస్కృతిక కార్యకలాపాలను పునరుద్ధరించడంలో ఈ వారోత్సవాలు చాలా వరకు తోడ్పడగలుగుతాయని అన్నారు. ఈ సందర్భంలో ఏర్పాటు చేసిన ఒక ప్రదర్శనశాలను కూడా ఆయన ప్రారంభించారు. సంగీత పోటీలలో గెలుపొందిన వారికి శ్రీమతి శ్యామలా వెంకటరత్నం బహుమతులు పంపిణీ చేశారు. హిందూ కళాశాల ఫిజికల్ డైరెక్టరు శ్రీ గోపీనాథ శాస్త్రి ఆటల పోటీలు నిర్వహించారు.

## మహబూబ్ నగర్‌లో

రాష్ట్ర జనవారోత్సవాల ముగింపు దినం సందర్భంగా స్థానిక మునిసిపల్ టౌను హాలు ఆడిటోరియంలో జనవరి 14వ తేదీన మునిసిపల్ అధ్యక్షుడు శ్రీ జి. రామలింగం అధ్యక్షతన బహిరంగ సభ జరిగింది.

## వేములవాడలో

జనసంబంధశాఖ ఆధ్వర్యంలో వేములవాడలో జనవరి 8 నుంచి 14 వరకు జనవారోత్సవాలు వైభవంగా జరిగాయి. ఈ సందర్భంలో అన్ని వర్గాల ప్రజల కొరకు వివిధ పోటీలు జరిపారు. చివరి రోజున, విజేతలకు బహుమతుల పంపిణీ జరిగింది. బహుమతులకు అయిన వ్యయంలో కొంత భాగాన్ని వేములవాడ పంచాయతీ సమితి భరించింది. ప్రతిరోజూ చలన చిత్రాలు ప్రదర్శించారు.



**జనాభా పెరుగుదల మన ప్రగతికి గొడ్డలిపెట్టు**

# చైతన్యమూర్తులు



## డాక్టర్ జాకిర్ హుస్సేన్

(జననం: 8 ఫిబ్రవరి 1897)

భారత సెక్యులర్ విధానానికి ప్రతీక డా. జాకిర్ హుస్సేన్. అంతేగాక తత్వవేత్త, రాజకీయ వేత్త అయిన డా. రాధాకృష్ణన్‌కు తగిన వారసుడు. రిపబ్లిక్ గ్రంథ రచయితా తత్వవేత్తా అయిన ప్లాటో ఆదర్శాలకు అనుగుణమైన వాడు. ఈ ప్రసిద్ధగ్రంథాన్ని డా. జాకిర్ హుస్సేన్ ఉర్దూ భాషలోకి అనువదించడం గమనార్హమైన విషయం.

ముస్లింలీగు ఉన్న రోజులలో డా. జాకిర్‌హుస్సేన్ ఎప్పుడూ మతతత్వ వాదాన్ని ఖండించే వారు. జిన్నా లేవదీసిన రెండు జాతుల సిద్ధాంతాన్ని ఆయన అంగీకరించలేదు. అయన యిలా అన్నారు—

"సమానత మార్గంలో మానవులను వ్యవస్థీకృతం చేయదలచినప్పుడు, జాతి, వర్ణ, కుల దురభిమానాలను రూపు మాపదలచినప్పుడు, అది మొదట మన భూమిలోనే భారత దేశంలోనే చేయాలి. ఈ మట్టినుండి మనం ఉద్భవించాము. తిరిగి యీ మట్టిలోనే కలిసిపోతాము".

డా జాకిర్ హుస్సేన్ ముఖ్యంగా విద్యావేత్త. గోఖలే ఆదర్శాలతో ఆయన అనేక సంవత్సరాలపాటు జాతీయ విద్యా సంస్థ జామియామిల్లియాకు సేవచేశారు. గాంధీ సిద్ధాంతాల ప్రాతిపదికపై బేసిక్ విద్యా కార్యక్రమాలను ఆయన రూపొందించారు.

విద్యా విషయంలో రాష్ట్రపతికిగల కొన్ని భావాలను దిగువ యివ్వడం జరిగింది,

ప్రజాస్వామ్య జీవన మార్గానికి అనుగుణమైన విద్యా విధానాన్ని భారత ప్రజలకు అందించాలని తలచేవారెవరైనా, నిస్తబ్ధత, నిశ్చలత్వంనుండి, చురుకుదనం ఉత్సాహాలవైపు, విషయసేకరణ, విస్మరణలనుండి విజ్ఞాన పరిశోధనల వైపు, సిద్ధాంతపరమైన విజ్ఞానపరమైనఏక పక్ష దృక్పథం నుండి ఆచరణాత్మకమైన మానవబహు ముఖదృక్పథం వైపు, వ్యక్తిగత స్వార్థ పరత్వం నుండిసాంఘిక అభ్యుదయం వైపు పయనించే విధంగా మన విద్యా సంస్థలన్నిటినీ ఎలిమెంటరీ పాఠశాలల నుండి విశ్వవిద్యాలయాల వరకు మార్పులు తీసుకురావాలి.

నేడు విద్యా సంస్థలేగాక భారత దేశంలోని ప్రతి పౌరుడు వ్యక్తిగత స్వార్థ పరత్వాన్ని విడనాడి సాంఘిక సంక్షేమానికి కృషి చేయాలి.



## శ్రీ రామకృష్ణ పరమహంస

(జననం: 1836 ఫిబ్రవరి 18)

రామకృష్ణ పరమహంస ఆధునిక భారత దేశంలో పుట్టిన ఒక గొప్ప యోగి. ఈ మహనీయుడు బెంగాలులోని హుగ్లీ జిల్లాలోగల కామార్ పురా మారుమూల కుగ్రామంలో గదాధర్ చటోపాధ్యాయ అనబడే అతి సామాన్య వ్యక్తిగా జన్మించారు. నాలుగేళ్ళ ప్రాయంలోనే ఆయన సమాధిస్థితిని అనుభవించేవారు. పాఠశాలకు వెళ్ళి చదివిన చదువు బహు కొద్దిగానే వుంది. స్వతహాగా అపూర్వమైన మత విషయక ప్రతిభా వ్యుత్పత్తులుగల వ్యక్తి ఆయన. పన్నెండేళ్ళపాటు ఆయన హిందూమతంలోని అతి కఠోరమైన అనుష్ఠానములను అతి నిష్ఠా గరిష్ఠులై ఆచరించారు. తాపసిక జీవితాన్ని గడిపారు. హిందూమత తంత్రాలను అనుష్ఠించారు. తోటపురి అనే యోగి యీయనకు ఉపదేశం చేసి రామకృష్ణ అని నామకరణం చేశారు.

ఇంచు మించు మతాలు అన్నీ భగవంతుని పురుష రూపంలో ఆరాధించగా రామకృష్ణపరమహంస భగవత్ స్త్రీ రూపంలో కొలిచారు. తన భార్య శారదాదేవిని జగన్మాతగా ఆరాధించారు. ప్రపంచ చరిత్రలోనే అపూర్వమైన దృష్టాంతం వీరిది. రామకృష్ణ, శారదాదేవి వివాహ బంధం ఆధ్యాత్మిక భావబంధం. స్త్రీకి ఆయన యిచ్చిన గౌరవం అసాధారణమైనది. భైరవి బ్రహ్మణి అనే ఆమెను ఆయన తనకు గురువుగా స్వీకరించారు.

కేవలం స్పర్శా మాత్రంచేత రామకృష్ణ పరమహంస ఏ వ్యక్తినైనా ఆధ్యాత్మిక వీధులలోకి తీసుకొని పోగలరు. ఆయన భారత దేశానికి యిచ్చిన అపూర్వమైన కానుక—స్వామీ వివేకానందుడు.

రామకృష్ణ పరమహంస ప్రబోధాలు అత్యంత మనోహరంగాను, అత్యద్భుతంగాను వుంటాయి. అవి అతి సరళమై విశేషమైన అర్థాన్ని నింపుకొని భావ స్ఫోరకమైనవి. ఆయన చెప్తారూ—

ఏ వ్యక్తికైనా అరికాలులో ముల్లు గుచ్చుకుంటే ఆయన మరో ముల్లుతో ఆ గుచ్చుకున్న ముల్లుని తీసివేస్తాడు.

అంటే—

అజ్ఞానమనే ముల్లును, జ్ఞానమనేముల్లుతో తీసివేస్తాడు.

అయితే విజ్ఞానం పొందిన తర్వాత అజ్ఞానం అనే ముల్లునూ, జ్ఞాన మనే ముల్లునూ— యీ రెంటినీ కూడా త్రోసి వేస్తాడు.

దేవునితోనే రాత్రింబవళ్ళూ అతి సన్నిహితంగా సంభాషిస్తాడు విజ్ఞాని.

కేవలం 'పాలు' అనే పదాన్ని గురించి విన్నవాడు అజ్ఞాని అనుకుంటే, పాలను చూసినప్పుడు అతడు జ్ఞాని. పాలు త్రాగితే అతడు విజ్ఞాని.

## దీనబంధు ఆండ్రూస్

(జననం 1871 ఫిబ్రవరి 12)

ఛార్లెస్ ఫ్రీర్ ఆండ్రూస్ న్యూ కేస్టలెంటైన్‌లో జన్మించారు. విద్యార్థిదశలో చక్కటివక్తగా, మంచిక్రికెట్ ఆటగాడుగా, నటకుడుగా పేరుపొందారు. మత వాతావరణంలోనూ, అలౌకికమైన అనుభూతులమధ్యనా ఆయన యవ్వనం గడిచింది. ఎన్నో ఎదురుదెబ్బలను తిన్నారు ఆయన. దానితోనే ఆయన ఆలోచనలు మరో మార్గంలోకి మళ్ళాయి. జీవితంలోని వైచిత్రినిగూర్చి, మతణాన్నిగూర్చి ఆలోచించడం మొదలెట్టారు.

విధి ఆయనను భారతదేశానికి తీసుకొచ్చింది. 1904 మార్చి 20న ఆయన బొంబాయిలో అడుగుపెట్టారు. ఆ రోజును ఆయన పునర్జన్మగా భావిస్తారు. అది ఆయనకు మరో జీవితాన్ని ప్రసాదించింది.

ఇంగ్లీషువారికి, భారతీయులకు మధ్యనున్న అగాధాన్ని ఆయన చూశారు. జాతి కారణంగానూ, కులమతాలు కారణంగానూ ఏర్పడిన యీ అగాధాన్నిచూస్తే ఆయనకు చాలా బాధ కలిగింది. మానవ సమానత్వంగురించి ఆయన పోరాటం సాగించారు. భారతదేశం తొల్లిటి వైభవాన్ని సంతరించుకోవడంలో అడుగా నిలచిన సాంప్రదాయాల్నీ, అలవాట్లనూ ఛేదించాలని ఆయన తలపెట్టారు.

ఢిల్లీ మురికి ప్రాంతాలలో సాంఘిక సేవా కార్యక్రమాన్ని ప్రారంభించారు. తన యీ కార్యక్రమాలను జరిపించడానికి సెంట్ స్టీఫెన్స్ కళాశాల విద్యార్థులను ప్రోత్సహించారు. వీరి నాయకత్వంక్రింద హరిజనుల సేవా కృషికి అంకురార్పణ జరిగింది. ఆరోగ్య ఉద్యమాలు నిర్వహించారు. రోగుల చికిత్స, పారిశుధ్యవిషయాలలో ప్రత్యక్ష ప్రదర్శనలు ప్రారంభించారు.

ఫిజీ దీవులలో ఒడంబడిక ప్రకారం పనిచేసే కార్మికుల పరిస్థితులను మెరుగు పరచడానికి శ్రీ ఆండ్రూస్ విశేషించి శ్రమించారు. ఈ కార్మికుల స్థితిగతులకు సానుభూతిని కలిగిస్తూ, వారిని గూర్చి ప్రచారంచేస్తూ పర్యటనలుచేశారు. వీరికృషి ఫలితంగా ఈ విధమైన ఒడంబడిక కార్మికుల పద్ధతి నిర్మూలించబడింది. తర్వాత ఆయన కెన్యాలో స్థిరపడిన భారతీయుల స్థితిగతులను మెరుగుపరిచేందుకు పూనుకున్నారు.

తరుచుగా ఆయన సేవాకార్యక్రమాల పనిమీద ఆఫ్రికా, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, ఫిజీదీవులు, ఇంగ్లాండు, యూరపు దేశాలకు వెళ్ళేవారు. ఎక్కడ ఏ అవసర పరిస్థితులు ఏర్పడినా అక్కడ ఆయన ప్రత్యక్షమైనట్లు వుండేవారు. ఎప్పుడు ఎక్కడ ఆయన వుంటారో తెలుసుకోవడం కష్టం. ఒకొక్కప్పుడు ఆయన వద్ద టెలిగ్రాం పంపడానికికూడా డబ్బు వుండనిపరిస్థితులుకూడా వుండేవి. డబ్బు చేతిలోవుంటే మంచినీళ్ళయి జారిపోయేవి. అపాత్రదానం చెయ్యనన్నా చెయ్యవచ్చుగాని అడిగినవాడికి లేదని మొండిచెయ్యి చూపగూడదని ఆయన సిద్ధాంతం. అడిగినవారికి దానంచేసి మోసపోయిన ఘట్టాలు అనేకం వున్నాయి.

ఎప్పుడు ఎక్కడ ఏవిధమైన విపత్తు సంభవించినా అక్కడ ఆయన నిలచి బాధితులకు ఉపశమనం కలిగించేవారు. వాళ్ళ విపత్తును తొలగించడానికి కృషి చేసేవారు. 1927లో ఒరిస్సాలో వరదలు వచ్చినప్పుడూ, 1935లో బీహారులో భూకంపం వచ్చినప్పుడూ, 1935లో క్వెట్టాలో భూకంపంవచ్చినప్పుడూ ఆండ్రూస్ సహాయక చర్యలు బాధితులకు ఎంతో ఉపశమనాన్ని కలిగించాయి.

రవీంద్రనాథ్‌టాగూరుతోను, గాంధీజీతోనూ శ్రీ ఆండ్రూసుకు సన్నిహిత పరిచయంవుంది. టాగూరు ఆయనను విశ్వభారతికి ఉపాచార్యుడుగా (ఉపాధ్యక్షుడుగా) నియమించారు. విశ్వభారతి అఖిలభారతసంస్థగా రూపొందడానికి శ్రీ ఆండ్రూసు అనవరత కృషి గావించారు.

ఆండ్రూసు కలకత్తా ఆసుపత్రిలో చికిత్స పొందుతుండగా గాంధీజీ ఆయనను చూడడానికి వెళ్ళారు. ఆండ్రూసు కన్నులు కృతజ్ఞతతో వెలిగాయి. 'మోహన్! స్వరాజ్యం వస్తున్నది' అన్నారు ఆయన. ఆండ్రూసుకు ఆపరేషను చేయాలని నిర్ణయించినప్పుడు ఆయనకు తన ప్రేమాశీస్సులను అందజేస్తూ గాంధీజీ ఒక

టెలిగ్రాం పంపించారు. ఆండ్రూసు వ్యాధికి లొంగిపోయారు. 1940 ఏప్రెల్ 5న ఆయన మృత్యుసన్నిధిలోకి వెళ్ళిపోయారు. ఆయన జీవించియున్నప్పుడు ఆయన చేసే ప్రతి సేవలోనూ భగవంతుడు ఆయనవెంట వున్నాడు. మరణానంతరం భగవంతుని సన్నిధిలోనే ఆయన వున్నాడు.

## శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు

(జననం 1865 ఫిబ్రవరి 11)

సుమారు యాభయ్యేండ్ల క్రితం ప్రాథమిక తరగతుల్లో ఆనంద వాచకాలు బహుళంగా వ్యాప్తిలో వుండేవి. కంఠాభరణం, రాధాకృష్ణ, విప్రనారాయణ నాటకాలు ఆంధ్ర ప్రేక్షక లోకాన్ని రసానందాబ్ధిలో ఓలలాడించినవి.

సాక్షి ఉపన్యాసాలు ఎన్నో సంవత్సరాలపాటు తెలుగు పాఠకులను ఉర్రూతలూగించాయి. ఆ తర్వాత ఆనంద పాఠకులు క్రమంగా తగ్గిపోయారు. కంఠాభరణం యితర నాటకాలు ఇప్పుడు చాలా తక్కువగా ప్రదర్శించ బడుతున్నాయి. అయితే ఆసక్తిగల వారిని ఆహ్లాదపరచి, ఆనందింపజేయడానికి అవి గ్రంథాలయాలలో ఉన్నాయి. వ్యవహారిక భాషలోగల రచనలకు అలవాటుపడిన ప్రస్తుత తరంవారు కూడా గ్రాంథిక భాషలోగల ఆయన రచనలు చదవడానికి ఉత్సాహపడ్తారు.

ఆశావాద తత్వంగల పఠితలకు ప్రాతినిధ్యం వహించే రచయిత. 30 నాటకాలలో 300 పాత్రల సృష్టికర్త. కటువుగాను, వ్యంగ్యంగాను, ఆదర్శవంతంగాను, ప్రోత్సాహజనకంగాను, ప్రబోధాత్మకంగాను ప్రవచించిన సాక్షి ప్రవక్త పానుగంటి లక్ష్మీ నరసింహారావు, మన సంప్రదాయాలలోని మంచిని స్వీకరిస్తూనే సంప్రదాయరహితమైన వాటిలోని మంచిని కూడా మన్నించారు. అభివృద్ధి మార్గానికి ఆటంకంగా ఉన్నవాటిని అవి మన సంప్రదాయములైనా సరే హతమార్చడంలో ఆయన వెనుకముందాడ లేదు.

కావ్యారంభం, మధ్య కావ్యాంతం శుభప్రదంగా ఉండడం భారతీయ సంప్రదాయం. అయితే దుఃఖరసంలో పరిశుద్ధత, ప్రక్షాళనల విలువలు ఉన్నాయని పానుగంటి గుర్తించారు.

కాళిదాస, భవభూతి మహాకవులతోపాటు, షేక్స్‌పియర్‌ను కూడా ఆయన అభిమానించారు. పానుగంటి నాటకాలలో ప్రాచ్య పాశ్చాత్య కళానైపుణ్యం మేళవింపు ద్యోతకమవుతుంది. స్విఫ్ట్, ఎడిసన్, స్టీలెల రచనల ప్రభావం ఫలితమే సాక్షి రచనలకు దారి తీసింది. ఆంగ్లేయ సాహిత్యం ప్రభావితం చేసినా ఆయనలో జాతీయతా భావమే వెల్లివిరిసింది. జంఘాల శాస్త్రి, వాణీదాసు, బొర్రాసెట్టి పాత్రలన్నీ దేశీయములైనవే.

పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు దివాన్‌గా కూడా పని చేశారు. ఆ తరువాత పిఠాపురం సంస్థానంలో ఆస్థాన కవిగా గౌరవింపబడినారు. రెండు దశాబ్దాల వరకు మహా వైభవంగా జీవితం గడిపారు. వీరు 1940లో స్వర్గస్థులైనారు.

## శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి

(జననం: 1888 ఫిబ్రవరి 7)

వేటూరివారి కుటుంబం వంశపారంపర్యంగా పూజారులు. బాల్యంలో ప్రభాకర శాస్త్రిగారు గాయత్రి మంత్రాన్ని సవ్యంగానే నేర్చారు. అయితే మంత్రాలు, పూజా పునస్కారాలు వాటి అర్థాన్ని కోల్పోయాయని భావించిన యీ బాలునికి మతాచార్య విషయాలలో అయిష్టత ఏర్పడింది.

ఆశుధార కవిత్వంలో జగత్ప్రసిద్ధిగాంచిన చెళ్ళపిళ్ల వేంకట శాస్త్రి ప్రతిభ ఆయనను మచిలీ పట్నం ఆకర్షించింది. సంస్కృతం, తెలుగులలోను, అవధాన కళలోను ప్రభాకర శాస్త్రి విద్యనభ్యసించారు.

ఆయన ఉపాధ్యాయ వృత్తి చేపట్టారు. ఆయన 50 శాతం మార్కులు విద్యాభ్యాసానికి, 50 శాతం నడవడికకు కేటాయించే వారు. సాహిత్య పరమైన చిక్కులను, కవిత్వానికి సంబంధించిన పెక్కు సమస్యలను పరిష్కరించడంలో ఆయన అందెవేసిన చేయి.

అనేక పురాతన గ్రంథాలను ఆమూలాగ్రంగా పరిశీలించి, పరిశోధించి సవరించారు. ద్రవిడ భాషలలో ఆయన నిష్ణాతుడు. ఎటువంటి క్లిష్ట సమస్యనైనా సునాయాసంగా పరిష్కరించేవారు. జటిలమైన సమస్యలు ఎదురైనప్పుడు వాటిని పరిష్కరించే వరకు విశ్రమించేవారు కాదు. అసలు గ్రంథాని కన్నా మూడింతలుగా అవతారికలు వ్రాస్తారు. ఆయన విజ్ఞానకునిగా నిరూపించు కున్నారు.

సాధారణంగా పండితులు, విమర్శకులకు మేధస్సు ప్రముఖంగా ఉంటుంది. ప్రభాకర శాస్త్రి పండితుడు, విమర్శకుడు మాత్రమేగాక హృదయ స్పందనగల కవికూడ.

రచనలలో జీవం ఉట్టి పడాలనీ, కరుణారసం తొణికిస లాడాలని,ఆయన అభిప్రాయం. రచనలలో వాడుక భాష ఉపయోగించే విషయంలో ఆయన అభ్యుదయవాది.

ఆయన గొప్ప పరిశోధక విజ్ఞాని. భాష, చరిత్ర, రంగాలలో ఆయన పరిశోధనలు జరిపినారు. వాటన్నిటినీ మించి ఆయన దయా స్వరూపుడు. పూర్వాచార కుటుంబంలో జన్మించినప్పటికీ కుల వర్గ తత్వాలకు అతీతంగా వ్యవహరించారు. అందరినీ సమానులుగానే చూస్తూ హరిజనులతో కలిసి భుజించేవారు.

1916 లో ఆయన ఆరోగ్యం క్షీణించింది. బ్రతుకుపై ఆశ వదలుకున్నారు. కుంభకోణం నివాసి సి. వి. వి. స్వామితో పరిచయం ఏర్పడింది. ఈయన రాజయోగాన్ని ఆచరించేవారు. పూజ పురస్కారంలేదు. మంత్ర పఠనం అంతకంటే లేదు. ఇల్లు, వాకిలి త్యజించాల్సిన పనిలేదు. ఆయన యీ యోగాన్ని అనుసరిస్తూ వందలమందికి నేర్పారు. వేలమంది రోగులకు చికిత్స చేశారు. ఆయన ప్రవర్తన, నడవడి బుద్ధుని గుర్తుకు తెస్తుంది.

## శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రి

(జననం : 1880 ఫిబ్రవరి 20)

పండితులు, సాహితీ దిగ్గంతుల కాలం గతించిపోయింది. మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు ఆ కాలానికి చెందినవారు. బహుశా వారు ఆ కాలంలో కడపటివారేమోగూడా. శ్రీ శాస్త్రిగారు చెర్ల బ్రహ్మయ్యశాస్త్రిగారి శిష్యులు. సుప్రసిద్ధులైన తిరుపతి వేంకట కవుల కూటమిలోనివారు. సూర్యనారాయణశాస్త్రి గారు ఆదిలో అమలాపురంలోని బోర్డు హైస్కూలులో ఉపాధ్యాయులుగా ఉద్యోగంలో ప్రవేశించారు. ఆంధ్రసాహిత్య పరిషత్తులో కొద్దికాలంపాటు పనిచేశారు. రాజమహేంద్రవరంలోని ట్రైనింగ్ కాలేజీలోనూ, అనంతపురంలోని ఆర్ట్సు కాలేజీలోనూ కొంతకాలంపాటు పనిచేశాక పన్నెండేళ్ళపాటు రాజమహేంద్రవరంలోనే ఆర్ట్సు కాలేజీలో ఉద్యోగం చేశారు. తర్వాత ఆంధ్ర విశ్వ విద్యాలయంలో ఒక దశాబ్దంపాటు పనిచేశారు. శ్రీ శాస్త్రిగారు ఆంధ్ర విశ్వవిద్యాలయం సెనేటు సభ్యులు. అకడమిక్ కౌన్సిలు సభ్యులు ఓరియంటల్ ఫెకుల్టీ సభ్యులు. సూర్యనారాయణ శాస్త్రిగారు చాలామంది సంస్థానాలలో ఆస్థాన కవిగా వున్నారు. నలభై యేళ్ళపాటు శాస్త్రిగారు అధ్యాపక వృత్తిలోనేవుండి 1941 లో ఉద్యోగం నుండి రిటైరై గోదావరి వడ్డున ధవళేశ్వరంలో స్థిరపడ్డారు.

మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు పండితుడుగా, రచయితగా, విమర్శకుడిగా, నాటక రచయితగా, అనువాదకుడిగా, వైయ్యాకరణుడుగా ప్రసిద్ధికెక్కారు. వివిధ రంగాలలో తమ ప్రతిభను వ్యక్తంచేసే అనేక గ్రంథాలను రచించారు. 'ఆంధ్ర భాషానుశాసనం' అనే తెలుగు వ్యాకరణ గ్రంథం, 'సంస్కృత కవుల చరిత్ర' అనే గ్రంథం వీరి నిరంతర పరిశోధనాత్మక కృషికి, ప్రతిభావ్యుత్పత్తులకు నిదర్శనం.

వ్యాకరణాన్ని రెండు రకాలుగా కూర్పుచేయవచ్చు. ఒకటి—సైద్ధాంతికమైనది. రెండవది—చారిత్రాత్మకమైనది. మొట్టమొదటిది సాంప్రదాయంమీద ఆధారపడివుంటే, రెండవది భాషా పరిణామంమీద. కాలక్రమేణ వచ్చిన కొత్తకొత్త రీతులను, వాడుకలను విలీనం చేసుకోవడం మీదా ఆధారపడివుంటుంది. సూర్యనారాయణ శాస్త్రిగారు పాతపద్ధతికి చెందిన వారైనప్పటికీ తమ వ్యాకరణ గ్రంథాన్ని చాలా స్వతంత్రంగా, చారిత్రకమైన వాసనను విడనాడకుండా, యించు మించు విప్లవాత్మకమైన మార్పులతో వ్రాశారు.

వీరు 180 గ్రంథాలనుంచి వారి వారి ప్రయోగాలను, వాడుకలను సేకరించారు. తన మాటే ప్రామాణికం కాదని, ఎప్పటికప్పుడు ఆయా దేశకాలపరిస్థితులకు అనుగుణంగా తన గ్రంథానికి మార్పులు, చేర్పులు అవసరమని అతి నమ్రతతో ఆయన చెప్పుకున్నారు.

సంస్కృత కవుల చరిత్రలో వీరు వాల్మీకి మొదలుకొని పద్దెనిమిదవ శతాబ్దంలోని హోసుదుర్గం కృష్ణమాచార్యులు వరకు మొత్తం 312 మంది కవులనుగూర్చి వ్రాశారు. ప్రచారంలోవున్న గాథల్నీ, సాహితీ చరిత్రకారుల భిన్నభిన్న సిద్ధాంతాల్నీ, శాసనాల్నీ ఆధారంచేసుకుని యీ కవుల జీవిత చరిత్రల్ని వ్రాయడం శ్రమతోకూడిన పనే. అయినప్పటికీ మనకు అంతగా తెలియని యీ కవులనుగూర్చి శ్రీ శాస్త్రిగారు విశేషించి కృషి చేసి ఎంతో సమాచారాన్ని మనముందు వుంచారు.

## డా॥ ఎం. ఎస్. ఆనే నిర్యాణం

ప్రసిద్ధ విదర్భ నాయకుడు డాక్టర్ ఎం. ఎస్. ఆనే, జనవరి 26 వ తేదీన బొంబాయిలో మరణించారు. ఆయన వయస్సు 88 సంవత్సరాలు. డా. ఆనేకు ఈసంవత్సరం పద్మవిభూషణ్ బిరుదం లభించింది, ఆయన గొప్ప పార్లమెంటేరియన్. మహారాష్ట్రలో 'లోకనాయక్ ఆనే'గా ఆయనసుప్రసిద్ధుడు. 1880 ఆగష్టు 29 వ తేదీన జన్మించారు. ఆయన లోకమాన్యతిలక్ అనుయాయి. అనేక సంవత్సరాలపాటు ఇండియన్ హోమ్‌రూల్ లీగ్‌కు ఉపాధ్యక్షులుగా వున్నారు. 1921 వ సంవత్సరం నుంచి 1930 వ సంవత్సరం వరకు బిరార్‌ప్రదేశ్ కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడుగా, 1924—25 లో ఒక సంవత్సరంపాటు, 1931—1934 లో మూడు సంవత్సరాలపాటు కాంగ్రెసు వర్కింగ్ కమిటీ సభ్యుడుగా వ్యవహరించారు.

1933 వ సంవత్సరంలో మహాత్మాగాంధీ డా. ఆనేను భారత జాతీయ కాంగ్రెసుకు తాత్కాలిక అధ్యక్షుడుగా నామినేటు చేశారు. అప్పుడాయన సత్యాగ్రహోద్యమానికి నాయకత్వం వహించి అరెస్టు అయ్యారు.

డా. ఆనే 1924 వ సంవత్సరంలో మొదటి సారిగా కేంద్ర శాసన సభకు ఎన్నికై తరువాత జరిగిన మూడు ఎన్నికలలో తిరిగి తమ సభ్యత్వాన్ని నిలుపుకున్నారు. కొంతకాలంపాటు సింహళంలో భారత రాయబారిగా పనిచేశారు. 1948 నుంచి 1952 వరకు బీహారు గవర్నరుగా వున్నారు.

1959 లో లోకసభకు ఎన్నికై 1967 వరకు ఆ పదవిలో వున్నారు. డా. ఆనే రాజకీయాలలోనే గాకుండా మత సంబంధమైన సాంస్కృతికమైన కార్యకలాపాలలో కూడా ప్రముఖంగా పాల్గొన్నారు.

"డాక్టర్ ఆనే గొప్పవ్యక్తి. దేశభక్తుడు" అని ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి అన్నారు.

## శ్రీ హాఫీజ్ మహమ్మద్ ఇబ్రహీం

మాజీ కేంద్రమంత్రి, పంజాబు మాజీ గవర్నరు శ్రీహఫీజ్ మహమ్మద్ ఇబ్రహీం, జనవరి 23 వ తేదీన న్యూఢిల్లీలో మరణించారు. ఆయన స్వాతంత్ర్య పోరాటంలో ప్రముఖ పాత్ర వహించారు. 1941లో నిర్బంధించబడినారు. ఉత్తర్ ప్రదేశ్‌లో 1946 నుంచి 1958 వరకు కేబినెట్ మంత్రిగా వున్నారు. 1958 నుంచి 1962 వరకు కేంద్ర విద్యుచ్ఛక్తి, నీటిపారుదల శాఖా మంత్రిత్వం నిర్వహించారు.

*

# భాగ్యచక్రం

అరికెపూడి కౌసల్యాదేవి



## జరిగిన కథ

శ్రీలక్ష్మి క్రమంగా జ్వరం నించి కోలుకుంది. తిరిగి వెళ్ళిపొయ్యే రోజున శ్రీధర్ ఆమెను పదల లేదు. అబ్బాయిని తను తీసుకు వెళ్తానని, రెండు రోజులుంచి పంపేస్తానని శ్రీలక్ష్మి అన్నది. కాదు కూడదంటే శ్రీనగేష్‌నుకూడా తనతోపాటు రావలసిందని మరీ బలవంతంచేసి బయలు దేరదీసింది. ఓ సాయంకాలం షికారుకు వెళ్ళినప్పుడు శ్రీనగేష్ ఆమెకు తనజీవిత కథను ఓ మిత్రుడికథగా చెప్పడంప్రారంభించాడు.

వక్త స్వరంలో అంతకంతకు విషాదం గూడు కట్టుకొన సాగింది. " డాక్టర్ ! నా స్వగ్రామంలో నా కొక చెల్లెలు వుంది. నేను మినహా ఆమె కెవరూ లేరు. ఈ ఉద్యోగంలో శ్రమించి డబ్బు కూడ బెట్టి. ఇంటికి వెళ్ళిన తర్వాత ఆమె పెళ్ళి చేయాలనుకున్నాను. కాని............కాని నేనే లేకుండా పోతున్నాను, నా చెల్లెల్ని దిక్కులేని దాన్ని చేసి పోతున్నాను.... అదేమై పోతుంది ఈ ప్రపంచంలో ? ప్లీజ్ డాక్టర్ ! ఇవి చేతులు కావు కాళ్ళు. నీ కాళ్ళు పట్టుకుంటాను. నా స్వగ్రామం వెళ్ళి నా చెల్లెల్ని రక్షించు. ఆమెకు అప్పుడప్పుడు ఉత్తరాలలో నీగురించి వ్రాసే వాడిని. నువ్వు ఆమెకు తెలుసు. ఎప్పుడో మంచి సమయం చూచి నిన్ను అడగాలను కున్నాను...............కాని ఇంతలోనే నాకు మృత్యువు ఆసన్నమైంది. డాక్టర్ ! నాకు మాట యియ్యి. నా చెల్లెల్ని రక్షించి వివాహ మాడుతానని మాట యియ్యి. నిశ్చింతగా కన్ను మూస్తాను. లేకుంటే పరలోకం పోయికూడ యిక ఎప్పటికీ నా ఆత్మ శాంతించదు. డాక్టర్...... అంగీకరించు డాక్టర్ ! దైవం నీకు మేలు చేస్తాడు............ డాక్టర్ ! ........."

" మృత్యువు ఆహ్వానాన్ని అరచేత ఉంచుకొని అర్థిస్తున్నాడు అతడు. ఒక వంక మొదటి భార్య మరణంతో, జీవితంపై ఏ ఆశా లేక వున్నాడు నా మిత్రుడు. అదీ కాక, కలుకు దేలిపోయిన హృదయాలతో, నిత్యం హాహాకారాలు వింటూ, దారుణ దృశ్యాలు చూస్తూ, అనుభవించుతూ, అడుగడుగునా మరణించే తోటివారు జీవితపు క్షణభంగురత్వాన్ని గుర్తు చేస్తూండగా ఆ సైనిక జీవుల మనస్సు లెలా వుంటాయో, చిత్త ప్రవృత్తు లెలావుంటాయో మాటలతో వర్ణింప సాధ్యం కాదు.

" అసలే ఆర్ద్ర హృదయుడైన నా మిత్రుడు అవసాన దశలోవున్న తోటి మానవుని అర్థింపును త్రోసివేయలేక పోయాడు. .........తననే భర్తగా ఊహించుకుంటూ ఎక్కడో పల్లెలో వున్న ఆ అమాయిక బాలికను చేపట్టు తానని మాట యిచ్చాడు . ఆ మాటను నెరువేర్చ కున్నాడు కూడా !

" కాని ఒక్కొక్కరి విషయంలో పరిస్థితులు విచిత్రంగా వక్రిస్తాయి. కొన్నాళ్ళపాటు అతడి ద్వితీయ వివాహ జీవితం సక్రమంగానే గడిచినా, మొదటిభార్యాబిడ్డల విషయంలో ఆమె తీవ్రమైన అసంతృప్తిని పెంచకొన్నది. ఆమె ఆబెంగతోనే,

వివాహమైన ఏడాదిలోపుననే మరణించింది.......ఈ సంఘటనలు అతనిని మానసికంగా క్రుంగదీశాయి. అతి సన్నిహితులు సైతం అతడు మోసగాడనీ, అతడిని వివాహం చేసుకున్న స్త్రీలు బాధలు భరించలేకనే చనిపోతున్నారనీ వ్యాఖ్యానించి వదంతులు వ్యాపింప జేశారు. నీతీ నిజాయితీలకు ప్రాధాన్య మిచ్చే అతడు ఈ నిందలనూ, బాధలనూ భరించలేక పోయాడు. బిడను మంచి శిక్షణ యిచ్చే ఒక కేంద్రంలోజేర్చి తాను స్వగృహానికి తిరిగి వచ్చాడు. దేశం ఆత్యయిక స్థితిని దాటింది. అదీకాక అతనికి మనశ్శాంతి దొలిగా దూరమయింది. అందుకే తిరిగి పూర్వపు ఉద్యోగం లోకి ఉత్సాహంగా ఉరకలేక పోయాడు.

"అయితే అతడు ఆశించిన మనశ్శాంతి యింటిదగ్గరకూడ అతడికి కరవైంది. 'దేశమాతకు' సేవ చేయడానికి యిు కా పుత్రులున్నారు. నాకుమాత్రం నీవుమినహా ఎవరులేరు. ఈ యింటికి వెలుగును ప్రసాదించి ఈ గృహభారంనుండి నాకు విముక్తిని ప్రసాదించు' అని నిత్యం వేదిస్తుంటుంది తల్లి. అతడి కసలు ప్రపంచం పైననే విసుగ్గావున్నది. ఒకవంక వంచకుడనే బిరుదువున్నది. తనను వివాహ మాడినస్త్రీ, పూర్వం ఇద్దరిలాగే పరలోకయాత్ర చేయగలదనే భయం అతడిని అంతరాంతరాలలో వేదిస్తున్నది. కేవలం ఆ తల్లికొరకూ, తన కుమారుని కొరకూ మొండిగా జీవిస్తున్నాడు. అలాగే వారికోసమే అర్ధాంగి కూడ అవసరమని అనుక్షణం తల్లి ఉపదేశం. కాని చూస్తూచూస్తూ ఏ కన్య జీవితాన్ని ఉసురు పెట్టడానికీతడికి మనస్కరించదు!"

"పాపం! ఇందులో అతగాడి తప్పేముందండీ! నచ్చిన కన్యను మళ్ళీ వివాహం చేసుకోవడమే మంచిది. లేకుంటే ఆ పసి బాలునీ, వృద్ధాప్యదశలో ఉన్న ఆతల్లిగారినీ ఎవరు చూస్తారు? గ్రుడ్డిలోకం ఏమనుకొంటే ఏం? అంతటి ఉత్తముని ఏ తెలివైన కన్యా తృణీకరించదు, నిజం తెలిసి." శ్రీలక్ష్మి ఒక విధమైన ఆవేశంతో అన్నది.

ఆమె వదనం వైపు నిశితంగా చూస్తూ గంభీరంగా నవ్వాడు శ్రీ నగేష్.

"ఏమండీ నవ్వుతారు?"

"ఏముంది? మీ సమస్యకు జవాబు మీరే చెప్పేశారు!"

అంతవరకూ కథా శ్రవణంలో లీనమైపోయిన శ్రీలక్ష్మి శ్రీనగేష్ మాటలతో ఆ సంభాషణ యొక్క అర్థసందర్భాలను గుర్తించింది. "అయితే మీరు చెప్పినదంతా కట్టు కథేనా? నిజం కాదా?" అని ప్రశ్నించింది తనను తాను సంబాళించుకుంటూ.

తల విదిలించాడు శ్రీ నగేష్. "కట్టు కథ ఎంతమాత్రం కాదు. పూర్తియథార్థం, మీ సమస్యతో సామ్యం కలదనే చెప్పాను. అంతే. ఏవో జరుగుతాయి, అదృష్ట దురదృష్టాలు పెనవేసుకు పోయిన త్రాడు వంటి ఈ జీవితంలో ఏ ఒక్కరిపైనా నెపం పూర్తిగా ఆరోపించ వలసిన పనిలేదంటాను. అంతే. త్రాటికి బాగా పురి ఏర్పరచి, గట్టిగా తనచేత పట్టుకొన్న సూత్రధారి పైన వున్నాడు. మన నిర్ణయాలతో అవసరంలేదు. త్రాటిలో ఒక సూత్రం తెగిపోతే ఫర్వాలేదు. అంత మాత్రాన అన్ని సూత్రాలూ వదులైతే పురి విడిపోతుంది."

"నిజమా?"

"అక్షరాలా."

"కృతజ్ఞురాల్ని, నిజంగా చాలా సున్నితమైన ధోరణిలో మీరు సమస్యా పరిష్కారం చేశారు, కృతజ్ఞురాలను!"

పరిసరాలు గుర్తించినట్లు అన్నాడు శ్రీ నగేష్, "ఏరీ పిల్లలు? మరి మనం వెళ్దామా? సాయంత్రమై పోయింది"

తల వాల్చి యేమో ఆలోచించు కొంటూన్న శ్రీ లక్ష్మి మాట్లాడ లేదు. "మిమ్మల్నొకక్క విషయం అడగనా? చెప్తారా?"

"ఏమిటది?"

సూటిగా చూస్తూ అడిగింది శ్రీలక్ష్మి. "ఇది మీ ఆప్త మిత్రుని కథా? లేక మీ ఆత్మ కథా?"

"........."

"ఆ డాక్టరు మీరేకదా?"

"అవును." అనలేక అనలేక అన్నాడు శ్రీనగేష్. "ఈ విషయాలు యిదివరకే మీకుచెప్పాలనుకున్నాను. కాని వీలుపడ లేదు. ఇప్పటికి సందర్భం కుదిరింది. అంతావిన్నాక అసహ్యంగా వుందా?"

విశాలనయనాలను పైకెత్తి సునిశితంగా, అందంగా అతడి నేత్రాల్లోకి చూచింది శ్రీలక్ష్మి. మీపై గౌరవం యినుమడించింది. మిమ్మల్ని తృణీకరించిన మీమేనమామ కుమార్తె ఎంతమూర్ఖురాలోనని అనుకుంటున్నాను."

అంతలో ఆడుకుంటున్న పిల్లలు పరుగెత్తుకుంటూ వచ్చారు. శ్రీధర్ శ్రీలక్ష్మి ఒడిలో పడుకున్నాడు, "ఆకలేస్తోంది. కాఫీ." అంటూ.

ఫ్లాస్కులో కాఫీ ముగ్గురికీ యిచ్చి శ్రీ నగేష్‌కుకూడా అందిస్తూ అతడి పరధ్యానతను గుర్తించింది శ్రీలక్ష్మి. "ఏమిటాలోచిస్తున్నారు?" అని మృదువుగా ప్రశ్నించింది అతడిని, తనఒడిలో పడుకున్న శ్రీధర్ తల నిమురుతూ.

విన్పించుకోనట్టే శ్రీ నగేష్ శ్రీధర్‌ను చూస్తూ అన్నాడు: "లేబాబూ. వెళ్ళిపోదాం, అమ్మ నిన్ను చూడాలంది."

అతడి లెఖ్ఖ లేనట్టు శ్రీధర్ శ్రీలక్ష్మిని పట్టేసుకున్నాడు. "నువ్వూవస్తావా మరి? నువ్వవస్తేనే నేను వెళ్ళేది." సజల నేత్రాలనుపైకెత్తింది శ్రీలక్ష్మి. "ఈ బంధాన్నిలా శాశ్వతం చేయండి! మరి కాదనవదు." అన్నది శ్రీ నగేష్‌తో అర్థింపుగా.

"లక్ష్మీ!" శ్రీ నగేష్ స్వరంలో విస్మయం, విచారం తాండవించాయి.

"అవును. ఒక్కమాట కూడా కాదని అనవద్దు. మనం బాగా ఒకరి నొకరం అర్థం చేసుకొన్నవారం; ఒకరిపై ఒకరికి గౌరవ మర్యాదలున్నాయి; అలాగే ఒకరిపై ఒకరికి సానుభూతి కూడావున్నది....... మీ కుటుంబ జీవనంలో సహచరిణిగా వుండి మీ యింట నేడు లేని సుఖసంతోషాలను అందించడానికీ, మీ కుమారునికి తల్లిగా, మీ తల్లిగారికి సేవకురాలిగా వుండడానికీ ప్రయత్నిస్తాను. మీ ఆదర్శ జీవితంలో చేదోడు వాదోడుగా వుండి మీ "భాగ్యచక్రం" పరిభ్రమణాన్ని సక్రమం చేయడానికి సదా మీతోబాటు సాయశక్తులా కృషిచేస్తాను!"

"తథాస్తు! దైవేచ్ఛ." ఆకసం దెస దృష్టిసారించి ఆ శ్రీనివాసుని స్మరించి నమస్కరించాడు శ్రీ నగేష్.

శ్రీలక్ష్మి నేత్రాలు ఆనందంతో మెరిసి పోయాయి. సంతోషాతిరేకంతో మాట్లాడలేక పోయింది.

"ఏమిటంటున్నావ్ ?" అర్థంగాక శ్రీలక్ష్మిని ప్రశ్నించాడు శ్రీధర్.

"ఏమిటా ? మీ యింటికి వచ్చేస్తానంటున్నాను, రమ్మంటావా?" ఒడిలో శ్రీధర్‌ను చేతులతో ఎత్తి ముద్దాడుతూ అడిగింది శ్రీలక్ష్మి గోముగా.

"నిజం!" మహాపెన్నిధి లభించిన మహోత్సాహానందాలతో కనులు చక్రాల్లాగ త్రిప్పుతూ ప్రశ్నించాడు శ్రీధర్, సంతోషంతో లేచి నాట్యంచేశాడు.

"వస్తాను కాని, ఒక షరతు!" తెచ్చిపెట్టుకున్న గాంభీర్యం ప్రదర్శించింది శ్రీలక్ష్మి." నేను చెప్పినట్టు వినాలి."

"ఓ! ఇప్పుడు వినడం లేదూ?"

"నన్ను 'అమ్మా!' అని పిలవాలి !!"

"ఆ!!!". ఈ నూతన విషయం చిన్నారి శ్రీధర్ మదిలో కొంత అలజడిని లేవదీసిందనే చెప్పాలి. మరి నాకు ఇంటిదగ్గర అమ్మవుందిగా? ఆ ఆలోచనతో కళ్ళు అందంగా కదులాడాయి. "అవును. నేను యింకో అమ్మని. రమ్మంటావా, వద్దంటావా? నువ్వు నన్ను 'అమ్మా' అని పిలుస్తూ ఇలాగే బుద్ధిగా నామాట వింటూంటేనే వచ్చి మీ ఇంట్లో వుంటాను!"

మరి ఆలోచించలేదు శ్రీధర్. "అలాగే, అలాగే పిలుస్తాను. ఇప్పుడే పిలుస్తాను. అమ్మా! అమ్మా! వచ్చి మాఇంట్లోనే వుండమ్మా. నువు చెప్పినమాట వింటానమ్మా.

సంతోషాతిశయాలు ముప్పిరిగొన్న శ్రీలక్ష్మి శ్రీధర్‌ను అక్కున జేర్చుకు ముద్దాడింది.

పలు భావాలతో అంతరంగం క్రక్కదిలి, కనులలో నీరు నిలువగా శ్రీనగేష్ తన దృఢ హస్తాలను ముందుకుచాచి శ్రీధర్‌తో సహా శ్రీలక్ష్మిని దగ్గరకు తీసుకున్నాడు. మాటలకందని మమతాను రాగాలతో మనసులు పెనవైచుకుపోగా వాతావరణం మూగదై పోయింది. ఆ మహత్తర కలయికను అభినందించుతూన్నట్టు ఎక్కడో కోయిల రాగాలాపన కావించింది.

* * *

"కొన్నాళ్ళు నువ్వూ, జయా నాదగ్గరుండి వెళ్ళండి అన్నయ్యా. ఇంతతొందరగా వెళ్ళిపోవడమేమిటి? నీ మనస్సు బాగా కుదుట పడినతర్వాత నెమ్మదిమీద వెళ్ళవచ్చు."

శ్రీదేవి మాటలకు ఎటూ చెప్పలేని స్థితి శ్రీపతి ముఖంలో వ్యక్తమైంది. కుమార్తెవైపు చూచాడు. జయశ్రీ ముఖం రోషారుణ వర్ణం దాల్చి వున్నది. బలవంతాన మౌనందాల్చి వున్నట్టు ఆమె ముఖం స్పష్టంగా ద్యోతకమౌతున్నది.

"మీ నాన్న యింకా కొద్ది రోజులు ఈ ప్రశాంత వాతావరణంలో వుంటే మంచిదని అబ్బాయికూడా అంటున్నాడు. జయా ఏం మించిపోయిందని ఇంతతొందరగా వెళ్ళిపోవడం? ఇన్నాళ్లున్న వాళ్లు మరో రెండునెలలే వుండలేరా?" ఈసారి మేన కోడలితో అన్నది శ్రీదేవి.

నిర్లక్ష్యంగా నవ్వింది జయశ్రీ. వెక్కిరింపుగా అన్నది. "మరో రెండు నెలలుకాదు. రెండు రోజులు గూడా వుండలేను. అదెంత కష్టమో, కుర్రాళ్ళ మనోగత భావాలూ, ఆశలూ ఎలా వుంటాయో ముసలాళ్ళకేం తెలుస్తాయి?" ఆవేశంతో తల ప్రక్కకు విసిరింది.

బాధ్యతా అప్యాయతలు నిండిన తన సలహానూ, తన పెద్దరికాన్నీ మేనకోడలు అంత అవలీలగా, అవివేకంగా తృణీకరించ గలదని అసలు అనుకోని శ్రీదేవి నివ్వెరపోయి తేరుకోవడానికి కొన్ని నిముషాలు పట్టింది. కాని ఆమె క్షమా హృదయంలో జయశ్రీపై జుగుప్సా క్రోధాలు రగుల్కొలేదు. పిన్నవయస్క, అనుభవహీన. అవివేకి అయిన ఆమె వాచాలతను మిడి మిడి జ్ఞానపు పసిపిల్లల వచ్చీరాని మాటలుగా క్షమించి, నవ్వుకున్నది శ్రీదేవి విశాలహృదయం.

( సశేషం )

# మహాశివరాత్రి మహిమ

రోహిణి వెంకయ్య

ప్రతి నెలా బహుళ త్రయోదశినాడు శివరాత్రి వస్తుంది. మాఘ బహుళ త్రయోదశినాటి శివరాత్రి మహా శివరాత్రి. దానికి విశేష మహత్తు ఉంది.

ప్రత్యంత రాష్ట్రంలో లుబ్ధకుడనే బోయవాడు ఉండేవాడు. అతనికి వేట తమకం విపరీతం. అతడు అప్పుల పాలయ్యాడు. సాహుకారు అతనిని ఒక శివాలయంలో బంధించాడు. ఆ నాడు శివరాత్రి. రోజంతా భోజనం లేదు. ఆలయానికి వస్తూపోతూ ఉన్న భక్తులు శివ శివ అంటూ ఉంటే నిరంతరమూ ఆ భగవన్నామమే లుబ్ధకుని చెవులలో పడుతూ ఉంది. కొందరు భక్తులు బోయవాని అప్పు తీర్చి అతనిని విడుదల చేయించారు. అతడు వెంటనే వేటకు బయలు దేరాడు. దారి పొడవునా శివ శివ అనే శబ్దమే వినిపిస్తూ ఉంది. అడవిలోకి వెళ్ళి ప్రజల పిచ్చిని తలుచుకొని శివ శివ అని వెక్కిరించడం మొదలు పెట్టాడు.

జింకలు, అడవి పందులు, ఇతర మృగాల అడుగు జాడలు కనబడ్డాయి. వాటి వెంట వెళ్ళాడు. ఒక్క మృగమైనా చిక్కలేదు. విసిగి ఒక చెట్టు ఎక్కి కూర్చున్నాడు. అది మారేడు చెట్టు. ఆ చెట్టు క్రింద ఒక గుప్తలింగం ఉంది. తన కంటికి అడ్డు తగులుతున్న ఆకులు కోసి క్రిందికి విసరడం మొదలు పెట్టాడు. అవి శివలింగం మీద పడుతున్నాయి. ఊళ్లో భక్తులు శివ శివ అని అరిచిన అరుపులు జ్ఞాపకం వచ్చాయి. హి హి హి శివ శివ శివ అంటున్నాడు. పగలంతా ఉపవాసం. శివునికి అత్యంత ప్రియమైన మారేడు ఆకులు త్రుంచి క్రిందికి విసరడం, అవి శివలింగం మీద పడడం, వేళాకోళానికి శివ శివ అనడం–ఇలా ఒక జాము గడచి పోయింది. అనుకోకుండా జరిగిన ఈ శివపూజవల్ల బోయవాని పాపాలలో నాల్గవవంతు హరించి పోయింది.

అంతలో ఎదురుగా ఉన్న సరస్సులో నీరు తాగడానికి ఒక ఆడులేడి వచ్చింది. అది చూలుతో ఉంది. వేటకాడు దానిని చూచాడు. బాణం ఎక్కు పెట్టాడు. ఆశ్చర్యం! అది మనుష్య భాషలో మాట్లాడడం మొదలు పెట్టింది. "నా ప్రాణం ఎందుకు తీస్తావు?" అని అడిగింది. "మాట్లాడే లేడిని ఎప్పుడూ చూడలేదు. నీ సంగతి ఏమిటి?" అని అడిగాడు లుబ్ధకుడు. లేడి తన కథ వినిపించింది. "నేను ఒక అప్సరసను. కర్మం కొద్ది ఒక రాక్షసుని వివాహ మాడాను. మోహపరవశనై నిరంతరమూ అతనితోనే ఉండడంవల్ల శివ భగవానుని ఎదుట నృత్యంచేసే నా విధికి భంగం కలిగింది. మహా దేవుడు శపించాడు. 'దేవతలూ దేవాంశ సంభూతులూ ఎందరో ఉండగా ఒక రాక్షసుని మోహించావు. సిగ్గు మాలిన నువ్వు అడవులలో దిగంబరంగా సంచరిస్తావు. నువ్వు ఒక ఆడ జింకగా జన్మిస్తావు. దేవకన్యకు మరులు గొలిపిన ఆ దుష్ట రాక్షసుడు నల్లని మగలేడిగా పుట్టుతాడు. రాత్రి పగలు నీ వెంట పడి తిరుగుతూ ఉంటాడు. ఈ రీతిగా పన్నెండు సంవత్సరాలు గడుస్తాయి. ఆ తరవాత ఒక లింగం సమీపంలో కూర్చొని ఉన్న ఒక బోయవాడు నిన్ను కొట్టడానికి బాణం ఎక్కు పెడతాడు. అప్పుడు నీకు లేడి జన్మ నుంచి విమోచనం కలుగుతుంది.' అని సెలవిచ్చాడు శంకర భగవానుడు. ఓ వ్యాధుడా, నా కడుపులో బిడ్డ ఉంది. నా శరీరం కృశించి ఉంది. నన్ను చంపితే నీకు ఏమంత ఆహారం దొరకదు. ఇంకా కొంచెం సేపటిలో ఇక్కడికి ఇంకొక జింక వస్తుంది. అది వయస్సులో ఉంది. కొవ్వి ఉంది. ఆ తరవాత ఆ నల్ల మగలేడి కూడా వస్తుంది. ఆ రెంటి వల్ల నీకు పుష్కలంగా ఆహారం లభిస్తుంది. ఈ ప్రస్తావన నీకు నచ్చకపోతే ఒక్కమాట: నా గర్భంలోని పిండం భూమి మీద పడే సమయం సమీపించింది. నేను ఇంటికి వెళ్ళి బిడ్డను కని ఆ బిడ్డను చుట్టపక్కాలకు అప్పగించి తిరిగి వస్తాను. నా శరీరంలో ఉన్న స్వల్ప మాంసంతోనే సంతృప్తి పడుదువు గాని."

బోయవాడు ఆలోచనలో పడ్డాడు. ఆడు జింకచేత ప్రమాణము చేయించి దానిని పోనిచ్చాడు. మళ్ళీ ఏకాంతం ఆవరించింది. మళ్ళీ శివనామోచ్చరణ. అప్రయత్నంగా మారేడు పత్రాలు తుంచడం, కింద ఉన్న గుప్త లింగం మీద విసరడం. నిద్ర రావడంలేదు. అర్ధ రాత్రి అయింది. ఒక ఆడ జింక పడుచు దనపు బులుపు, నిగారంతో చెలికాని వెతుకుకొంటూ వచ్చింది. బోయవాడు బాణం ఎక్కుపెట్టాడు.

"ఆగు వ్యాధ రాజా, ఆగు. ఒక్కమాట. ఇంకొక ఆడ జింక ఈదారిన వెళ్ళిందేమో చూచావా? కాస్త చెప్పు." ఈమాట విన్న బోయవానికి మళ్ళీ ఆశ్చర్యం వేసింది. "ఆఁ, ఆజింక ఇంతకుముందే ఇంటికి పోయింది. తనకు బదులు నిన్ను పంపి ఉంటుంది. నాకు విపరీతంగా ఆకలి వేస్తూ ఉంది. దేవుని తలుచుకో. ఇక నీప్రాణం తీయకతప్పదు." బోయవాని మాటలు విన్నలేడి కంట నీరుపెట్టుకొని ఇలా అంది. "అయ్యా, చంపవద్దు. సాగిలుపడి మొక్కుతాను. ఇది ఋతుసమయం. ఈ స్థితిలో ఉన్న ఆడదానిని చంపడం పాపం. నన్ను కాస్త సుఖం అనుభ

వించనీ. కొంతసేపటిలో ఒక పెద్ద నల్లని మగలేడి బాగా కొవ్వినది ఇటు వస్తుంది. దానిని చంపితే నీకు ఆకలి తీరుతుంది."

బోయవాడు మళ్ళీ సందిగ్ధంలో పడ్డాడు. తిరిగి వస్తానని ఆ జింకచేత ప్రమాణంచేయించి దానిని పంపివేశాడు. మళ్ళీ ఒంటరితనం. శివ శివ శివ శివ అనుకున్నాడు. మారేడు దళాలు అప్రయత్నంగా తుంచి కింద పడవేస్తున్నాడు. వాని పాపాలలో సగం హరించి పోయాయి.

నల్లలేడి తన జతను వెతుక్కొంటూ వచ్చింది. మిస మిస లాడే యవ్వనం. పుష్టిగల ఒళ్ళు. బోయవాడు బాణం ఎక్కు పెట్టాడు. లేడి బిగ్గరగా అంది: "ఎంత పని, నేను ఏం పాపం చేశాను? ఈ విరహవేదనలోనే ఈ శరీరం విడిచిపెట్టవలసినదేనా! ప్రియా వియోగం దుస్సహం. సహధర్మచారిణి సహవాసం లేని పురుషుని జీవితం వ్యర్థం." కొంచెం స్మృతి తెచ్చుకొని లేడి బోయవానిని చూచి ఇలాఅంది: "అయ్యా, రెండు ఆడజింకలు ఈ దారిని వెళ్ళాయేమో నీకంటపడ్డాయా? వాటిని నీవు చంపివెయ్యలేదుకదా. దయచేసి నిజంచెప్పు." బోయవాడు సమాధానం చెప్పాడు "వెళ్ళాయి. చూశాను. అవి ఇక్కడికి తిరిగి వస్తామని ప్రతిజ్ఞ చేసి మరీ వెళ్ళాయి. అవి పంపగా వచ్చావా నువ్వు?" "ఋతుపులో ఉన్న నాప్రియురాలి మనోరథం తీర్చి నేను తిరిగి వస్తాను. ప్రమాణం చేసి చెప్పుతున్నాను." అంది మగలేడి. దానిని విడిచి పెట్టక తప్పలేదు బోయవానికి.

మళ్ళీ నిశ్శబ్దత. నోటిలో శివనామం, చేతిలో మారేడు దళాలు. కంటికి కునుకు రాలేదు. బోయవాని పాపాలు పూర్తిగ దగ్ధం అయిపోయాయి. సూర్యోదయం అయింది. ఒక ఆడజింక తన పిల్లలను వెంటబెట్టుకొని వచ్చింది. బోయవాడు అప్రయత్నంగానే బాణం ఎక్కు పెట్టాడు. జింక మాట్లాడడం మొదలు పెట్టింది: "ఆగు ఆగు, ఓ పుణ్యమూర్తీ! నిద్రపోతున్న, పాలు కుడుపుతున్న, వ్యాధి బాధితమైన సంతానంతో వచ్చిన జంతువును చంపకూడదని ధర్మశాస్త్రాలు చెప్పుతున్నాయి, ఈ ధర్మానికి విరుద్ధంగా నన్ను చంప దలుచుకుంటే కొంచెం ఆగు. ఈ బిడ్డలను బంధుమిత్రులకు అప్పగించి దైవసాక్షిగా తిరిగి వస్తాను"

అంతా అగమ్యగోచరంగా ఉంది లుబ్ధకునికి. ఏమి పాలుపోని పరిస్థితి. ఇంటికి పోయాడు. తన జీవితంలో చేసిన హింసా కొండ అంతా కంటిఎదట కనబడుతూఉంది. ఇంటిల్లిపాదీ ఆకలికి నకనక లాడుతున్నారు. దిక్కు తోచడంలేదు.

నల్లలేడి ఇంటికి వెళ్ళింది. ఒక పెంటి ప్రసవించింది. ఋతువులో ఉన్న రెండవ పెంటికోరికను నెరవేర్చింది. తాను బోయవానికి ఇచ్చిన వాగ్దానాన్ని తన కుటుంబానికి తెలియజేసింది. మగలేడికి, ఆడలేళ్ళకూ మధ్య ధర్మచర్చ జరిగినది. తాను గృహస్థధర్మాన్ని నెరవేర్చడానికి వచ్చానని, సత్యవాక్య పరిపాలన కోసం బోయవాని దగ్గరికి తిరిగి వెళ్ళవలసి ఉందని చెప్పింది మగలేడి. భార్యలకు, పిల్లలకు చెప్పవలసిన నీతులన్ని బోధించి ప్రయాణానికి సిద్ధంఅయింది. భర్తలేని బ్రతుకు వ్యర్థమనీ, వైధవ్య జీవనం దుర్భరమనీ, భర్తతోడిదే బ్రతుకైనా, చావైనా అనివాదించి భర్త వెంటపడింది ఆ మృగీరత్నము.

ధర్మ సంకటంలో పడ్డాడు లేడిరేడు. తన ప్రతిజ్ఞ నిలబెట్టుకోవాలంటే కుటుంబం నిర్మూలం ఐపోతుంది. కుటుంబాన్ని రక్షించుకుందామంటే సత్య పాలనకు భంగం కలుగుతుంది. తాను, తన కుటుంబమూ నశించి పోయినాసరే సత్యాన్ని పాటించక తప్పదు. "జయ శంకరా" అని కుటుంబం యావత్తు బయలు దేరింది.

అక్కడ మళ్ళీ తగువు వచ్చింది. మగలేడి తాను ముందుగా బలి అవుతానంటుంది. నేను ముందు అంటే నేనుముందు అని ఆడలేళ్లు ఎగబడ్డాయి. నేను అసలు ఎవరి ప్రాణము తీయనే తీయను" అన్నాడు లుబ్ధకుడు.

ఈ రసమయ ఘట్టంలో దేవ దుందుభుల ధ్వని వినబడింది. పుష్పవర్షం కురిసింది. అందంగా ఒక విమానం క్రిందికి దిగింది. ఆపుణ్య జీవులను కైలాసానికి తీసుకొని వెళ్ళడానికి శివ దూతలు ప్రత్యక్షమయ్యారు. ఆ జీవులకు ఆకాశంలో స్థానాలు ఏర్పడ్డాయి. బోయవానికి లుబ్ధక (మృగవ్యాధ) నక్షత్ర రూపం కలిగింది. జింకలు మృగ శీర్షా నక్షత్రంగా రూపొందాయి.

తిండి దొరకక పస్తుపడి ఉండిన బోయవాడు ఉపవాసం చేసినట్లయింది. వేట తమకంలో నిద్రపట్టని ఆ బోయవానికి జాగరణ చేసినపుణ్యం లభించింది. వెక్కిరింతకు శివశివ అంటే అది శివ మంత్ర పఠనమే అయింది. కంటికి అడ్డంగా ఉన్న మారేడు ఆకులను త్రుంచి క్రిందికి పడవేస్తూ ఉంటే గుప్తలింగం మీదపడి బిల్వ పత్రం పూజా ఫలం ప్రాప్తించింది. అబుద్ధిపూర్వకమైన ఈ కర్మవల్ల శివరాత్రినాడు శివపూజాఫలం సిద్ధించింది. మహాశివరాత్రి మహాత్మ్యం అలాంటిది.

---

# కూచిపూడి నృత్యం

తంజావూరు ప్రాంతంలో వ్యాప్తిలోవున్న భరతనాట్యం, కేరళలోని కథాకళి, అస్సాంలోని మణిపురి, ఉత్తర హిందూ దేశంలోని కథక్ నృత్యాలే యింతవరకూ పురాతన హిందూ నృత్యాలుగా ప్రాచుర్యం పొందాయి. విచిత్ర మేమంటే అన్నివిధాలుగా సంపూర్ణంగావుండి, చక్కటి నృత్యబాణీగల ఒకానొక పురాతన హిందూ నృత్యానికి యిటీవలి కాలం వరకూ దానికి రావలసినంత ఆదరాభిమానాలూ, గుర్తింపూరాలేదు. దాక్షిణాత్య నృత్యకళకే ఆధారమనదగిన యీ నృత్యం మొన్నమొన్నటి వరకూ విస్మరింపబడుతూనే వచ్చింది. ఆ నృత్యమే ఆంధ్రుల ప్రత్యేక నృత్యం— ఆంధ్రుల ప్రత్యేక నృత్యకళ అని చెప్పదగిన కూచిపూడినృత్యం.

కూచిపూడి ఒక చిన్నగ్రామం. మచిలీపట్టణానికి పదిమైళ్ళ దూరంలో కృష్ణానది వడ్డున ఈ గ్రామంవుంది.

గోలుకొండ ప్రభువులలో కడపటివాడైన అబుల్‌హాసన్ తానాషా ఈ గ్రామాన్ని కూచిపూడి భాగవతులకు శాశ్వతంగా బహూకరించినట్లు చెప్తారు. అబుల్‌హాసన్ కళాప్రియుడు మాత్రమేకాక కళాపోషకుడుకూడా.

కూచిపూడిలో అన్నీ బ్రాహ్మణకుటుంబాలే వున్నాయి. ఈ కుటుంబాలలో పుట్టే ప్రతి బాలుడికి ఆడవారిలాగ చెవుపోగులు, ముక్కుపుటాలు కుట్టించడం ఒక ఆచారంగా వస్తున్నది. కాళ్ళకు గజ్జెలు కట్టి లాస్య ప్రధానమైన స్త్రీల నృత్యాన్ని నేర్పుతారు. తమ జీవితకాలంలో వీరు ఒక్కసారైనా నటరాజస్వామి వారి ఆలయంలో దేవుని ఎదుట నృత్యప్రదర్శన యివ్వవలసి వుంటుంది. కూచిపూడి నృత్యానికి మూల పురుషుడైన సిద్ధేంద్రయోగి ఈ విధమైన సాంప్రదాయాన్ని ఆగ్రామంలో నెలకొల్పారు. దీనిని అతిక్రమించితే అట్టివారు విపరీత పరిణామాలకు లోనవుతారని ఆయన హెచ్చరించారు. తదనుగుణంగానే క్రమం తప్పక యీ సాంప్రదాయాన్ని పాటిస్తూ వస్తున్నారు. ఇతర కళలమాదిరిగానే కూచిపూడి నృత్యకళకూడా వంశపారం పర్యంగా తండ్రినుంచి కొడుకుకు సంక్రమిస్తూ వస్తున్నది. ఆంధ్రుల యీ ప్రత్యేక నృత్యకళను వంశపారంపర్యంగా పరిరక్షించుకుంటూ వస్తున్నారు కూచిపూడి బ్రాహ్మణ కుటుంబాలవారు.

కూచిపూడి నృత్యం భరతనాట్యానికి మూలాధారమైనది. కూచిపూడి నృత్యకళలోంచి విడివడి మరికొన్ని కూర్పులు, చేర్పులు పొందిన ఈ అచ్చమైన దేశీయకళ, దేశకాల పరిస్థితుల కనుగుణంగా రూపాంతరంచెంది భరతనాట్యంగా ప్రభవించింది. ఈ భరతనాట్యం తంజావూరు నాయకరాజుల కాలంలో అత్యున్నత



ఒక కూచిపూడి కళాకారుడిని సన్మానిస్తున్న జనసంబంధ శాఖా మంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ

వైభవ శిఖరాలను అందుకుంది. విజయనగర సామ్రాజ్యం పతనం కావడంతో ఆంధ్రులు తంజావూరు, మధురలలో రాజ్యాలను స్థాపించినప్పుడు వారు తమవెంట కవులను, శిల్పులను, నర్తకులను తీసుకొనివెళ్ళారు. అప్పుడే కూచిపూడి నృత్యకళ తంజావూరుకు తరలివెళ్ళింది. భరతనాట్యంలోని అభినయ భాగానికి సాహిత్యాన్ని అందించినది సుప్రసిద్ధ తెలుగు సంగీత విద్వాంసుడూ, కవీ అయిన క్షేత్రయ్య అనేవిషయాన్ని విస్మరించ తగదు. క్షేత్రయ్య కూచిపూడికి మైలున్నర దూరంలోని మొవ్వ గ్రామవాసి.

కూచిపూడి నృత్యంలో భామాకలాపం, గొల్లకలాపం, దశావతారనృత్యం, గణపతికవుతం; జయదేవుని అష్టపదులకు నారాయణతీర్థుల తరంగాలకు, క్షేత్రయ్య పదాలకు అభినయ పూర్వకమైన అర్థవివరణ; పద్ణాలు, జతిస్వరాలు, తిల్లానాలు వున్నాయి. స్వర్గలోకం నుండి పారిజాత కుసుమాన్ని శ్రీకృష్ణుడు తీసుకొనివచ్చే యితివృత్తం భామాకలాపం. గొల్లకలాపంలో ఒక బ్రాహ్మణునికి, పాలమ్ముకునే స్త్రీకీ మధ్య జరిగే సంభాషణ అర్థవంతంగా వుంటుంది. శ్రీమహావిష్ణువు దశావతారాలను అభినయ పూర్వకంగా ప్రకటించే నృత్యం దశావతారనృత్యం.

కూచిపూడి నృత్యానికి ఉపయోగించే రంగస్థలం కూడా ఈ నృత్యంవలె అతి నిరాడంబరంగా వుంటుంది. రంగస్థలం వెనుక పృష్ఠభూమిగా నల్లని తెరవుంటుంది. ఇద్దరు గ్రామ చాకళ్ళు రంగస్థలానికి అటూయిటూ నూనె దివిటీలు పట్టుకుని ప్రదర్శన ఆసాంతం ఓపిగా నిలుచుని వుంటారు. సాధారణంగా యీ ప్రదర్శన తెల్లవార్లూ వుంటుంది. రంగురంగుల వస్త్రాన్ని ఒకదానిని అవసరాన్నిబట్టి రంగస్థలానికి ముందు భాగాన పట్టుకుని తెరగా వుపయోగిస్తుంటారు. ప్రక్క తెరలు యికవుండవు. పృష్ఠభూమి మార్చడం అసలేవుండదు. ఆధునిక రంగస్థలంలో నటుడ్ని, నటనా ప్రతిభనూ మ్రింగేసే రకరకాల ట్రిక్కులు యిందులో వుండవు. అయినప్పటికీ యీ రంగస్థలం మీదనే కూచిపూడి

సాహితీ సదనం

# నేను

— వరవరరావు

అద్భుతమయిన స్వప్నాలని పూస్తున్నాను
అర్ధనగ్న సౌందర్యాలని చూస్తున్నాను
అరవిచ్చిన కోర్కెల పరిమళాలు వీస్తున్నాను.

అధ్వాన్నమయిన అధోలోకంలో కూలిపోయి
అన్నంలో మట్టి పెల్లలు అట్టే పట్టించుకోరాదు
తిన్ననాడు రాయడానికి క్షుధోద్రేక కవితరాదు
కాఫీలో జాగరీ వేస్తున్నారో జగ్లరీ చేస్తున్నారోకాస
జాపళీ గీతాల మాధుర్యాన్ని రుచిచూస్తున్నాను.

దుమ్ము గొట్టుకు పోతున్న బజార్లలో
ఊర్ధ్వ లోకాల్లోకి, ఊహాగానాల్లోకి చూస్తూ
రోరిచ్ రోచిర్వర్ణ హిమాలయాలమీంచి
మంచులా, వెలుగులా జారిపోతున్నాను.

ఈ ఊళ్ళో ఆడుతున్న 'హంతకుడెవరు'?
చెంతకి పోకుండానే
మన సెల్యులాయిడ్ మీద సత్యజిత్రాలను చూస్తున్నాను.

జీతాలు, తాలిళ్ళతప్ప జీవితంలేని
స్కేల్సు, రూల్సు, స్కాండల్స్ తప్ప మాట్లాడుకోని
మా అల్పత్వంనుంచి వసుధైక కుటుంబంకొరకు అరుస్తున్నాను.

వర్గరహిత సమాజం కొరకు రాస్తున్నాను
వర్ణరహిత మహిత సూర్యోదయం కొరకు చూస్తున్నాను
అద్భుతమయిన స్వప్నాలని రాస్తున్నాను.

అక్కడక్కడా కలల రెమ్మలు వేస్తున్నాను
అక్కడకూడ కళల సెమ్మెలు వేస్తున్నాను
అంతటా జ్వాలల దీపాలు పూస్తున్నాను.

# భరతఖండము

—చిలకమర్తి

చెరశాలల్ పృథు చంద్రశాలలె యగున్
చేదోయి గీలించు నయ్యారదండల్ విరిదండలయ్యోడును
హేయంబైన చోడంబలే పరమాన్నంబగు
మోట కంబళులు దాల్పన్ పట్టు సెల్లాలగున్
స్థిరుడై యే నరుడాత్మ దేశమును
భక్తిం గొల్చునవ్వానికిన్.

భరత ఖండంబె యొకగొప్ప బందెఖాన
అందులోనున్న ఖయిదీలు హిందుజనులు
ఒక్కగది నుండి మార్చి వేరొక్క గదిని
బెట్టుటేగాక చెరయంచు వేరెగలదె.

(లజపతిరాయ్ ప్రవాసము గురించి)

* * *

భరత ఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను* గడుసరి గొల్లవారు
పితుకు చున్నారు మూతులు బిగియ పట్టి.

(బిపిన్‌చంద్రపాల్ ప్రసంగానంతరం)

---

*తెల్లవారను—(1) తెల్లవారు అను (2) తెల్లవారగనే. "ఈ పద్యమెట్లు వ్రాకి వెళ్ళినదో గాని కృష్ణానది వంతెన గోడలమీద పెన్సిళ్ళతో వ్రాయబడెను"

# గ్రంథ సమీక్ష

## ఒక్క రాత్రి

రచన: ఉషశ్రీ

ప్రచురణ: సుపర్ణ పబ్లికేషన్స్
శ్రీరామకృష్ణాపురం, కొత్తపేటపోస్టు
హైదరాబాదు-35

కేవలం కల్పితమూ, వాస్తవమూకాని రెండూకల కల లాంటి కథ యిది. కలలాంటి కథ అని ఎందుకు అనవచ్చునంటే యిద్దరు వ్యక్తుల జీవితంలో జరిగిన భిన్నభిన్న సంఘటనలను రచయిత ఒకే వ్యక్తికి ఆపాదించారు గనుక. ఈ కథలోని సుందరి పాత్ర అలాంటిది. అందుకే సుందరిది విచిత్రమైన వ్యక్తిత్వం అనిపిస్తుంది. అందువల్ల ఆమె పాత్రచిత్రణలో కొంత అసహజత్వం కనిపించినా, రచయిత ముందుగానే చెప్పుకోవడంవల్ల, దానిని రచయితకు అన్వయించడానికి వీలులేదు.

ఈ కథలో శంకరం అనే నాయకుడి చుట్టూ సుందరి, సుశీల, మంజుల, శంకరం భార్య తిరుగుతారు. అయితే సుందరి మాత్రం ఉపగ్రహంకాదు. ఉపగ్రహంలా కనిపించి శంకరాన్నే తనచుట్టూ తిప్పుకుంటుంది. మంజుల పాత్ర చిత్రణ ఈ నవలికలో అర్థమయ్యేంత వివరంగాలేదు. అలానే సుశీలకూడా. నవలలో అయితే పూర్తిగా చూపించే వీలుండేదేమో.

అయితే కథను పరుగెట్టించడంలో రచయిత కృతకృత్యులయ్యారు. కొద్దిపాటి యితి వృత్తంగల కథని నవలికకు సరిపోయేంత పెద్దగా చెప్పేప్పుడు పాఠకుడికి విసుగు కలగకుండా ఆసక్తిగా, గబగబా పరుగెడుతున్నట్టు చెప్పడంలో రచయిత ప్రతిభ కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. ఇది ప్రేమ కథ కావడమే ఈ ఆకర్షణకు కారణంకాదు. రచయిత నేర్పుకూడా యిందుకు కారణం. సుశీల తప్ప మిగిలిన మూడు స్త్రీ పాత్రలూ శంకరాన్ని కోరుకుంటాయి. అయితే శంకరం సుశీలను కోరుకుంటాడు, తిరస్కరిస్తుంది. అన్నా చెల్లెళ్లు అయిపోతారు! సుందరి మనస్తత్వానికీ, సుశీల మనస్తత్వానికీ వున్న తేడాయిదే. సుందరి జీవితాన్ని అందుకోగలదు. సుశీల అందుకు విరుద్ధం

సుందరి శంకరాన్ని అడుగుతుంది—

"ఈ మధ్య కథలేమీ వ్రాయడంలేదా?"

"వ్రాయాలనిపించడంలేదు."—శంకరం జవాబు.

"నడపాలనిపిస్తున్నదా?" అని చిన్నగా నవ్వుతూ వంకరగా చూసింది.

యవ్వనంలో అడుగు పెడుతున్న వ్వారు ఈ నవలికని ఆసక్తిగా చదువుకోవచ్చు.

ఈ కథలో చిన్నచిన్న లోపాలు వున్నాయి. రచయిత కథని రాసేసిన తర్వాత మరోసారి చూసుకునివుంటే యివి సంభవించేవి కావు స్కూలుఫైనల్ చదివి ట్రయినింగు పూర్తిచేసి హైదరాబాదులాంటి మహానగరంలో ఉద్యోగం చేస్తున్న ఆరిందలాటి సుందరిచేత రచయిత (22వ పుటలో) పరికిణీ, పైట కండువా వేయిస్తారు. మరోచోట సుందరీ, సుశీలా ఒకరు మరొకరై పాఠకుడికి గంద్రగోళాన్ని కలిగిస్తారు.

రచయితకు చదువరి కావాలి. చదువరికి రచనలు కావాలి. రచయితకు రచనలు చేసేందుకు ఉత్సాహం ప్రోత్సాహం లభించినప్పుడే చదువరికి మంచి రచనలు లభిస్తాయి. మంచి రచనలు లభించి, అవి చదివే అవకాశాలు, చదువరికి పుష్కలంగా కలిగినప్పుడు చదవాలన్న తృష్ణ చదువరిలో పదింతలై పెరుగుతుంది. అప్పుడు రచయితకు ఆదరణ, చదువరికి మంచి రచనలు ఒక్కమాటుగా విరివిగా లభిస్తాయి— ఈ ఆశయంతో సుపర్ణ ప్రచురణల సంస్థ పూనుకోవడం అభినందనీయం.

ఈ సంస్థ ఆశయాలలో "రచయితకు మామూలుగా లభించే పది పర్సంటు రాయల్టీతోపాటు అదనంగా పదిహేను పర్సంటు రాయల్టీ యిచ్చి, కాపీరైటు యావత్తూ రచయితకే వుంచి, ప్రఖ్యాత రచయితల పుస్తకాలు ప్రచురించడం 'సుపర్ణ' ధ్యేయం" అనికూడా చెప్పుకున్నారు. ఇరవైఅయిదు పర్సెంటు రాయల్టీ లభించగలిగితే తెలుగు రచయిత నిజంగా అదృష్టవంతుడే. కేంద్ర సహకార ప్రచురణల సంస్థ స్థాయికి మనం చేరుకోవడం అష్టకష్టం కాదని యీ సంస్థ నిరూపిస్తోంది.

**సాహితీప్రియ**, సచిత్ర మాసపత్రిక

సంపుటి 1 సంచిక 3-ఫిబ్రవరి 1968
గౌరవ సంపాదకులు : శ్రీ కొలకలూరి

ఈ సంచికలో శ్రీయుతులు సుగమ్‌బాబు, గాడేపల్లి కుక్కుటేశ్వరరావు, అడివి శివసుబ్రహ్మణ్యంగార్ల కథలూ, ఆంధ్ర నాటక రచనను గురించి శ్రీ యస్. గంగప్పగారి వ్యాసము, శ్రీ కొలకలూరి రాసిన సీరియల్ నవల 'సౌందర్యవతి', యింకా గేయాలూ, బాల, వనితా, యువ, చిత్ర సాహితులూ మొదలైన శీర్షికలు వున్నాయి. సంచిక ఆకర్షణీయంగా వుంది.

—రాజు

### స్వీకారం :

1. ఆధునికాంధ్ర సాహిత్యము
   డా. సి. నారాయణరెడ్డిగారి డాక్టరేట్ థీసిస్




(గతసంచిక తరువాయి)

జపాను దేశస్థులు అతి ఆచార పరాయణులు అయినప్పటికీ మతము వారి నిత్యజీవితములో ప్రముఖస్థానము వహించుట లేదు. కొన్ని మత సాంప్రదాయములను, కొన్ని మూఢనమ్మకములను కలిగియున్నప్పటికీ వారు ఖచ్చితముగా ఏమతమునకు చెందినవారో తెలియదు. ఉదాహరణకు చిన్న పిల్లలను సింతోయిజం మతమునకు సంబంధించిన దేవాలయములకు తీసుకొని వెళ్ళి ప్రార్థనలు జరిపెదరు వివాహాది కర్మలు కూడా ఈ మత సాంప్రదాయానుసారమే జరుపుదురు. కాని మృత దేహములను బౌద్ధ మతానుసారముగా దహనము చేయుదురు. అసలు ఈ దేశములో మతము చైనా, భారత, పాశ్చాత్య దేశముల సంస్కృతుల సమ్మిశ్రితము వలన చాలా మార్పులను చెందింది.

వీరు దేవాలయములలోనికి ప్రవేశించు ముందు చేతులను ఒక చిన్న కొలను వద్ద కడుగుకొని లోపలికి వెళ్ళెదరు. దేవునికి కానుకలు కూడ చెల్లింతురు. వారు కూడ మనకు వలెనే చేతులు జోడించి ప్రార్థనలు జరిపెదరు.

## పిల్లల వినోదములు

రెండవ ప్రపంచ సంగ్రామానంతరము కొన్ని అమెరికను సాంప్రదాయములు పిల్లల వేడుకలలో కూడ ఇక్కడ కనుపించుచున్నవి. ఉదాహరణకు Mother's Day అను వేడుకను మే మాసములో రెండవ ఆదివారమునాడు అతి ఘనముగా జరుపుకొందురు. ఈ వేడుకను అమెరికాలో కన్న ఇక్కడే అతి ఉత్సాహముగా జరుపుకొందురని కొందరు పరిశీలకుల అభిప్రాయము. ఈ పండుగ యొక్క ముఖ్యోద్దేశ్యము తల్లి యొక్క కష్ట సుఖములు పిల్లలకు అర్థమయ్యేటట్లు చేయుటయే. అనగా తల్లి సంవత్సరమంతయు



విరామములేక కుటుంబము కొరకును, పిల్లల పురోభివృద్ధి కొరకును కష్టపడుటవలన ఈ రోజున తల్లికి విరామము ఇచ్చి పిల్లలే ఇంటి బాధ్యతలను నిర్వహింతురు. ఈ విధముగా పిల్లలు తల్లులకు కృతజ్ఞత తెలుపుకొందురు. ఈ రోజున తల్లులు ఇంటి పనులు ముట్టుకొనకూడదు. తల్లులందరు కలిసి విహార యాత్రలకు వెళ్ళి విశ్రాంతి తీసుకొందురు.

అసలు ఈ పండుగకు చాల ముందునుండియు, పిల్లలు తల్లులను ఎటు ఆనందింపజేయవలెనో అని ఆలోచించి పథకములను తయారుచేయుదురు. ఎక్కువ మంది వారి ఖర్చులకు ఇచ్చిన కొద్ది డబ్బునుండి పొదుపు చేసిన సొమ్ముతో తల్లులకు అత్యంత ఇష్టమైన వస్తువులను కొని బహూకరింతురు. తల్లులకు విరామము ఇచ్చుటతోబాటు వారికి సంభ్రమాశ్చర్యములు కలిగించెడి బహుమతులను ఇచ్చుట ఈ పండుగ ముఖ్యోద్దేశము. ఇట్లు చిన్నతనము నుండియు తల్లులకు కృతజ్ఞత తెలుపుటవలన తల్లి-పిల్లల సంబంధం అత్యంత ఆదర్శవంతముగా నుండును.

ఇటులనే మే నెలలో 5 వ తేదీని Children's Day గా జరుపుకొందురు. ఆరోజునే తల్లిదండ్రులు పిల్లలను వినోద ప్రదర్శనలకుగాని, విలాస యాత్రలకుగాని తీసుకొని వెళ్ళుదురు. ఆ రోజున పిల్లల వినోద విజ్ఞానాభివృద్ధికి అనేక కార్యక్రమములు ఏర్పాటు చేయుదురు. తల్లిదండ్రులు పిల్లల అభివృద్ధికొరకు చేయు కృషిని ఈ పండుగకు ఇచ్చు ప్రాముఖ్యము నుండి తెలిసికొనవచ్చును. అసలు ఆరోజు దేశమంతయు పిల్లలను గూర్చి ఆలోచించుటవలన పిల్లల అభివృద్ధికి అనేక క్రొత్త పథకములను రూపొందించుటకు వీలగుచున్నది. ఈ విధముగా ఈ దేశములో తల్లిదండ్రులు పిల్లలు పరస్పరంగా గౌరవించుకొని మంచి సాంప్రదాయములతో జీవించుటవలన పిల్లలు పెద్దవారైన పిదప దేశ పురోభివృద్ధికి ఎంతో తోడ్పడుచున్నారు.

టోకియో,
30-10-1963

చిరంజీవులయిన పెద్దబాబు చిన్నబాబులకు మీ నాయన దీవించి వ్రాయునది ఏమనగా ఇక్కడ నేను క్షేమముగానే యున్నాను. అక్కడ మీరందరూ కులాసాగానున్నారని తలంచెదను.

రెండవ ప్రపంచయుద్ధములో దాదాపు పూర్తిగా శిథిలమయిన ఈ దేశము, 20 సంవత్సరములలో సంపూర్తిగా కోలుకొనడమే గాక ఇప్పుడు ప్రపంచములో ఉత్తమ పారిశ్రామిక దేశముగా రూపొందినది. ఈ అద్భుత పురోభివృద్ధికి కారణభూతమయిన వారి జాతీయలక్షణములను గూర్చి విపులముగా తెలిపెదను.

## జాతీయ లక్షణములు

ఈదేశస్థుల సాంఘిక, ఆర్థిక కట్టుబాట్లే వారికి అత్యద్భుత పురోభివృద్ధికి ముఖ్యకారణము. వీరిసాంఘిక జీవితములో నిజాయితీకి ప్రత్యేక స్థానముగలదు. అసలు అబద్ధమాడుటను గాని, ఇతరులవస్తువులను దొంగిలించుటను గాని, పోట్లాడుకొనుటను గాని వీరు అతినీచముగా భావింతురు. అందువలన వారికి నిత్యజీవితము మన పురాణములలో వర్ణించిన రామరాజ్యములాగ సుఖముగా జరిగిపోవుచున్నది. వీరి ముఖ్యోద్దేశము-వారి దేశమును ప్రపంచములో అతిముఖ్య పారిశ్రామిక దేశముగా రూపొందించుటయే. ప్రతిపౌరుడు తనవిద్యుక్త ధర్మమును విధితప్పకుండ నిర్వహించుటకు చిన్నప్పటినుండియు తర్ఫీదు పొందుచున్నాడు. ప్రతిఒక్కరును వారి జీవనోపాదిని సంపాదించుకొనుటకు అవసరమయిన శిక్షణపొంది, ఇతరులపై ఆధారపడకుండ జీవితమును గడుపుచున్నారు. అసలు ఇతరులపై ఆధారపడుటను ఏహ్యముగా భావింతురు. అందువలన అతివృద్ధులుకూడ కష్టపడి ఏదో ఒకపనిచేసి తమజీవనోపాదిని సంపాదించుకొనుటను చూచి ఆశ్చర్య భరితుడనయితిని. ప్రతిఒక్కరును తమ జీవితముతో సంతృప్తిచెంది తమవిధులను క్రమము తప్పక నిర్వహించుచున్నారు. వారి భావిజీవితమును గూర్చి ఇసుమతయినను ఆదుర్దాపడుట గాని, అసంతృప్తి పడుటగాని నేను చూడలేదు. ఒకవేళ వారికి ఏదయిన కష్టనష్టములు గలిగిన ఆకష్టనష్టములకు తామేబాధ్యులమని తెలిసికొని ఇతరులను నిందించరు. అతి దైన్యస్థితిలోనున్న వారుకూడ తమనిర్భాగ్య స్థితికి దేముడుగాని, ప్రభుత్వముగాని, తోటిపౌరులుగాని బాధ్యులని నిందించుటను నేను చూడలేదు. కష్టములను కూడ సంతోషముతో, ఓర్పుగా భరించుటలో వారికి వారేసాటి. ఇటువంటి ఉత్తమ మయిన జాతీయ లక్షణములు వీరుకలిగియుండనిచో రెండవ ప్రపంచ సంగ్రామములో గలిగిన అపార నష్టము నుండి అసలు కోలుకొనలేక పోయెడివారు. ఇట్టి ఉత్తమ పౌరులుగల దేశము ప్రపంచములోని అన్ని దేశములయొక్క మన్ననలను పొందుటలో ఆశ్చర్యము లేదు.

## నిరక్షరాస్య నిర్మూలనము

దాదాపు ఒకవంద సంవత్సరములలో నిరక్షరాస్యతను పూర్తిగా నిర్మూలించిన దేశము ప్రపంచములో జపాను తప్ప ఇంకొకటి లేదు. క్రీ. శ 1872లో జపాను దేశము పాశ్చాత్య దేశములకన్న అన్ని రంగములలో వెనుకబడి యుండుటవలన అప్పటి జపాను ప్రభుత్వము విద్యకు అత్యధిక ప్రాధాన్యము ఇచ్చి అభివృద్ధికరమయిన ప్రణాళికలను రూపొందించినవి. ప్రజలుకూడ ప్రభుత్వముతో అత్యుత్సాహముగా సహకరించుట వలన ఈ రోజున చదువు రానివారు ఆ దేశములోలేరు. అసలు ఈ దేశములో ప్రజలకు, ప్రభుత్వమునకు ఒకే లక్ష్యము ఒక ఆదర్శప్రాయమయిన సంఘమును నిర్మించుటయే. అందువలననే వారు అనేక చిక్కు సమస్యలను తేలికగా పరిష్కరించ గలిగారు. అటులనే మనము కూడ పరిష్కరించ గలమనుటలో సందేహములేదు.

## కుటుంబ నియంత్రణము

ఇక్కడ ప్రభుత్వము రెండవ ప్రపంచ సంగ్రామానంతరము కొన్ని ముఖ్యచర్యలు తీసుకొనుటవలన జనాభా పెరుగుదలను అదుపులోనికి తీసుకొని వచ్చినారు. అట్టి చర్యలు తీసుకొననియెడల వారి ఆర్థిక పురోభివృద్ధికన్న జనాభా పెరుగుదల ఎక్కువయి పారిశ్రామికాభివృద్ధి కుంటుపడియుండెడిది. ఏ దేశమయినను త్వరిత పురోభివృద్ధి గాంచవలెనన్న వారి జనాభా పెరుగుదల, ఆర్థిక పెరుగుదల తగిన నిష్పత్తిలో నుండవలెను. అదియునుగాక జీవనోపాదిని సంపాదించువారు, వారిపై ఆధారపడియుండెడు వారు కూడ తగిన నిష్పత్తిలో నుండవలెను. అట్లులేనియెడల ఆర్థిక పురోభివృద్ధి సాధ్యముకాదు. జనాభా పెరుగుదలను అదుపులోనికి తీసుకొనివచ్చుటలో ప్రతిపౌరుడు తన విద్యుక్త ధర్మమును క్రమము తప్పకుండ నిర్వహించుటవలన ఈ రోజున జపాను దేశము ప్రపంచములో ప్రముఖ స్థానమును ఆక్రమించుకొనుటకు వీలయినది. అట్టి క్రమశిక్షణగల పౌరులున్న ఏ దేశమయినను అట్టి అభివృద్ధిని సాధించవచ్చుననుటలో సందేహము లేదు.

## ఆహార సమస్య

ఇచ్చట వీరి భూమివిస్తీర్ణము చాలతక్కువగా ఉండుట వలనను, ప్రకృతి పరంగా సహజ అవరోధము ఉండుటవలను ఇక్కడ ఉత్పత్తి అయ్యే ఆహారము ఇచ్చటి ప్రజలకు సరిపోవుటలేదు. ఇచ్చటి రైతులు అత్యంత ఆదర్శవంతముగా కృషిసల్పి ప్రపంచములో కల్ల ఎక్కువపంటను పండించినప్పటికి విదేశముల నుండి ఆహారపదార్థములను దిగుమతి చేసుకొనవలసిన అవసరము ఏర్పడుచున్నది. అట్లు విదేశములపై ఆధారపడుటను వారు ఎంతో ఏహ్యముగా భావించినవారి భోజనపు అలవాటులను మార్చుకొనుచున్నారు. పూర్వకాలములో వారు మూడు వేళలలో అన్నము భుజించు అలవాటు ఉన్నప్పటికి ఆహారకొరతను నివారించుటకు ప్రస్తుతము కాయగూరలు, మాంసము. చేపలు. గ్రుడ్లు, పళ్ళు మొదలగువానిని ఎక్కువ భుజించి అన్నము చాలవరకు తగ్గించినారు.

మన దేశములో ఇక్కడకన్న ఎక్కువ భూమి, చదునయిన నేల, అపారమయిన ఖనిజ సంపత్తి, వ్యవసాయమునకు పనికివచ్చే అనేకనదులు, అనువయిన శీతోష్ణస్థితి ఇంకా ఎన్నో అనుకూల పరిస్థితులను సద్వినియోగపరిచి వారి మాదిరిగానే ఐకమత్యముతో కృషిచేస్తే వారికంటె ఉన్నత స్థానాన్ని ఆక్రమించగల మనుటలో సందేహము లేదు.

ఇట్లు,
మీ ప్రియమయిన నాన్న

## పాదర్శ ఘట్టాలు

### కండక్టరు నిజాయితీ

కూకట్‌పల్లి డిపోకు చెందిన బస్సు కండక్టరు శ్రీ రామానుజం ప్రదర్శించిన నిజాయితీ ఇటీవల అందరిని ఆకర్షించింది. డిసెంబరు 26వ తేదీన, భారీ విద్యుత్ పరికరాల కర్మాగారంలో సూపర్‌వైజర్‌గా పనిచేస్తున్న శ్రీ ఆర్. మాధవరావు 13వ నెంబరు రూటు బస్సు ఒకదానిలో పోగొట్టుకున్న పర్సు శ్రీ రామానుజంకు దొరికింది. దానిలో దాదాపు రూ. 200/_ లు వున్నాయి. తన కంట బడిన ఆ పర్సును శ్రీ రామానుజం నిజాయితీతో తన డిపోలో అప్పగించాడు. తరువాత పర్సు యజమాని దానిని డిపోనుండి తీసుకున్నాడు.

### శ్రమదానం

ఆరెపల్లి, చెరుకుపల్లి, గుళ్లపల్లి తదితర గ్రామాలకు చెందిన ప్రజలు శ్రమదానంద్వారా వెల్లటూరు, గొల్లపూడి కాలువలను 4 మైళ్ళ పొడవున లోతుచేశారు. ఈ కాలువలకు మరమ్మతులు జరగక పోవడం చేత యిప్పటివరకు సుమారు 1800 ఎకరాల విస్తీర్ణంలో పైరకు తీవ్రమైన దెబ్బ తగిలింది. యిప్పుడు కాలువలలో పూడిక తీసి లోతు చేయడంవల్ల దాదాపు 1000 ఎకరాలలో సేద్యానికి నీరు అందుతుంది.

### కార్మికుల ఔదార్యం

ఒక కార్మిక బృందం హైద్రాబాదులో జనవరి 8వ తేదీన ప్రధాన మంత్రిని కలుసుకొని, ఓవర్ టైమ్ భత్యాలు తీసుకోకుండా ఎక్కువ సమయంపాటు తాము పనిచేయ దలచినట్లు తెలిపారు. భారత భారీ విద్యుత్పరికరాల కర్మాగారానికి చెందిన ఈ కార్మికులు ప్రధాన మంత్రికి సమర్పించిన ఒక వినతి పత్రంలో, పరిశ్రమలలో పొదుపును సాధించడానికి మార్గంగా కార్మిక వర్గాలు ఈ విధమైన చర్యతీసుకోవలసిన అవసరాన్ని తాముగుర్తించామని పేర్కొన్నారు.

## ప్రజలకు సహాయం

పూనాలోని సైనికదళాల వైద్యకళాశాలలో 1968 జులై నుండి మరుసటి ఎం. బి. బి. ఎస్. కోర్సు ప్రారంభమవుతుంది. మొదటిసంవత్సరం ప్రవేశానికి 120 సీట్లు ఉన్నాయి. మహిళలకు సీట్లుపరిమితంగా ఉంచారు. దరఖాస్తులు అందాల్సిన ఆఖరు తేదీ 25_2_1968.

అభ్యర్థులు అవివాహితులుగాఉండి శారీరక అర్హతలు కలిగి ఉండాలి. అంతేగాక గణితం సబ్జెక్టుతో మెట్రిక్యులేషన్ గానీ, ప్రిప్రొఫెషనల్ (వైద్యం), ప్రిమెడికల్, ఇంటర్ సైన్సు (మెడికల్ గ్రూపు) గానీ, గుర్తించబడిన బోర్డు, విశ్వవిద్యాలయాలకు చెందిన వాటికి సమానమైన పరీక్షలలో గానీ ఇంగ్లీషు, భౌతిక శాస్త్రం, రసాయన శాస్త్రం, జీవశాస్త్రంలలో సగటున 50 శాతం మార్కులతో ఉత్తీర్ణులై ఉండాలి. పైనపేర్కొన్న పరీక్షలో పాస్గాని ఫలితాలకు నిరీక్షిస్తున్న అభ్యర్థులుకూడ దరఖాస్తులు పంపవచ్చు. 1968 అక్టోబరు 1 వ తేదీ నాటికి అభ్యర్థుల వయస్సు 17_20 సంవత్సరాల మధ్యఉండాలి. సైన్సు పట్టభద్రులకు 22 సంవత్సరాల వయస్సువరకు మినహాయింపు ఉంది. అర్హతగల అభ్యర్థులు, 1968 మార్చి 10 వ తేదీన జరిగే వ్రాతమూలక పరీక్షకు, 1968 మేలో ఇంటర్వ్యూలకు నిర్దిష్ట కేంద్రాలకు స్వంత ఖర్చుపై హాజరు కావాలి.

అర్హతల ప్రాతిపదికగా ప్రత్యేకంగా సెలక్టుచేయబడిన 60 మంది మెడికల్ కెడెట్లకు ఆయా సంవత్సరాలలో రు. 75 నుండి రు. 100 వరకు స్టయిఫండు మంజూరుచేస్తారు. ట్యూషన్ ఫీజు చెల్లింపునుండి కూడ మినహాయింపు చేస్తారు. అయితే ఆ అభ్యర్థులు, ఎం. బి. బి. ఎస్. డిగ్రీపొందిన తర్వాత యితర నిబంధనలను పూర్తి చేయడంతోపాటు శాశ్వత రెగ్యులర్ కమీషన్డ్ ఆఫీసర్లుగా సైనిక వైద్యదళంలో పనిచేస్తామని బాండు వ్రాసియివ్వాలి.

'కమాండెంటు సైనికదళాలవైద్య కళాశాల, పూనా_1' కార్యాలయం నుండి నిర్ణీత దరఖాస్తు ఫారాలు, ప్రాస్పెక్టస్‌లు ఉచితంగా పొందవచ్చు. నిర్ణీత దరఖాస్తు ఫారాలు, ప్రాస్పెక్టస్ నిమిత్తం పంపే దరఖాస్తులలో జన్మించిన తేదీ, విద్యార్హతలు, ప్రిమెడికల్, ప్రిప్రొఫెషనల్ (వైద్యం), ఇంటర్ సైన్సు (మెడికల్ గ్రూపు) పరీక్షలలో పొందిన మార్కుల వివరాలు తెల్పుతూ 9″ × 6″ సైజులో స్వంతచిరునామాగల స్టాంపులు లేనికవరు జతచేయాలి.

## యాత్రలు

### విహార పర్యటనల ఆర్థిక ప్రాముఖ్యం

ప్రపంచం మొత్తంమీద విహార పర్యటనలు జరిపే పన్నెండు కోట్ల మంది యాత్రికులలో సుమారు 1,50,000 మంది మన దేశాన్ని సందర్శిస్తున్నట్లు అంచనా. వివిధ దేశాలలో ప్రస్తుతం యాత్రికులు ఖర్చుపెడుతున్న రూ. 6,000 కోట్ల మొత్తంలో దాదాపు రూ 20కోట్లు మన దేశానికి లభిస్తున్నాయి. మూడవ పంచ వర్ష ప్రణాళికా కాలంలో సుమారు రూ.6కోట్లు ఖర్చు పెట్టడం జరిగింది.

### మైసూర్ యాత్రికులు నగర సందర్శన

దేశ, విదేశాల యాత్రికులను అనేక మందిని హైద్రాబాదు నగరం ఆకర్షిస్తున్నది. మైసూరు రాష్ట్రంలోని శిరిగిరికి చెందిన 'శివానుభావ ప్రవాస సమితి' అధ్వర్యంలో వెయ్యిమంది యాత్రికులు డిసెంబరు 29వ తేదీన హైద్రాబాదు వచ్చి సాలార్ జంగ్ మ్యూజియం, చార్మినార్, తదితర దర్శనీయ స్థలాలను సందర్శించారు. జన సంబంధశాఖ ఈ యాత్రిక బృందానికి అన్ని సౌకర్యాలు కల్పించింది. *

# ప్రముఖుల రాకలు

## దలైలామాను ముగ్ధుడిని చేసిన రాష్ట్రపర్యటన

రాష్ట్రంలో రెండురోజుల పర్యటనపై వచ్చిన దలైలామాకు డిసెంబరు 20వ తేదీన నాంపల్లి రైల్వేస్టేషన్‌లో ఘనస్వాగతం యివ్వబడింది. 9 మంది సభ్యులతో పాటు విచ్చేసిన దలైలామాను, శ్రీ గురుమూర్తి, శ్రీ కె.వి. నారాయణరెడ్డి, శ్రీ కె. విజయభాస్కర రెడ్డి–ఈ ముగ్గురు మంత్రులు స్టేషన్‌లో ఆయనకు స్వాగతం చెప్పారు.



డిసెంబరు 20న హైదరాబాదుకు విచ్చేసిన దలైలామా

దలైలామా, 'ఆనందనిలయం' లో ముఖ్యమంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డిని కలిశారు. ఆతర్వాత ఆయన నాగార్జున సాగర్ ప్రాజెక్టును, ప్రసిద్ధ నాగార్జునకొండను సందర్శించారు.

దలైలామా హైదరాబాదు రావడం యిది రెండవసారి. మొదట 1957 లో ఆయన ఈ నగరానికి విచ్చేశారు.



ఆనంద నిలయంలో జనవరి 19న బల్గేరియన్ రాయబారి ముఖ్య మంత్రిని కలుసుకున్నప్పటి చిత్రం



ముఖ్య మంత్రితో సైప్రస్ పార్లమెంట్ స్పీకర్

# నగరంలో...

## కల్పలతలో కొత్త విభాగం

కొనుగోలుదార్లు తమకు అవసరమైన వస్తువును తామే తెచ్చుకొని వెల చెల్లించే పద్ధతిలో నిర్వహించబడే క్రొత్త విభాగానికి 'కల్పలత'లో జనవరి 26వ తేదీన ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి ప్రారంభోత్సవం చేశారు. రాష్ట్రంలో విజయవంతంగా నడుస్తున్న వినియోగదార్ల సహకార సంఘాలకు పూర్తి సహాయం లభిస్తుందని ఆయన పేర్కొన్నారు. గత ఒక సంవత్సరంగా 'కల్పలత'సాగిస్తున్నకృషిని ముఖ్యమంత్రి ప్రశంసించారు. ప్రజలు, వినియోగదార్ల సహకార సంఘాలను స్థాపించి వాటిని సమర్థవంతంగా నిర్వహించాలని ఆయన సూచించారు. ధరల పెరుగుదలవల్ల సామాన్యప్రజలు ఎదుర్కొనవలసి వస్తున్న ఇబ్బందులను ఉపశమింపజేయడంలో ఇవి చాలావరకు తోడ్పడగలుగు తాయని అన్నారు.

సహకార శాఖా మంత్రి శ్రీ కె. విజయ భాస్కరరెడ్డి, ఈ పథకాన్ని విజయవంతం చేసినందుకు "కల్పలత" అధికార్లు, సిబ్బంది కృషిని ప్రశంసించారు.

## కాబూలు కళాకారులకు స్వాగతం

సాంస్కృతిక ప్రతినిధివర్గంగా భారత దేశంలో పర్యటించిన కాబూలు రేడియో కళాకారుల బృందం గౌరవార్థం జనసంబంధశాఖ కార్యాలయావరణలో జనవరి 22వ తేదీన స్వాగతసభ జరిగింది. ఈ బృందం జనవరి 20, 21వ తేదీలలో హైద్రాబాదులో ప్రదర్శనలిచ్చింది. జనవరి 22వ తేదీన ఏర్పాటైన స్వాగత సభలో స్థానిక కళాకారులు కూడా ప్రదర్శనలిచ్చారు. జనసంబంధ, శ్రామిక మంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ అధ్యక్షత వహించారు.



ఆఫ్ఘనిస్తాన్ సాంస్కృతిక బృందం నాయకుని సన్మానిస్తున్న ముఖ్య మంత్రి



జనవరి 19న నగరానికి వచ్చిన ఆఫ్ఘనిస్తాన్ సాంస్కృతిక బృందానికి సికిందరాబాదు రైల్వే స్టేషనులో స్వాగతం చెప్పినప్పటి చిత్రం



పథకాన్ని విజయవంతంగా అమలు పరిచినందుకు కల్పలత అధికార్లను, సిబ్బందిని సహకార శాఖామంత్రి శ్రీ కె. విజయభాస్కరరెడ్డి అభినందించారు

# దేశరక్షణ

## 1967లో భారత వైమానిక దళం

1967 ఫిబ్రవరిలో జరిగిన రెండు సంఘటనల మినహా 1967 సంవత్సరమంతా భారత వైమానిక దళానికి ప్రశాంతంగానే గడిచింది. ఫిరోజ్‌పూర్ రంగంలో పాకిస్తాన్ విమానం మన భూభాగంలోకి చొచ్చుక వచ్చింది. హెచ్చరిక కాల్పులు జరిపి భూమిపై దిగాలని చేసిన సూచనను పెడచెవిని పెట్టిన కారణంగా దానిని కూల్చివేయాల్సి వచ్చిన సంఘటన అది.

సెప్టెంబరులో నాథులా రంగంలోను, అక్టోబరులో చోలా రంగంలోను చైనీయులు మనచౌకీలపై అకారణంగా జరిపిన కాల్పులలో గాయపడిన వారిని హెలికాప్టర్ల ద్వారా వెదికి తీసే కార్యక్రమంలో కూడ వైమానిక దళం పాల్గొన్నది. వాతావరణ పరిస్థితులు అనుకూలంగా లేకున్నా మన హెలికాప్టర్లు గాయపడిన వారిని సైనిక విమానాశ్రయాలకు తీసుకొచ్చి యుద్ధ రంగంలోని ఆసుపత్రులకు చేర్చాయి.

మిజో కొండలలో తిరుగుబాటును అణచడానికి మన జవానులను హెలికాప్టర్ల ద్వారా అక్కడదించడం జరిగింది.

పైన తెల్పిన రెండు సంఘటనలు మినహా భారత వైమానికదళం సంవత్సరం మంతా ప్రశాంతంగా గడుపుతూ 45 స్క్వాడ్రనులకు బలగాన్ని పెంచే కార్యక్రమాన్ని అమలుజరిపింది. దానికి తోడు ఎక్కువ సామాగ్రిని సేకరించి, ఎక్కువస్థావరాలను నెలకొల్పే కార్యక్రమాన్ని కొనసాగించింది. విస్తరణతోపాటు, 1965లో పాకిస్థాన్‌తో జరిగిన సంఘర్షణ సందర్భంలో నేర్చిన గుణపాఠాలకు అణుగుణంగా వైమానిక సామాగ్రిని పటిష్ఠంచేసి, సైనిక చర్యలలో పాల్గొనే వైమానిక సిబ్బందికి పునశ్చరణ శిక్షణ యివ్వడం జరిగింది.

మన దేశంలోనే రూపొందించి తయారు చేసిన హెచ్. ఎఫ్ 24 ఎం.కె. మారుత సైనిక విమానాలతో ప్రథమ సైనిక చర్యల స్క్వాండ్రన్ ఏర్పాటు చేయడం యీ సంవత్సరం జరిగిన ముఖ్య సంఘటనలలో ఒకటిగా పేర్కొనవచ్చు. భారత వైమానికదళం భూయుద్ధ శక్తి మరింత బలపడుతుంది. విమానానికి ఎక్కువ శక్తిగల ఇంజన్ లభింప జేయడానికి హెచ్.ఎఫ్.24, విమానంలో ఉపయోగించే ఆర్ఫియస్ ఇంజను రీహీట్ స్టాండర్డు పవర్ ప్లాంటు పని చురుకుగా కొనసాగుతున్నది.

విమానదాడుల రక్షణ విషయంలో మన దేశానికి గల తక్షణ ప్రమాదాన్ని ఎదుర్కొనడానికి వీలుగా తగిన విధంగా రాడార్ ఏర్పాట్లు చేయడం జరిగింది. భూమినుంచి ఆకాశానికి ఉపయోగించే పద్ధతి ఆయుధాల నెలకొల్పడం, నిర్వహించడం, యీ రంగంలో సిబ్బందికి శిక్షణ యివ్వడం వంటి కార్యక్రమం సంతృప్తికరంగా కొనసాగింది.

## పౌరసహాయక కార్యక్రమం

1967లో దేశంలోని అనేక ప్రాంతాలలో ఉధృతంగా వరదలు వచ్చాయి. కనీవినీ ఎరగని వర్షాల కారణంగా వరదలు వచ్చి అనేక గ్రామాలకు యితర ప్రపంచంతో సంబంధాలు తెగిపోయాయి. అసంఖ్యాకులైన ప్రజలు నిరాశ్రయులైనారు. ముఖ్యంగా ఉత్తర ప్రదేశ్‌లో ప్రవాహంమధ్య దీవులలో చిక్కుకు పోయిన ప్రజలకు ఆహార పదార్థాలు సరఫరా చేయడానికి భారత వైమానిక దళం హెలికాప్టర్లను వినియోగించారు. సెప్టెంబరు జోద్‌పూర్ సమీపంలో వరదల మూలంగా రైల్వేలైన్ కొంతభాగం కొట్టుకపోయి, రైలు ఆగిపోయిన ప్రదేశంలో, వరద ప్రదేశానికి చాలా తక్కువ ఎత్తునుండి హెలికాప్టర్ ద్వారా ప్రయాణీకులకు ఆహారం, మంచినీరు సరఫరా చేశారు.

భారత వైమానికదళం సిబ్బంది తమ ఆహారం కోటా కొంత తగ్గించుకుని, ఆహారపదార్థాలు సేకరించి బీహార్, ఉత్తర ప్రదేశ్‌లలోని కరువు బాధితులకు పంపిణీ చేశారు.

ఈ సంవత్సరం ఆరంభంలో జరిగిన సాధారణ ఎన్నికల నిర్వహణలో కూడా వైమానికదళం సహాయపడింది. మిజోకొండలలో పోలింగు కేంద్రాలు కొండ కోనలలో చాలాదూరంలో ఉండేవి. కాలినడకతో వాటిని చేరాలంటే కొన్నిరోజులు పట్టేవి. ఈ కేంద్రాలకు పోలింగు సిబ్బందిని, సామాగ్రిని చేరవేయడానికీ, పోలింగు తర్వాత బ్యాలెటు పెట్టెలు, సిబ్బందిని తిరిగి తీసుక రావడానికీ ఐఎఎఫ్ హెలికాప్టర్ల సహాయం తీసుకోవడం జరిగింది.

## నూతన అకాడమీ

హైదరాబాదు సమీపంలో నూతన వైమానికదళం అకాడమీకి రాష్ట్రపతి శంకుస్థాపన చేయడం యీ సంవత్సరపు విశేషాలలో ప్రధానమైనది. 1969లో శిక్షణ ప్రారంభం కానున్న యీ అకాడమీలో విమాన చోదకులకు, నౌకాసిబ్బందికి, సాంకేతికేతర గ్రౌండ్ డ్యూటీ అధికారులకు సమిష్టిగా ప్రాతిపదిక శిక్షణ యివ్వడం జరుగుతుంది. వైమానికులు, విమానాల సిగ్నలర్లు, పదాతి, నౌకాదళ పైలెట్లు, నౌకవైమానిక విభాగం నౌకాదళం సిబ్బందికి కూడ యిక్కడ శిక్షణ యిస్తారు. అక్టోబరు అఖరులో రాష్ట్రపతి డాక్టర్ జాకిర్ హుస్సేన్, ఢిల్లీ పరిసరాలలోని వైమానికదళం యూనిట్లను, స్టేషనులను దర్శించడం గమనార్హమైన అంశం. అంతకుముందు ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి పంజాబులో యుద్ధరంగంలోని వైమానికదళం కేంద్రాలను పరిశీలించారు.

ఈ సంవత్సరం సర్వీసులో ప్రప్రథమంగా జరిగిన కొన్ని సంఘటనలు ఉన్నాయి. క్రాన్వెల్ రాయల్ వైమానికదళం కళాశాల వైమానికులు అందజేసిన పాసింగ్ ఔట్ పరేడులో ఐ.ఎ.ఎఫ్. చీఫ్ ప్రప్రథమంగా వందన స్వీకారం చేశారు.

ఐ. ఎ. ఎఫ్. ఇక్విప్మెంట్ విభాగంనుండి ప్రప్రథమంగా ఒక అధికారి ఏర్ వైస్ మార్షల్గా ప్రమోట్ చేయబడినారు. మే నెలలో ఏర్ కమాండర్ జి. బి. సింగ్ యీ ఉన్నత పదవి స్వీకరించారు. ఐ. ఎ. ఎఫ్. మ్యూజియంను ప్రప్రథమంగా ఢిల్లీకి మార్చి ఏప్రిల్ 8 నుండి ప్రజలు సందర్శించడానికి అనుమతి యిచ్చారు. రెండు విభాగాలుగా ఉన్న యీ మ్యూజియంను ఒకచోట చేర్చి శాశ్వత భవనంలో ఏర్పాటుచేశారు. వైద్యవిజ్ఞాన రంగంలో పరిశోధన జరిపి ఉత్తమ గ్రంథాన్ని ప్రచురించిన వైమానికదళం డాక్టరు, గ్రూప్కెప్టెన్ హెచ్. ఎన్. దత్తాకు కల్నల్ ఆమీర్చంద్ అవార్డు ప్రప్రథమంగా లభించింది.

## సంక్షేమం

వైమానిక సిబ్బందికి–ముఖ్యంగా వైమానికుల సంక్షేమానికి అనేక చర్యలు తీసుకోవడం జరిగింది. దేశంలోని వివిధవైమానిక కేంద్రాలలో వివాహితులైన వైమానికులకు వసతి సౌకర్యం ఏర్పాటుచేశారు. కుటుంబనియంత్రణ క్లినికులతోసహా వైద్య సౌకర్యాలు, శిశుసంక్షేమ కార్యక్రమాలను ఎక్కువ సంఖ్యలో అమలు జరిపారు.

భారత వైమానికదళం సంక్షేమ సంఘం, యీ సంవత్సరం వైమానికుల నిమిత్తం కొత్తగా కుటుంబ సహాయక పథకాన్ని ప్రారంభించింది. ఈ పథకం క్రింద సంవత్సరానికి రు. 2 ల సాధారణ విరాళం చెల్లించిన వైమానికుడు, మరణించినప్పుడు ఆయనపై ఆధారపడిన వారికి పది సంవత్సరాల వరకు నెలకు 60లు యిస్తారు. అధికారుల విషయాలలో యీ మొత్తాన్ని రు. 2000ల నుండి రు. 3000లకు; వైమానికులకు రు. 1200ల నుండి రు. 2000లకు యీ మొత్తాన్ని పెంచడం జరిగింది.

## విదేశీయులకు శిక్షణ

స్నేహ రాజ్యాలకు చెందిన పైలెట్లు, టెక్నీషియనులకు భారతవైమానికదళం శిక్షణ కేంద్రాలలో శిక్షణ యిచ్చే కార్యక్రమాన్ని కొనసాగించారు. ఇటీవలికాలంలో మలేసియాదేశం కూడ యీ సహాయాన్ని వినియోగించుకుంటున్నది. ఈ దేశానికి చెందిన కెడెట్లు, జోద్పూర్లో ఇంటర్మీడియట్ స్థాయి శిక్షణను పూర్తిచేసి డిసెంబరులో అడ్వాన్సుస్థాయిలో గ్రాడ్యుయేట్ శిక్షణ ముగించారు.

గతంలో ఇండోనేషియా, ఇరాక్, యు.ఎ.ఆర్. బర్మా అఫ్ఘనిస్థాన్, నైజీరియా, యు.కె. దేశాలకు చెందిన కెడెట్లు యిక్కడ శిక్షణ పొందారు.

కొత్త సంవత్సర ప్రారంభంతో భారత వైమానికదళం తమ కార్యక్రమాల నిర్వహణకు సంతృప్తి చెందడమేగాక తమ శక్తిసామర్థ్యాలను పెంచుకొని పటిష్ఠంగా ఉంటూ భవిష్యత్తులో ఎటువంటి పరిస్థితులనైనా ధైర్యంతో ఎదుర్కొంటామనే ఆత్మవిశ్వాసంతో వ్యవహరిస్తున్నారు.

---



దేశమభివృద్ధి పొందవలెనన్న తీవ్ర దేశాభిమానము, స్వార్థత్యాగము స్త్రీలనక పురుషులనక ఆబాలగోపాలమున కుండవలసినదే. దేశాభిమానమే మనమతముగ నుండవలెను. ప్రతి గృహము దేశమాతృదేవత యాలయముగ నుండవలెను. గృహయజమానుడు దానియర్చకుడు. దీనికి దేశములో నైకమత్యము విశేషముగ నుండవలెను. "ఐకమత్యము" అను పంచాక్షరీ మహామంత్రము ప్రతిమానవుడు పునశ్చరణము జేసి యాచరింపవలెను.

కళాప్రపూర్ణ చిలకమర్తి
"స్వీయచరిత్ర"లో



## ప్రజావాణి

# కేంద్రం నేడు వసూలుచేస్తున్న అదనపు ఎక్సైజు పన్నులు

3 వ ప్లాను తర్వాత నాల్గవ ప్లానుకు 3 సంవత్సరాలు సెలవు తీసుకోవడం జరిగింది. అందుకు ద్రవ్యలోపం దానికి కారణంగా చెపుతున్నారు. ఈ లోగా వార్షిక ప్రణాళికలంటూ 66_67, 67_68, 68_69 సంవత్సరాలకు వేస్తున్నారు. ఈ వార్షిక ప్రణాళికలకు కేంద్రంనుండి ద్రవ్యం అపేక్షించడం భావ్యంకాదని తమ వనరులు తామే చూచుకోవలెనని రాష్ట్ర ప్రభుత్వాలకు కేంద్ర ప్రభుత్వమేమి, ప్లానింగు కమీషన్ యేమి, జాతీయఅభివృద్ధి మండలి యేమి సలహా యిస్తున్నారు. దీన్ని చూస్తే ప్లానింగుయుగం గతించి పోయిందా అనిపిస్తుంది.

నిజంగా రాష్ట్ర ద్రవ్యస్థితి అనుదినం కొంచెం కొంచెంగా చొరవతీసికొని అన్ని వనరులను తామే కేంద్రం హస్తగతం చేసుకున్నది. ఎంతవరకూ భూమిశిస్తు ఒకటి పెంచండి అనడం ఒకటి నేర్చుకున్నారు.

కేంద్రం వసూలు చేస్తున్న పన్నుల్లో రాబడి పన్ను, కేంద్ర ఎక్సైజుపన్నులు ముఖ్యమైనవి. ఈ రాబడిపన్ను రెండురకాలు. ఒకటి వ్యక్తులనుండి వసూలు చేసే రాబడి పన్ను. రెండు కార్పొరేషనులనుండి, కంపెనీలనుండి వసూలుచేసే రాబడి పన్ను. దీనిని కార్పొరేషనుపన్ను అంటారు. ఈ కార్పొరేషనుపన్ను రాబడి పన్నువలె రాష్ట్రాలకు పంచటానికి రాజ్యాంగం అడ్డం వస్తున్నదంటున్నారు. రాజ్యాంగ నిషేధం ఉన్నమాట నిజమే. యదార్థానికి ఈ రెండుపన్నులు ఒక శాసనం క్రిందనే వసూలుచేయడం జరుగుతున్నది.

అయితే రాబడి పన్నులో నూటికి 75 శాతం రాష్ట్రాలకు పంచుతున్నారు. కాని కార్పొరేషను పన్ను పంచడంలేదు. రాబడి పన్ను రాబడి తగ్గుతున్నది. కార్పొరేషను పన్ను పెరిగిపోతున్నది. పెరిగేదానిలో రాష్ట్రాలకు భాగంలేదు. రాబడి పన్నుకన్నా 1966_67 బకాయియే ఎక్కువగా వుండిపోయింది.

కార్పొరేషనుపన్ను రాష్ట్రాలకు రాదుకదా, ఇతరపన్నులు వసవా? ఎక్సైజు పన్నులో కొంతభాగం వస్తున్నది. ఈ ఎక్సైజులో రెండున్నవి. ఒకటి_సెంట్రల్ ఎక్సైజు. రెండు_సెంట్రల్ అదనపు ఎక్సైజు. ఈ సెంట్రల్ అదనపు ఎక్సైజు ఇదివరలో రాష్ట్రాలు అమ్మకాల పన్నుగావేసిన మిల్లుగుడ్డలు, చక్కెర, పొగాకులపై వేసిందే. 1956 లో జాతీయ అభివృద్ధి మండలి దీనిని కేంద్రపరం చేయవలెనని కోరింది. ఆనాడు కేంద్రంలో_రాష్ట్రాలలో అన్ని కాంగ్రెస్ ప్రభుత్వాలు గా. ఇష్టంవున్నా లేకపోయినా చివరకు అంగీకరించడం జరిగింది. అయితే రాష్ట్రాలు తమకీ ఆదాయం పోతున్నదని వత్తిడిచేస్తే, ఆయారాష్ట్రాలలో మిల్లుగుడ్డలు, చక్కెర, పొగాకులపై ఆనాటికివేసి, వసూలుచేస్తున్న మొత్తాలు రాష్ట్రాలకు యివ్వడానికి గ్యారంటిచేశారు. ఈ విధంగా గ్యారంటీచేసిన మొత్తాలు ఈ విధంగా వున్నవి:

### అదనపు ఎక్సైజు పన్నులు

(లక్షల రూపాయలలో)

| రాష్ట్రం | మిల్లు గుడ్డలు | చక్కెర | పొగాకు |
|---|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 120 | 40 | 75 |
| అస్సాం | 40 | 15 | 30 |
| బీహార్ | 80 | 30 | 20 |
| బొంబాయి | 600 | 245 | 115 |
| కేరళ | 38 | 20 | 37 |
| మధ్యప్రదేశ్ | 83 | 40 | 32 |
| మద్రాసు | 168 | 60 | 57 |
| మైసూరు | 48 | 25 | 27 |
| ఒరిస్సా | 50 | 20 | 15 |
| పంజాబు | 95 | 50 | 30 |
| రాజస్థాన్ | 50 | 25 | 15 |
| ఉత్తరప్రదేశ్ | 400 | 112 | 63 |
| పశ్చిమ బెంగాల్ | 204 | 36 | 40 |
| మొత్తం | 1926 | 788 | 556 |

ఈ మొత్తాలు గ్యారంటీ చేస్తూ అందుకు అదనంగా ఆదాయం వుంటే ఆయా రాష్ట్రాలకు వారి జనాభా ప్రాతిపదికపై శాతం వారిగా యివ్వవలసిందిగా నిర్ణయించుతూ సంతానం అధ్యక్షతన యేర్పడిన రెండవ ఫైనాన్సు కార్పొరేషను సిఫారసు చేసింది. దాన్ని కేంద్రప్రభుత్వం అంగీకరించింది. అప్పటినుండి ఆ మొత్తం ఎదుగు బొదుగు లేకుండా వుండిపోయింది. మూడవ ఫైనాన్సు కమీషను శ్రీ చందా అధ్యక్షతన వచ్చింది. ఈ మూడు అంశాల ఆదాయాలపై యిచ్చిన గ్యారంటీ మొత్తాలతో బాటు అదనంగా సిల్కు గుడ్డల వేసిన పన్నును కూడా కలుపుకొని ఈ విధంగా ఆయా రాష్ట్రాలకు గ్యారంటీ మొత్తాలు నిర్ణయించారు:

### అదనపు ఎక్సైజు పన్నుల గ్యారంటీ

| | రాష్ట్రం | (లక్షల రూపాయలు) |
|---|---|---|
| 1. | ఆంధ్రప్రదేశ్ | 235.24 |
| 2. | అస్సాం | 85.08 |
| 3. | బీహార్ | 130.16 |
| 4. | గుజరాత్ | 323.45 |
| 5. | కేరళ | 95.08 |
| 6. | మధ్యప్రదేశ్ | 155.17 |
| 7. | మద్రాసు | 285.31 |
| 8. | మహారాష్ట్ర | 637.77 |
| 9. | మైసూరు | 100.10 |

| | | |
|---|---|---|
| 10. | ఒరిస్సా | 85.10 |
| 11. | పంజాబు | 175.10 |
| 12. | రాజస్థాన్ | 90.10 |
| 13. | ఉత్తరప్రదేశ్ | 575.81 |
| 14. | పశ్చిమ బెంగాలు | 280.41 |
| | మొత్తం | 3254.00 |

వీటితో బాటు వీటికి అదనంగా ఉన్న మొత్తాలలో శాతాలు కూడా నిర్ణయించారు. మరల 1965 లో జస్టిస్ రాజమన్నార్ అధ్యక్షతన నాల్గవ కమీషను వచ్చింది. ఆ కమీషనుకూడా పరిశీలన చేసి ఈ మొత్తాలకే గారంటీచేసింది.

అయితే ప్రతి కమీషనుముందు ఆయా రాష్ట్రాలు ఎప్పటి కప్పుడు ఈ మొత్తాలు వసూలు చేసుకొనే హక్కు నిర్ణయించే హక్కు తమకు యివ్వవలసిందిగా కోరాయి. 1956 లో వేసిన మొత్తాలు మాత్రం వసూలు చేయడంవల్ల నష్టం వస్తున్నదని, ఇతర పన్నులు పెరిగిన దామాషాను పెరగడం లేదని వివరించారు. ప్రయోజనం లేకపోయింది.

గత డిసెంబరు 1,2 తేదీలలో జరిగిన జాతీయాభివృద్ధి మండలి సమావేశంలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి ఈ విషయం ప్రస్తావన చేయడం జరిగింది. ఇతర రాష్ట్రాల ముఖ్యమంత్రులు దీనిని బలపరచి అభ్యర్థించడం జరిగింది. అందుకు కేంద్ర ఆర్థిక మంత్రి అన్ని రాష్ట్రాలు కోరితే ఆలోచించుతానన్నారని పత్రికల్లో వచ్చింది. నిజమెంతో తెలియవలసి వుంది. నిజమయితే కొంత సంతోషించ దగిందే. ఈ అదనపు ఎక్సయిజు పన్నులకు చెందిన మిల్లుగుడ్డలు, చక్కెర, పొగాకులపై పన్ను వసూలు చేసుకొనే హక్కు రాష్ట్రాలకు యివ్వడం నిజంగా మాది మాకిస్తే మడిమాన్యాలు యిచ్చినట్టన్న సామెత నిజంగా యదార్థం అవుతుంది. ఆ నాడు నిర్ణయించినప్పటి అమ్మకాల పన్నుల వసూలు ఈనాటి అమ్మకాల పన్నుల వసూలుచూస్తే ఈ 1956 లో చేసిన గ్యారంటీలోని యదార్థ స్థితి అవగాహం అవుతుంది. ఆ వివరాలివి:

## అమ్మకం పన్నులు

లక్షల రూపాయలు

| రాష్ట్రం | 1956_57 | అదనపు ఎక్సైజు | 1967_68 |
|---|---|---|---|
| ఆంధ్ర | 370 | 235.24 | 3034 |
| అస్సాం | 153 | 85.24 | 550 |
| బీహార్ | 382 | 130.16 | 2386 |
| బొంబాయి / మహారాష్ట్ర | 2417 | 637.77 | 9396 |
| గుజరాత్ | ... | ... | 3782 |
| హైదరాబాద్ | 325 | ... | ... |
| మధ్యభారత్ | 150 | ... | ... |
| మధ్యప్రదేశ్ | 318 | 155.17 | 2064 |
| మద్రాసు | 1124 | 285.34 | 4911 |
| మైసూరు | 201 | 100.10 | 2636 |
| ఒరిస్సా | 140 | 85.10 | 1226 |
| పంజాబు | 285 | 175.17 | 1436 |
| హరియానా | ... | ... | 793 |
| రాజస్థాన్ | 146 | ... | ... |
| సౌరాష్ట్ర | 133 | ... | ... |
| కేరళ | 236 | 95.08 | 2097 |
| ఉత్తర ప్రదేశ్ | 620 | 575.81 | 3204 |
| పశ్చిమ బెంగాల్ | 504 | 280.41 | 5034 |
| మొత్తం | 8023 | 3254.00 | 45065 |

అంటే అమ్మకాల పన్నులవల్ల అదే దేశవ్యాప్తంగా 1956 లో 8,023 లక్షలుంటె ఈనాడు 1967_68 లో 45,065 లక్షలుంది. అయిదువంతులు నుంచి దాదాపు ఆరు వంతులు పెరిగింది. మరి ఈ మూడు అంశాలమీదనే 3,254 లక్షలు మనకు వస్తున్నవి. అందువలన వీటిని రాష్ట్రాలకు అప్పచెప్పితే వారు ఇతర అమ్మకాల పన్నులస్థాయిలో దీనిని రాబడి వెసులుబాటు నుపయోగించగలుగుతారు. ఆంధ్రప్రదేశ్‌లో ఈ అమ్మకాల పన్ను క్రమానుగతంగా పెరిగిన వివరాలీ క్రింది విధంగావున్నవి:

## ఆంధ్రప్రదేశ్‌లో అమ్మకాల పన్నులు

| సంవత్సరం | (లక్షల రూపాయలలో) |
|---|---|
| 1957_58 | 893.40 |
| 1958_59 | 845.52 |
| 1959_60 | 1080.41 |
| 1960_61 | 1189.23 |
| 1961_62 | 1336.87 |
| 1962_63 | 1397.29 |
| 1963_64 | 1743.01 |
| 1964_65 | 2203.59 |
| 1965_66 | 2231.93 |
| 1966_67 | 2835.72 |
| 1967_68 | 3033.57 |

రాష్ట్రాలకు కేంద్రానికి ఉన్న ద్రవ్యసంబంధాలు ఫెడరల్ విధానాన్ని బలపరిచే విధంగానూ, రాష్ట్రాలకు మనగలిగే విధంగాను ద్రవ్యవనరులు స్థిరత యేర్పడడం అవసరం. ఈ అదనపు పన్నులు రాష్ట్రాలపరం కావడం అవసరం. ఈ విధంగా రాష్ట్రాలకు ఈ పన్నులు సంక్రమింపచేస్తే, ఆంధ్రప్రదేశ్‌కు రూ. 235 లక్షల మొత్తాలు అయుదువంతులకుపెరిగితే దాదాపు రూ12 కోట్లవరకు అదనంగా ఆదాయం సమకూరే అవకాశం లభిస్తుంది. కనీసం రెండు వంతులు పెరిగినా 5 కోట్లు లభిస్తవికదా. అవి కేంద్రము చేతుల్లో ఉండేందుకన్నా రాష్ట్రాలచేతుల్లో ఉండడం, రాష్ట్రాలుకూడా ప్రభుత్వాలని, వారి ఆర్థిక వనరులు అవసరం అని ఈనాటి అభివృద్ధి కార్యక్రమాలు అమలు జరుపుకొనుటకు సహాయకం కాగలుగుతుంది. అందుచే అన్ని రాష్ట్రాలు కేంద్రంనుండి ఈ హక్కును తమ అభివృద్ధికి అవసరానికి సాధిస్తారని ఆశిస్తాను.

—వావిలాల గోపాలకృష్ణయ్య

# జిల్లాలనుండి

## మాటూరు అగ్నిబాధితులకు సహాయక చర్యలు

ఖమ్మం జిల్లాలోని మాటూరు గ్రామంలో అగ్నిబాధితులకు జనవరి 18న సేటిపారుదల శాఖా మంత్రి శ్రీ ఎస్. సిద్దారెడ్డి రూ 6,650 లు పంపిణీ చేశారు. గతవేసవిలో ఈ గ్రామంలో అగ్ని ప్రమాదం సంభవించి అనేక పాకలు తగలబడి విపరీతమైన నష్టం సంభవించినప్పుడు ఆ అగ్నిబాధితులకు సహాయ చర్యగా ప్రధాని సహాయక నిధినుండి యీ మొత్తం మంజూరైంది. యీ మొత్తంకాక యింతకు పూర్వం స్వచ్ఛంద సంస్థలూ రాష్ట్రప్రభుత్వమూ రూ. 20,000లు అందజేసాయి. లోగడనే ఆ మొత్తాన్ని పంపిణీచేశారు.

## ఎరుకుల సహకార సంఘానికి ప్రారంభోత్సవం

మంగళగిరికి అయిదుమైళ్ళదూరంలో వున్న తాడేపల్లిలో జనవరి 1వ తేదీన సీతానగరం ఎరుకల సహకార సంఘానికి శాసన సభ్యుడు శ్రీ టి. నాగేశ్వరరావు ప్రారంభోత్సవం చేశారు.

## పాఠశాల భవనానికి ప్రారంభోత్సవం

పాలకొల్లులో గతనెలలో రూ. 20,000 ల వ్యయంతో నిర్మించిన పురపాలక సంఘ బాలికల ఉన్నత పాఠశాల భవనానికి ప్రారంభోత్సవం జరిగింది. బంగారు రామారావు తమ భార్య శ్రీమతి రంగనాయకమ్మ పేరున విరాళంగా యిచ్చిన సొమ్ముతో యీపాఠశాలను నిర్మించారు.

## గురజాడ కళామందిర్‌కు ప్రారంభోత్సవం



విశాఖ పట్టణంలో ఎన్. జి. ఓ. క్లబ్బు ఆవరణలో రూ. 20,000 లతో వారు నిర్మించుకున్న ఆరు బయలు రంగస్థలం



ముఖ్యమంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి డిసెంబరు 25న ఇబ్రహీంపట్నంలో భూములేని బీదలకు పట్టాలను పంచుతున్న దృశ్యం

''గురజాడ కళామందిర్'' ను విశాఖ జిల్లా కలెక్టరు జనవరి 4 న ప్రారంభోత్సవం చేశారు. దీని నిర్మాణం మొత్తం 75 రోజులలో పూర్తయింది. ఎన్. జి. ఓ. లే అధికభాగం స్వచ్ఛందసేవను అందజేశారు.

## పట్టాల పంపిణీ

భూములేని బీదలకు 351 ఎకరాల పంపిణీకి సంబంధించిన పట్టాలను నర్సీపట్నం ఇన్‌చార్జ్ సబ్ కలెక్టరు శ్రీ పి. రామకోటయ్య పంపిణీ చేశారు. పట్టాలు అందుకున్నవారిలో 19 మంది హరిజనులు, 11 మంది గిరిజనులు కూడా వున్నారు.

## శంకవరం స్థాయీ సంఘం

శంకవరం పంచాయితీ సమితి స్థాయీ సంఘం జనవరి 19 న శంకవరంలో సమావేశమైంది. ఈ సమావేశంలో గ్రామీణ మంచినీటి సరఫరాకు రూ. 50,000 లు , ఎలిమెంటరీ పాఠశాలల ఉపాధ్యాయులకు బకాయీలను చెల్లించేందుకు రూ. 10,000 లు మంజూరు చేయడం జరిగింది. 11 మహిళామండలులకు కుట్టుమిషన్లను కూడా మంజూరు చేసింది.

## వివేకానంద జయంతి

గుడివాడలోని ప్రణవాశ్రమంలో జనవరి 20 వతేదీన వివేకానంద జయంతి ఘనంగా జరుపబడింది.

## మహిళా మండలి భవనానికి ప్రారంభోత్సవం

ఏలూరు దగ్గర్లోని కైకరంలో మహిళామండలి భవనానికి అమెరికన్ శాంతిదళం డైరెక్టరు డేవిడ్ ఇలియట్ జనవరి 17 న ప్రారంభోత్సవం చేశారు. ఈ భవనాన్ని కేర్ నిధి సహాయంతో నిర్మించారు.

పి. సి. జైన్

రాష్ట్ర జనసంబంధశాఖ ద్వారా ప్రభుత్వం జనవరి 8 నుంచి 14 వరకు రాష్ట్రమంతటా రాష్ట్ర జనవారోత్సవాలను జరిపించడం ప్రారంభించింది. సాంస్కృతిక రంగంతో ముడిపడివున్న యీ కార్యక్రమాలు ఒకానొక ప్రత్యేకతను సంతరించుకున్నాయి. జిల్లా స్థాయిలోనూ, ఆ క్రింది స్థాయిలోనూ వారంరోజులపాటు జరిగే యీ కార్యక్రమాలు ప్రధానంగా వ్యవసాయదారుల జీవితాలను పరివేష్టించి వున్నాయి. ఇంత సువిశాల ప్రజాస్వామిక దేశంలో ప్రజలు వారివారి బాధ్యతలు, హక్కులు; వారి వారి శక్తి సామర్థ్యాలు, గుణగణాలు, యోగ్యతలు మొదలైన వాటిని గూర్చి విడివిడిగానూ, సమిష్టిగాను తెలుసుకునేట్టూ, అర్థం చేసుకునేట్టూ చూడడం చాలా అవసరం. అంతేకాదు తమతమ శక్తి సామర్థ్యాలను, గుణగణాలను, యోగ్యతలను అభివృద్ధి పరచుకునే అవకాశాలను గూర్చికూడా వారు తెలుసుకునేట్టు చేయడం మరీ అవసరం. తెలుసుకునేట్టు చేయడమేకాదు వారివారి యోగ్యతలను, విజయాలను ప్రతిస్థాయిలోనూ గుర్తించి ప్రజల అభినందననీ, గౌరవాన్నీ వారికి కలిగించి, తద్వారా వారిని ప్రోత్సహించడం అత్యంత అవసరం. ఈ విధమైన గుర్తింపును దృష్టిలో వుంచుకునే, జనవరి 8 నుంచి వారం రోజులపాటు జరిగే ఉత్సవాన్నొకదానిని ప్రభుత్వం ప్రారంభించింది.

వారంరోజులపాటు ఉత్సాహంగా యీ ఉత్సవాన్ని జరిపించే వుద్దేశంతోనూ, రాష్ట్రమంతటా ఒకే పద్ధతిలో వీటిని జరిపించే వుద్దేశంతోనూ రోజూ ఒక్కొక్క ప్రత్యేక తరహా కార్యక్రమాలకు కేటాయించడం జరిగింది. ఈ జనవారోత్సవాలను ఏటా జరిపించాలని ప్రభుత్వం ఉద్దేశిస్తున్నది. ఈ ఏడాది విజయాలను బట్టిచూస్తే భవిష్యత్తు మరింత ఆశాజనకంగా వుండగలదని విశ్వసించవచ్చు.

## ఎగుమతులకు ప్రోత్సాహం

మనరాష్ట్రంలో వర్తక వాణిజ్య రంగంలో పెట్టుబడి పెట్టడానికి ముందుకువచ్చే వ్యక్తులు తగినంతగా లేకపోవడం వల్లా, రాష్ట్రంలో మందకొడిగా జరుగుతున్న పారిశ్రామిక అభివృద్ధివల్లా ఆంధ్రప్రదేశ్‌నుంచి జరిగే ఎగుమతి వాణిజ్యం చెప్పుకోతగినంతగా లేదు. విదేశీ వాణిజ్యానికి సంబంధించిన భారతీయ సంస్థ మన రాష్ట్రంలో జరిపిన పరిశీలనలో ప్రధానంగా వెల్లడైన విషయమిది. మొత్తం దేశంనుండి జరిగే విదేశీ ఎగుమతులలో రాష్ట్ర ఎగుమతులు ఎంత మేరకు వున్నాయో, ఎగుమతుల్ని పెంచడానికి గల అవకాశాలేమిటో భేరీజువేసే నిమిత్తం యీ సంస్థ పరిశీలనలు జరిపింది.

ఎగుమతులను గురించి అంతగా పట్టించుకోకపోవడం, ఎగుమతులవల్ల ఒనగూడే లాభాలను గూర్చి గానీ ఎగుమతుల ప్రోత్సాహానికి ప్రభుత్వం అందజేస్తున్న సౌకర్యాలను గూర్చిగానీ అట్టే ఆలోచించక పోవడం జరుగుతున్నదని యీ నివేదికలో వెల్లడైంది. రాష్ట్రంలో ఉత్పత్తి అయ్యే సరుకులను ఎగుమతిచేసే కార్పొరేషనును ఒకదానిని ఏర్పాటు చేయాలని రాష్ట్ర ప్రభుత్వానికి యీ విదేశీ ఎగుమతుల భారతీయ సంస్థ సిఫారసు చేసింది. ఈ పరిశీలక నివేదికను జనవరి మొదటివారంలో కేంద్ర వాణిజ్యమంత్రి విడుదల చేశారు.

ఎగుమతుల ఆవశ్యకతను గుర్తింపజేసే విధంగానూ, ఎగుమతులకు సంబంధించిన సమాచారాన్నీ, ఆ విషయంలో లభించే సహాయాన్నీ అందజేయడానికి వీలుగానూ, ఆయా వస్తువుల ఎగుమతులకు ప్రస్తుతం వున్న అవకాశాలను తెలియజెప్పడానికి వీలుగానూ, ఎగుమతి వస్తువుల ఉత్పత్తికి అవసరమయ్యే ముడి పదార్థాలను సేకరించే విషయంలో తోడ్పడే విధంగానూ ఈ కొత్తగా ఏర్పాటు చేసిన వాణిజ్యం, ఎగుమతుల ప్రోత్సాహక శాఖను పునర్వ్యవస్థీకరించాలని పై నివేదిక సిఫారసు చేసింది. ఆంధ్రప్రదేశ్‌నుంచి 1965-66 లో జరిగిన ఎగుమతులు రూ. 15.9 కోట్ల విలువ మేరకు మాత్రమే వున్నాయని యీ నివేదిక పేర్కొన్నది. ఈ ఎగుమతులలో ప్రధానంగా పొగాకు (రూ17.5 కోట్లు), చేనేత వస్త్రాలు (రూ.5.7 కోట్లు) వనస్పతి, ఆయిల్ కేకులు (రూ. 5 కోట్లు) మైకా తదితర ఖనిజోత్పత్తులు (రూ. 2.2 కోట్లు) వున్నాయి.

## ఆశా కిరణం

ప్రభుత్వోద్యోగుల కరువుభత్యాన్ని జనవరి మొదటి వారంలో ప్రభుత్వం ప్రకటించింది. నిరాశా ఆందోళనల వాతావరణంలో యిది ఒక విధంగా ఆశాకిరణంగా భావించవచ్చు. 1968 జనవరినుంచి పెంచిన ఈ కరువుభత్యంవల్ల ఏడాదికి రూ. 8.5 కోట్లు ప్రభుత్వానికి ఖర్చవుతుంది. పెంచిన కరువుభత్యంలో సగం మొత్తాన్ని నగదు రూపంలో చెల్లించి, మిగిలిన సగాన్ని ఉద్యోగుల ప్రావిడెంట్ ఫండులో కలిపివేస్తారు. ప్రభుత్వోద్యోగులకు, స్థానిక సంస్థల సిబ్బందికి, అన్ని పాఠశాలల ఉపాధ్యాయులకు, ప్రభుత్వ పారిశ్రామిక సంస్థలలో పూర్తికాలం పనిచేసే సిబ్బందికి యిది వర్తిస్తుంది.

ప్రభుత్వోద్యోగులు, జాయింట్ స్టాఫ్ కౌన్సిలు ప్రతినిధులతో యీ విషయమై ప్రభుత్వం ముందుగా సంప్రదింపులు జరిపింది. అయినా ప్రభుత్వోద్యోగులు సంతృప్తి చెందినట్టు లేదు. తమ అసంతృప్తిని బహిరంగంగా ప్రకటించారు వారు. వచ్చే నెలల్లో తమ ఆందోళన మరింత తీవ్రంగా కొనసాగించగలమని వీరి సంస్థలు ప్రకటించాయి కూడా.



